ఓమ్

# కాళిదాస హృదయము





కృతికర్త:

ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

## కృతికర్త యొక్క జననీజనకులు





కామేశ్వరి



రామమూర్తి

ఓమ్

# కృతిసమర్పణమ్



జన్మాద్యారభ్య కౌంతంతౌ మమాఽభ్యుదయమేవ యౌ।
కామాక్షీరామమూర్త్యాఽఖ్యౌ వందే మత్పితరౌ సదా॥ ౧

యాభ్యాం పితృవ్యచరణాః వేద మధ్యాపయంశ్చ మామ్।
అధ్యాత్మజీవితకరౌ వందే మత్పితరౌ సదా॥ ౨

వాత్సల్యామృతయుక్తాభ్యాం పితృభ్యాం భక్తిభావతః।
ముదా సమర్పయామ్యద్య మత్కృతిం కుసుమంయథా॥ ౩

ఓమ్

# గుర్వాశీరభ్యర్థనమ్

"క్షేమంకరాణి సకలేంద్రియనందనాని
సర్వై ర్మహోఽభ్యుదయభవ్యఫలై ర్యుతాని।
ఆశీర్వచాంసి సతతం మహతాం గురూణా
మభ్యర్థయే సకలకాంక్షితసంభృతాని॥

# నా మనవి

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
అధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
* * * *
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధశాస్త్ర తత్త్వవేది వేదజ్ఞుండు
కావ్యమర్మవేది కాళిదాసు
విశ్వహితకరుండు విశ్వజనీనమై
ఘనతకెక్కఁజేసె కావ్యచయము ॥"

పై ప్రశస్తికి సంపూర్ణముగ పాత్రమైన మన కాళిదాస మహాకవి తన కావ్యములను సర్వజగద్ధితకరంబులుగ రచించి కవికుల గురువైన విషయము విశ్వవిదితమైనది. కనుకనే మన మల్లినాథసూరి యీ కవితల్లజుని కవితం గూర్చి

"కాళిదాసగిరాం సారం కాళిదాస స్సరస్వతీ ।
చతుర్ముఖోఽథవాసాక్షా ద్విదుర్నాఽన్యేతుమాదృశాః"

అని దెలిపినాడు. ఇట్టి కవీశ్వరుని కమనీయ మహాకావ్యములనుగూర్చి యల్పాఽల్పజ్ఞుఁడనైన నేను వ్రాయఁబూనుట, దినమణిని దివ్వెతోఁ దెలుపనెంచుటవంటిదే యగును. ఐనను బలవత్తరమగు నొక చాపలము నన్నీ సాహసకార్యమునకుఁ బురికొల్పినది. ఈ నా సాహసమును మనీషులు మన్నించెదరుగాక.

సముజ్వలభావ సంభరితములైన కాళిదాసోపమానములలో నొకదానికంటె నింకొకటి మహత్తరభావభాసితమై మధురాఽతి మధురముగ నుండును. అట్టి యుపమానములలో నుదాహరణార్థమై యేవేవి గ్రాహ్యములు? అన్న విషయములో తన్మధురిమాస్తబ్ధచిత్తుఁడనైన నేను నిజమునకు కింకర్తవ్యతా మూఢుఁడనై కాళిదాస కావ్యామృతభాండమునుండి పైకి స్రవించిన కొన్ని యుపమానాఽమృత బిందువులను మాత్రమే గ్రహింపగల్గితిని. కాని తదాస్వాదన భాగ్య ప్రాప్తిలో నెంతవరకుఁ జరితార్థుఁడనైతినో పాఠకోత్తములే నిర్ణయించదగియుండిరి. కనుక మొదటి వ్యాసము తదుపమాన స్వారస్య ప్రకటన విషయములో అల్పసూచికవంటిదని నా మనవి.

"దీపశిఖా" వ్యాసములో కాళిదాసునకు ఈ "దీపికా" "దీపశిఖా" నిర్దేశములపై గల మోజు ప్రకటితమైనది. ఇక "వాల్మీకి-కాళిదాసు" అను వ్యాసములో వాల్మీకి మునియందు కాళిదాసునకు గల "మహిత గురుత్వ" భావము దిఙ్మాత్రముగ ప్రకటితమైనది. ఇందుల కొక యుదాహృతి.

"తామభ్యగచ్ఛ ద్రుదితాఽనుసారీ
కవిః కుశేధ్మాఽహరణాయ యాతః।"

(చూ. రఘువంశము సర్గ 14. శ్లో 70)

ఇందు కాళిదాసు ప్రయోగించిన "కవి" శబ్దము ఒక్క "వాల్మీకి ముని" కే యుద్దిష్టమైనది. కాగా "కవి" శబ్దము ఒక్క వాల్మీకి మహర్షికే తగునని యీ కవి భావము. ఈ కవికి 'వాల్మీకి' యందు గల యీ "గురు" భావమే యీ కవిచే శ్రీమద్వాల్మీకి రామాయణమును తన కావ్యరచనకు మూలముగా గ్రహింపఁజేసినది. రామాయణ శైలి, భావము మున్నగువాని యనుకరణమునకుఁగూడ కాళిదాసునకు పై భావమే మూల మనఁదగును.

ఇట్లే "శ్రౌతవిజ్ఞానము" లో మానవునకు స్వవిహిత కర్మా
రణము చతుర్విధ పురుషార్థసిద్ధి దాయకమనియు, "ప్రకృతిసమాజీవ
ము" లో ప్రతి మనుజునకును చరాఽచరప్రపంచముతో నుండవల
సంబంధబాంధవ్యములును "సూక్తిమౌక్తికములు" లో, లోక
భావము అనునవి సూచితములైనవి. ఇక తుదివ్యాసములో విభిన్న
ానవసంఘములు విశ్వకల్యాణమునకు ఎట్లు అర్హత సంపాదించ
లెనో, తత్సిద్ధికి ఏది మార్గదర్శకమో సోదాహరణముగ వివృతమై
ి. ఇట్లే కాళిదాస కావ్యములు విశ్వశ్రేయ స్సంపాదనములో
ఖ్యపాత్ర వహించిన రీతిని నా యల్పాఽల్ప జ్ఞానముతో సూచిం
తిని. భారతీయసంప్రదాయ ప్రదర్శనమున కీ కవి కావ్యములు
హితసాధనములని నా భావము.

ఈ పుస్తక ముద్రణములో ప్రూఫ్‌లు సరిచూచి నాకు
దోడు వాదోడుగనున్న బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారా
యణ శాస్త్రిగారికి నా కృతజ్ఞతా వందనము లర్పించెదను. ఈ పుస్త
ము పంపించినంతనే సాదరముగఁ జదివి తమ యుదారాఽశయములు
వ్రాసి పంపించిన విశ్వ విజ్ఞాన విరాజితులు పండిత వరేణ్యుల కందఱ
ను నా హృదయపూర్వక నమోవాకము లర్పించెదను. ఈ ముద్రణ
మునకు మొదట ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికా సంపాదకులు నావ్యా
ములఁ గొన్నిటిని తమ పత్రికలో ప్రచురించి, నాకోరికపై నావ్యాస
ాగములుగల కొన్ని ప్రతులు వేరుగ నాకు పంపించుచుండిరి. అందు
కొక్కొక్క వ్యాసభాగమును జదివి పరమానందభరితులై అనేకరీతులఁ
ొనియాడుచు నాకెన్నియో యుత్తరములు వ్రాయించిన మధ్వశ్రీ
శ్రీ కాశీకృష్ణాచార్య మహోదయులకు, ఆంధ్రప్రభుత్వాస్థాన కవివరే
ణ్యులకు, విద్యావారిధి, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
మున్నగు నుత్తమ బిరుదములతో ప్రశస్తిగన్న గురుమూర్తులకు నా
ప్రత్యేక ప్రణామము లర్పించెదను. ఇట్లే నాయందెంతయు వాత్సల్య

భావపూర్ణులై, పండితవరేణ్యులైన బ్రహ్మశ్రీ శ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రి సోదరమహోదయులకు - ఎన్నియో మంచి సూచనల నిచ్చిన ఆత్మీయులకు-ముద్రాపకులకున్ను నా కృతజ్ఞతావందనము లర్పించెదను. ముఖ్యముగా ఈ పుస్తక ముద్రణ విషయమును విన్నవించినంతనే ఏతన్ముద్రణమును సాదరముగ నంగీకరించి తమ యనుమతి పత్రము నొసంగిన మహారాజశ్రీ తూర్పుగోదావరిజిల్లాపరిషత్తు చైర్మన్ వారికిని, మహారాజశ్రీ డిప్యూటీ సెక్రటరీవారికిని నా కృతజ్ఞతా వందనము లందించెదను.

అనుమతిపత్ర వివరము :—

"N. Dis. B 7. 28867/65 D/ 8-11-65

2) The permission applied for is granted"

చివరి వ్యాసముల ప్రూఫ్‌లు సరిచూచిన బ్రహ్మశ్రీ చిలుకూరి లక్ష్మీపతి శాస్త్రిగారికి కృతజ్ఞతా వందనములు.

సంస్కృతాధ్యయనము సేయు కళాశాలా విద్యార్థులకును, సంస్కృతాధ్యయనము సేయు ప్రైవేటు విద్యార్థులకును నా యీ చిన్నిపొత్తము అన్నిటను మార్గదర్శకముగ నుండగలదని యాశించుచుంటిని. ఉన్నతవిద్యాశాఖాధికారులు నా యీ ప్రయత్నమును ఆదరించెదరని నమ్మెదను. భారతీయ సంప్రదాయ సంప్రకాశమునకై ఏతత్పుస్తకప్రచురణముఖమున నా యీ ప్రథమ ప్రయత్నమును ఆంధ్రమహాశయుల హస్తకమలముల కందించి ఆనందించుచుంటినని నామనవి.

ఇట్లు, విద్వజ్జన విధేయుడు,

రచయిత.

# పీ ఠి క

—⊙—

"ఆర్ష విద్యా భూషణ"
జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ , గారు.

"కాళిదాస హృదయ" మను నీ గ్రంథమును రచించిన శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారు పండితరాజ స్వగ్రామమగు ముంగండలో సత్సంప్రదాయవిలసితమయిన విఖ్యాతవంశమున జనించి, వేదాధ్యయనము గావించి, వ్యాకరణాది పరికరముతోఁగూడిన ప్రాచీన పద్ధతి సాహిత్యమును సంపాదించిన సరసహృదయులు. వీరు విశ్వవిద్యాలయమునుండి సంస్కృతాంధ్రములకు సంబంధించిన బిరుద పట్టమునొంది యుపాధ్యాయ వృత్తిలో విద్యార్థులకు బోధించుటతోఁ దృప్తినొందక, తాము గ్రహించిన కాళిదాస సారస్వత రసామృతమును "ఏక:స్వాదు నభుంజీత" యను న్యాయమున నాంధ్రపాఠకాళికి పంచ నెంచి యేతద్గ్రంథరచనకుఁ బూనుకొని కృతార్థులై మనలను కృతార్థుల నొనరించిరి.

బహుముఖ వైభవోపేతమైన కాళిదాస సారస్వత విమర్శ మును వీరు 1. "ఉపమా కాళిదాసస్య" 2 "దీపశిఖ" 3. "వాల్మీకి-కాళిదాసు" 4. సౌందర్యసమారాధనము-విశ్వప్రేమము" 5. ప్రకృతి సహజీవనము" 6. "ఋతుసంహారము-కవితాసామగ్రి" 7. "హిమాలయ ప్రకృతి" 8. "సూక్తిమాక్తికములు" 9. "ధర్మశాస్త్రవిజ్ఞానము" 10. "శ్రౌతవిజ్ఞానము" 11. "శివభక్తితత్వము - తత్వజ్ఞాన వైభవము" అనుశీర్షికల క్రింద విభజించి కాళిదాసహృదయమును ఆవిష్కరించినారు.

"ఉపమా కాళిదాసస్య" యను లోకోక్తి పౌనఃపున్యముగ లోకములో వినఁబడుచున్న దేకాని యిందలి సత్యముఁ ప్రజల హృద

యమునకు హత్తుకొని పోవునట్లు విస్తరించి బహూదాహరణ పురస్సరముగా నందించిన వారింతవరకు లేకుండిరి.

"వాగర్థా వివసంపృక్తౌ" ఇత్యాది శ్లోకమును వ్యాఖ్యానించుచు మల్లినాథుడు "వాగర్థావివేత్యేకం పదం" అని వ్రాసినాడు. ఇప్పట్ల కాళిదాస హృదయమును మల్లినాథహృదయమునుగూడ శాస్త్రిగారు చక్కగా వివరించినారు. ఇచ్చట "వాగర్థా" "ఇవ" అను వానిని విడఁదీయరాదనుటచే శివపార్వతుల యవిభేద్యసంబంధము స్ఫురించుచున్న దనియు ఉపమానోపమేయముల రెంటను "అవ్యయయోగము" గమనింపఁ దగినదనియు శాస్త్రిగారు గావించిన సూచన ప్రౌఢముగా మాత్రమేకాక గ్రాహ్యముగాఁ గూడనున్నది.

"భీమకాంతైర్నృపగుణైః" ఇత్యాది శ్లోకములో ఔపమ్య స్వారస్యమును వివరించుచు శాస్త్రిగారు, "తిమింగిలాది జలజంతు సదృశములగు భీకరగుణములును, రత్నసదృశములయిన కరుణాది మనోహర గుణములును దిలీపునిలో నుండుట"ను చక్కగా వ్యాఖ్యానించినారు.

"హిమనిర్ముక్త యోర్యోగే చిత్రాచంద్ర మసోరివ" అను చోట హిమాపసరణ ప్రసంగముచే త్వరలో సంభవింపనున్న శాపాఽపసరణమును ధ్వనించుచున్న దనుట గమ్యముగా నున్నది.

"పయోధరీ భూతచతుస్సముద్రాం జుగోప గోరూపధరామి వోర్వీం" అనుపట్ల శాస్త్రిగారు నిరూపించిన విశేషణ స్వారస్యము వలన భూపాలుడు గోపాలు డగుట వింతకాదను చమత్కృతి పొడముచున్నది.

కాళిదాసునకు దీప ప్రదీప దీపశిఖాది వర్ణనముల యందమితోత్సాహము కలదని యాయన రచనల వలన తెలియఁగలదు. వివిధగ్రంథములలో తత్ర తత్ర వికీర్ణములై యున్న యీ వర్ణనములను

ఏకత్రితముచేసి పరిశీలించిన కొందరు విమర్శకులు ఈ వర్ణనములు మిక్కిలి మనోహరములుగా నున్నవనియే కాక కాళిదాసునకు ప్రదీప ప్రభపట్ల లోకోత్తరాకర్షణ పక్షపాతములు కలవని నిర్ణయించి, యా యనకు "దీపశిఖా" బిరుదము నొసంగియున్నారు. ఈ విశేషములనన్నిం టిని శాస్త్రిగారు మనకందించుచు ఆంధ్రదేశములో కాళిదాసుని గురించిన యొక యపూర్వభావమునకు వ్యాప్తిని గలిగించిరి.

"నేడు సంస్కృత భాషను నేర్చుకొనదలచినవారు కాళి దాస గ్రంథపఠనమూలమున నేర్చుకొన్నారు కదా, కాళిదాసె వరి గ్రంథమును పఠించి భాషలో వైదుష్యమును సంపాదించెను?" అను శంక చాలమందికి గలుగుచుండును. భాషాపాండితిని కాళిదాసు వాల్మీకి రామాయణ మూలమున సంపాదించెనను నది యసందిగ్ధము. అతడు వాల్మీకి రామాయణమును కంఠస్థముచేసెనన్నను అతిశయోక్తి కానేరదు. ఇందులకు సాక్ష్యములు కాళిదాస గ్రంథములలోన సంఖ్యాకములు లభించును. వర్ణనములలోను, అలంకారములలోను సమాసఘటనములోను, ఇతర సారస్వతాంగములలోను ఈ యిరువుర కును బహుళ సాదృశ్యమేకాక, కొన్నిపట్ల ఐక్యముగూడ కన్పట్టును. ఈ యంశములను నిరూపించు వాక్యములను అనేకములను ఉభయసార స్వతముల నుండియు శాస్త్రిగారు క్రోడీకరించినారు.

సౌందర్య సమారాధన సమితిసందర్భమున నీరచయిత గావించిన సౌందర్యబాహ్యాభ్యంతరవిభాగము, దివ్యసౌందర్యప్రస్తుతి మాలిక ప్రజ్ఞాస్ఫోరకములుగా నున్నవి.

"పార్వతీ సౌందర్యము ప్రణయమందును, ప్రణయము పరి ణయమందును, పరిణయము కుమారప్రభవమునందును సార్థకత నొందెను"

"యౌవనాహంకార దోష దూషితమైన వీరి (పార్వతీశకుం తలల) ప్రేమను నిరాకరింపదలచినట్లు మన కవీశ్వరుడు అట పార్వతికి

ముక్కంటి కంటిమంటలను, ఇట శకుంతలకు అగ్నివంటి దుర్వాసుని దుర్భరశాపమును గల్పించినాడు. అహంకార నిష్కాసన సమర్థములైన యీ సన్నివేశ (ద్వయ) ప్రయోగబలముచే వీరి యౌవనాహంకార కిల్బిష మంతరించినది. ఇంక వీరికి చిత్తనైర్మల్యసిద్ధి కలుగుటకై వీరిచే మన కవి తపస్సు చేయించినాడు.”

“కేవల భౌతిక భోగదృష్టితోనే యెవ్వడును భార్యను నిత్యముగ ప్రేమింపలేడు.”

ఇత్యాది వచనములు గభీర భావభరితములై పాఠకుని యాలోచనా శక్తికి వినియోగమును గల్పించ గల్గియున్నవి.

కాళిదాసు ప్రకృతి వర్ణనమును, తద్గ్రంథస్థ పాత్రల ప్రకృతి సహజీవనమును రచయిత చిత్రించినరీతి బహుసుకుమారముగను సహజముగను గన్పట్టుచు మానవహృదయ వైశాల్యపరమావధిని ప్రదర్శించు చున్నది.

“ఆధార బంధప్రముఖైః” (రఘు. ౫–6)“సఖ,న కేవలం తాత నియోగః। అస్తి మమాపి సోదరస్నేహ ఏతేషు” (శాకుం.1) ఇత్యాది స్థలములలో తరుగుల్మ లతాదులతోను తిర్యగ్జంతువులతోను ఆశ్రమ వాసులకు గల విశ్వప్రేమ వ్యాఖ్యానింపబడినది. “లగ్నద్విరేఫేత్యాది శ్లోకమునకును, “ఆవర్జితాకించిది వేత్యాది శ్లోకమునకును శాస్త్రిగారు ఆంధ్రములో వ్రాసిన సమగ్రవ్యాఖ్యలు కాళిదాసు ప్రకృతివర్ణన సౌభాగ్యమునకు సునిర్మల దర్పణములు.

కాళిదాసు రచనలలోని సూక్తులెన్నియో లోకోక్తులుగా పరిణమించినవి. మరి యే యితర కవినుండియు నిన్ని లోకోక్తులు వెలువడలేదు. ఒక కవి ప్రాశస్త్యమును నిర్ణయించుటలోను” ఆకవి లోకమున కెంత హృద్యముగా కన్పట్టినాడో నిర్ణయించుటలోను కాలతబద్ధగా నుపయోగించు వానిలో నేతాదృశ లోకోక్తి పరిశీలన

మొకటి. ఇది యన్నిభావలకును చెందును. ఆంగ్లకవులలో నెల్ల ఉన్నతుఁడు షేక్స్పియరు. ఆయననుండి ఇంగ్లీషువారికి వచ్చినన్నిలోకోక్తులు మరి యేకవినుండియు రాలేదు. పరిణతభావము, ఉక్తిచమత్కృతి, పదలాలిత్యము, ప్రసన్నత మున్నగు లక్షణములెన్నియో కలసిననేకాని యొక వాక్యము ప్రజలనోట నృత్యము చేయుచు సామెతగా చెల్లుబడి యగుట సంభవింపదు. కావున కాళిదాసకవితామహత్త్వమును మనకు చవిచూపుటలో శాస్త్రిగారు కాళిదాసుని సూక్తులను సుమారు ఏబదింటిని, లోకోక్తులుగా చెల్లుబడి యగుచున్న వానిని "వికారహేతావపి విక్రియన్తే యేషాం న చేతాంసి తఏవధీరాః" "నకామవృత్తిర్వచనీయ మీక్షతే" "భిన్నరుచిర్హి లోకః ఇత్యాదులను వీరు సవివరణముగా ప్రదర్శించుట యెంతయు నభినందనీయముగానున్నది.

కాళిదాస రచనలు ధర్మశాస్త్రానుగుణములని నిరూపించుటకు శాస్త్రిగారు గావించిన కృషి యీ గ్రంథమునకు సమగ్రతను గూర్చినది. శ్రుతిస్మృతితాత్పర్యమును (వ్యంగ్య మర్యాదచే) కాంతా సమ్మితములైన కావ్యములలో లోకమున కందించుటయే కాళిదాసుని హృద్గతాభిప్రాయమనియే బహు విమర్శకుల యభిప్రాయము. శ్రుతులను, స్మృతులను, పురాణములను దృష్టిలో నిడికొనిననేకాని యర్థముకాని మాటలు కాళిదాస గ్రంథములలో మిక్కుటముగా నున్నవి. అందు కొన్నింటిని శాస్త్రిగారు ఉల్లేఖించినారు.

"పార్ష్ణిముక్త వసుధా స్తపస్వినః" అనుచోట అర్ఘ్య ప్రక్షేపణ సందర్భమున నైష్ఠికుఁడు మడమలను పైకెత్తి నిలుచుండవలయునను ధర్మశాస్త్ర వచనమును శాస్త్రిగారు మనకు ప్రమాణీకరించియున్నారు. ఇది యుదాహరణమునకు మాత్రమే ఇట్టి వనేకములు కలవు.

శాస్త్రిగారు చెప్పినట్లు మల్లినాథ సూరియను తాళముచెవి మనకు ప్రాప్తించనిచో నీ కావ్యరత్నపేటికలోని యమూల్యరత్నములు మనకింత సులభములయ్యెడివి కావు.

కాళిదాస హృదయావిష్కరణ విధానమును శాస్త్రిగారు నిర్వహించిన తెఱఁగును జూపుటకై ప్రయత్నించుటలో నీపీఠిక యింతగా పెరిగినది. కాళిదాసు మహాకవి యనియు, ఆతనిఘనత విశ్వాంగీకృతమనియు చెప్పుచు అనిర్దిష్టముగా కాళిదాసును నేఁడు ప్రశంసించువారు అసంఖ్యాకులు. ఆతని ఘనత యిట్టిదని యుదాహరణ పురస్సరముగా సరళ ప్రసన్నమైన భాషలో నచ్చచెప్పువారు అరుదయినట్టి యీ కాలములో శాస్త్రిగారి రచనకు విలువ యింతింతని చెప్పనలవి కాదు. విషయ మహత్త్వమునకు భాషోదాత్తత తోడుకాగా నీ గ్రంథము ఆంధ్రభాషలోని విమర్శవాఙ్మయమున ఉన్నతస్థానము నాక్రమించుచు కాళిదాస మధురకవితా సుధారసాస్వాదనావకాశమును ఆంధ్రుల కెల్లరకు గల్గించు చున్నది.

ఈ గ్రంథము సంస్కృత సారస్వత పారదృశ్వులైన పండితులకు పరమానందమును గల్గించుచు, సంస్కృత సాహిత్య పరిచయము లేనివారికి అందభిరుచిని గౌరవమును గల్గించుచు, కాళిదాస ప్రతిభకు ధ్వజముగా విరాజిల్లగలదని నేను తలచుచున్నాను. కళాశాలలలో సంస్కృతాంధ్ర సాహిత్యాధ్యయనము చేయు విద్యార్థులకీ విమర్శ గ్రంథము అవశ్య పఠనీయముగా నాకు గనుపట్టినది. ఆంధ్రపాఠకావళియు, విద్యాశాఖాధికారులును, విశ్వ విద్యాలయములవారును ఈ గ్రంథమునకు తగిన వినియోగమును కల్పింపగలరని యాశించు చున్నాను.

కాకినాడ.
29—5—66

జటావల్లభుల పురుషోత్తము

# అభివందనమ్



జటావల్లభ పురుషోత్తమః.

1. సూర్యనారాయణ; శ్రీమన్;
సూరిసత్తమ; తే కృతిః ।
గుణగ్రహణపారీణం
కం న సంతోషయే దియం?

2. రమ్యా తే గుణసంపత్తి
ర్విమర్శకుశలా మతిః ।
విద్వజ్జన వినమ్రత్వం
విద్యావ్యసనితా తథా ॥

3. జనిః పండితవంశే చ
సాంప్రదాయికవర్తనం ।
వేదాధ్యయనసౌభాగ్యం
సాహితీపారదృశ్వతా ॥

4. వేత్సి శ్రీకాళిదాసస్య
సౌకుమార్యం గభీరతాం ।
మాధుర్య ముపదేశం చ
కథాకథనకౌశలం. ॥

5. "హృదయం కాళిదాసస్య"
విస్పష్టం పరిదర్శయన్ ।
అధమర్ణా న్కరో త్యాంధ్రాన్
గ్రంథ స్తే నాఽత్ర సంశయః ॥

కాకినాడ,
5-2-65

# పండితాభిప్రాయములు



"అవధాని శిరోమణి", "విద్యావారిధి",
"మహామహోపాధ్యాయ", "కళాప్రపూర్ణ"
కాశీ కృష్ణాచార్యులు, డి. లిట్.,
ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి.
అగ్రహారము, గుంటూరు-1,
3-6-66

బ్రహ్మశ్రీ వేదమూర్తి చి. ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి విద్వన్మణికి ఇతోధికాఽభ్యుదయాఽభివృద్ధి సిద్ధింప నాశీర్వదించుచు కాశీ కృష్ణాచార్యులు వ్రాయించు విశేషములు. ఉ. త. మహాశయా! మీ "కాళిదాస హృదయము" అను సంహితను చదివించుకొని నాపొందిన యానందమునకు మితిలేదు. కాళిదాస పశ్వప్రేమ నాకలించుకొని యారాధించెడి మీ యకుంఠప్రతిభ విశ్వాఽతీతము.

... ... ... ... ...

కాళిదాస మహాకవి గభీరహృదయగతాఽత్యంత రహస్య బహుముఖార్థములను మీవలెఁ గూలంకషముగ గ్రహించి, యాస్వాదించి, యింత సరస సరళ మంజుల విమలపంక్తుల వివరించిన పండితులను నా తొంబది యారేండ్ల యనుభవమున నిప్పటి కెందును గనివిని యుండనుసుఁడీ. వయసునమాత్రము పెద్దనగుట నమస్కరింపఁబోక

"కాళిదాస రహస్య సర్వస్వాఽభిజ్ఞ"

బిరుదోపహారముతో మీకు మరల నితోఽధికాఽభ్యుదయాభివృద్ధి సిద్ధించుగాతమని నా హృదయపూర్వకాఽశీస్సుల విస్తరించుచున్నాడ.



**Dr. Veluri Subba Rao,**
M. A., PH. D., B. O. L, B. Ed.
*Professor of Sanskri,*
ANDHRA UNIVERSITY,

WALTAIR
ANDHHA PRADESH
INDIA
16-6-1966

బ్ర. శ్రీ. ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రిగారు రచించిన "కాళిదాస హృదయము" ను స్థాలీపులాకన్యాయమున జూడఁగలిగిన భాగ్యము నాకుఁ గల్గినది. కాళిదాసీయకవిత నీ పండితు లా యా ముఖ్యశీర్షికల క్రింద విభజించి హృదయంగమమైన శైలిలో సహృదయులగు విద్యార్థులకు, విమర్శక పండితులకు మహోపకృతి నొనర్చిరని చెప్పుట కావంతయు సందియములేదు. ఏ విషయ విభాగమును చర్చించినను కాళిదాసకవితలో ననుస్యూతమైయున్న స్మార్త వైదిక ధర్మ బుబోధయిషను గ్రంథకర్త పఠితల హృదయమునకు హత్తుకొనునట్లు వివరించియున్నారు. కాళిదాసునందలి విశ్వప్రేమ, ప్రకృతి సహజీవనము, ఉపమాలంకారము, కవితాసామగ్రి, సూక్తిమౌక్తికములు, శ్రౌతధర్మశాస్త్రవిజ్ఞానము, తత్త్వజ్ఞానవైభవముగాక విమర్శింపఁదగిన విషయము లేవిగలవు?

ఇట్టి కవిపుంగవుని కవితావైభవమును సరళముగను, సమగ్రముగను విమర్శించి లోకమునకు మహోపకార మొనరించిన శ్రీ సూర్యనారాయణశాస్త్రి గారికి ఆంధ్రలోక మెంతయు ఋణపడియున్నది.

డా॥ దివాకర్ల వేంకటావధాని,
ఎం. ఏ., (ఆనర్సు) పి. హెచ్. డి.

18/4 R T. బరకత్పుర,
హైదరాబాదు - 27,

బ్ర. వే. శ్రీ సూర్యనారాయణ శాస్త్రులవారి సన్నిధికి అనేక నమస్కారములు చేసి వ్రాయు విన్నపములు-

తమ రత్యంత దయాదరములతోఁ బంపిన కాళిదాసహృదయ మను గ్రంథము చేరినది. చేరినదే తడవుగా నందలి వ్యాసము లన్నియు జదివి యానందభరితుఁడ నైతిని. పరిష త్పత్రికలోఁ బ్రచురింపఁబడి నప్పుడే వానిలోఁ గొన్నింటిని జదివియుంటిని. కాళిదాసుని యుపమ లందలి సౌందర్యమును, ఋతుసంహారమునందలి కవితాసామగ్రిని, ఆ మహాకవి ధర్మశాస్త్ర జ్యౌతిషజ్ఞానమును, ప్రకృతి పరిశీలనమును, విశ్వ ప్రేమమును, శివభక్తి తత్త్వమును సోదాహరణముగాఁ బ్రదర్శించు పట్లఁ దాము చూపిన నేర్పు, చేసిన కృషి నాకచ్చెరువు గలిగించినవి. కాళిదాసునకు 'దీపశిఖా' అని బిరుద మొందెననుటకుఁ దాము చూపిన యుక్తులు సమంజసములుగా నున్నవి. వాల్మీకి, కాళిదాసుల కవిత్వములందలి సామ్యములు, కాళిదాసుని సూక్తి మౌక్తికములు అను వ్యాసములు చదివినకొలంది చదువవలెనను నుత్కంఠ కలిగించినవి. తాము కాళిదాసుని హృదయమును పిండి ఆంధ్రజనులందఱికిని నెఱ చూఱ లిచ్చియుండిరి. తమ యీ విమర్శ కాళిదాసుని కవితా మహత్త్వ మెఱుంగఁదలఁచువారికిఁ జక్కని వెలుఁగుబాట.

'విద్యారత్న' 'పరిశోధనాపరమేశ్వర'
N. వెంకట్రావు, M. A.,
*Head of the Department of Telugu.*

University of
MADRAS
25-3-66.

శ్రీశివ,
శ్రీయుత విద్వాన్,
ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారికి

వేంకటరావు నమస్కారములు. మీరు పంపిన "కాళిదాస శివభక్తితత్త్వము తత్త్వజ్ఞానవైభవము నాకందినది ... ... తెనుగున కాళిదాస మహాకవి కవిత్వమును గూర్చియు నందలి విశేషములను గూర్చియు ప్రత్యేక గ్రంథములు వ్యాసములు నున్నవి. కాని యాతని శివభక్తితత్త్వమును ప్రపంచించునవి లేవు.

శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారి ప్రస్తుతగ్రంథము ఆలోపమును దీర్చుచున్నది. కొందఱు సాహితీ విమర్శకులు భావించునట్లు కాళిదాసు శైవకవి కాడనియు బ్రహ్మజ్ఞానపరిపూర్ణుడై శివాద్వైతత్త్వమును ప్రపంచించిన మహాకవియనియు నిందు సోపపత్తికముగ నిరూపితమై యున్నది. ఈ మహాకవి కృతులనుండి ఆ యా ఘట్టములు ఉపనిషత్సూక్తులతో ప్రామాణీకరింపఁబడి వ్యాఖ్యానము గావింపఁబడినవి.

ఈ నాడాంధ్రసాహితీ విమర్శకులకు మూలభూత సంస్కృత గ్రంథములను చదివి యందలి విషయములను గ్రహించుటకు నవకాశములు కలుగుటలేదు. ఆంధ్రసాహిత్యవిమర్శమునకట్టి సంస్కృతగ్రంథ పరిజ్ఞాన మత్యావశ్యకము. ఈ దృష్టితో పరిశీలించినను శ్రీ ఖండవిల్లి వారి గ్రంథము సాహితీపరిశ్రమ చేయువారి కందఱకు నుపాదేయము.

ఇందలి శైలి సులభసుందరమై సరళమైయున్నది. ఆంధ్ర శైవ వాఙ్మయమునందు పరిశ్రమ చేసినవాడనగుట, నీగ్రంథము నన్నెంత గానో యాకర్షించినది.

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసామ్రాట్, కాకినాడ,
ధర్మభూషణ, శివశరణ, 15-6-66.
శైవసాహితీసార్వభౌమ, బిరుదాంకితులు,

శ్రీ బండారు తమ్మయ్యగారు

మిత్రులు విద్వాన్ బ్రహ్మశ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి గారు రచించి ప్రకటించిన "కాళిదాస హృదయము" అను గ్రంథమును నేను సాంతముగ సావధానముగఁ జదివి మిగుల సంతసించితిని. వీరు పండితవంశమునకుఁ జెందినవారు. జగన్నాథ పండితరాయల జన్మస్థల మగు కోనసీమయందలి ముసిఖండాగ్రహారమే (ముంగండ) వీరి జన్మ స్థలము. విద్వాన్ పట్టభద్రు లయినంతమాత్రమున సంతృప్తినందక వీరు ప్రత్యేకాఽభినివేశముతో గీర్వాణ సాహిత్యాఽలంకార వాఙ్మయ మును బఠించి, పరిశోధించి యందు సమగ్రపాండిత్యమును సంపాదించి యున్నారు. అందునను గవికుల గురువగు కాళిదాస మహాకవి కావ్య ములను, నాటకములను వీరు దలస్పర్శముగ సవిమర్శంబుగఁ బరిశోధించి కాళిదాస హృదయమును లెస్సగా గ్రహించినవా రగుట యీ "కాళిదాసహృదయ" నామకగ్రంథమే వేనోళ్ళఁ జాటఁగలదని నొక్కి వక్కాణించుచున్నాను.

> "కాళిదాసగిరాం సారం కాళిదాస స్సరస్వతీ ।
> చతుర్ముఖోఽ థవా సాక్షా ద్విదు ర్నాఽన్యే తు మాదృశాః॥"

అని వ్యాఖ్యాతృ సార్వభౌముఁడు మల్లినాధసూరి యుగ్గడించి యున్నాఁడు. అట్టిచో కాళిదాస వాఙ్మయమున నవగాహించి, కాళిదాస హృదయమును బాగుగా నవగతము చేసికొనిన యీ మహనీయులు సర్వదా సర్వథా ధన్యాత్ములని విన్నవించుచున్నాను.

ఇందు కాళిదాస వాఙ్మయమునకు సంబంధించిన పదునొకండు వ్యాసరాజము లున్నవి. ఇందులో నయిదింటిని మునుముందు మా యాంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రకటించి లోకమునకుఁ బరిచిత మొనరించి యుంటిని. తరువాత మఱి యాఱు వ్యాసములను వీరు రచించి చేర్చి మొత్తము పదునొకంటిని నేకగ్రంథముగఁ బ్రకటించుట ముదావహము. రుద్రాంశము ఏకాదశాత్మకమయిన కరణి, కాళిదాస మహాకవి హృదయమును గూడ నీ యేకాదశ వ్యాసరూపమున శ్రీ శాస్త్రిగారు సువ్యక్త మొనరించినారు. గ్రంథగౌరవమును బట్టి యిది విశ్వవిద్యాలయములలో నున్నత పట్టపరీక్షలకు, విద్వత్పరీక్షలకు పాఠ్యముగ నిర్ణయింపఁ దగియున్నదని మనవి చేయుచున్నాను. గీర్వాణభాషాపారంగతులు ఆస్థానకవీశ్వరులు మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారీ వ్యాససంచయమును సావధానముగఁ జదివి యానందించి హర్షాంబుధిని దేలియాడుట నే నెఱుంగుదును. విశ్వవిద్యాలయాధికారులు సాదరముగ నీ గ్రంథమును బరికించి, విశేష ప్రచారమునకుఁ దెచ్చి, గ్రంథకర్తృ పరిశ్రమమును సముచితముగ సంభావించి తోడ్పడెదరు గాతమని యభిలషించుచున్నాను. అట్లయిన, విద్యార్థిలోకముగూడ ధన్యము కాఁగలదు.



'వేదాన్తసమ్రాట్' "మీమాంసావిద్యాప్రవీణ" రాజమండ్రి,
రేమెల్లి సూర్యప్రకాశశాస్త్రి. 6-1-66.
గౌతమీవిద్యాపీఠం.

బ్రహ్మశ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారు కేవలం వేదాధ్యయనము చేయుటయేగాక సంస్కృతాంధ్రములయందు మంచి సాహిత్యపరులు. సర్వదా సాహిత్యగ్రంథములలో తత్రాపి కాళిదాసీయములను విమర్శించుటయందు అత్యన్తాసక్తులు. వీరు "ఉపమా కాళిదాసస్య, కాళిదాసీయ శ్రౌతవిజ్ఞానం మొదలగు వ్యాసములను రచించిరి. కాళిదాసీయ శ్రౌతవిజ్ఞానం అనుదానిని వీరు వినిపింపగా తదేక దృష్టితో వింటిని. కాళిదాసీయములను విమర్శించుటవలన వీరికి స్ఫురించిన నూతన భావములకు సంతోషమయినది. కవులలో మహాకవిగాఁ బ్రసిద్ధిచెందిన కాళీదాసు సర్వజ్ఞుడయి సర్వవిషయములను తనచే రచింపబడిన కావ్యనాటకాదులయందు గ్రథించుట ఆశ్చర్యము కాదు. కాని శ్రీ శాస్త్రిగారు శ్రౌతవిజ్ఞానము, సాహిత్యము, విమర్శనాశక్తి గలవారు గనుకనే, కావ్యములందలి శ్రౌత విషయములను యథాన్యాయముగా గ్రహించగలిగినారు. వీరిచే చూపబడిన శ్రౌత విషయములన్నియు ఆపస్తమ్బ శ్రౌతసూత్రాద్యవిరుద్ధముగాను, సంప్రదాయసిద్ధ మయినవిగాను ఉన్నవని చెప్పుటలో ఎంతయు అతిశయోక్తి కానేరదు. ఇట్టి వ్యాసములయొక్క విజ్ఞానము కావ్యములను బఠించువారలకు, విమర్శించువారలకు అత్యన్తము ఉపయోగపడగలదని విశ్వసించుచున్నాను.

## శ్రీ కాళిదాస సౌందర్య సమారాధనము

# అభిప్రాయము

ద్యోధేనుదుహితదే దుగ్ధంబగునుగాక
యమథితంబయి వెన్న యమరుటెట్లు!
హరిచందనోత్పత్తి గురు ఖండమగుఁగాక
అరగదీయక గంధ మమరుటెట్లు?
రమణీయవైదూర్యరత్నశలాకయే
సానఁబెట్టక పన్నె లూనుటెట్లు?
ఏపుగా నెదిగిన నిక్షువే యగుఁగాక
పిండకయే రసస్ఫూర్తి యెట్లు!
స్వాదుసురభిళసుందరసరసమైన
కవికులగురూత్తమునిదైన ఘనత యెట్లు?
సహృదయతతోడఁ 'కాళిదాససహృదయము'ను
దెలిసి ప్రకటించుమీ సూక్ష్మధిషణ లేక.

సరససౌరభ్యమార్దవశస్తమైన
కాళిదాసునికవితయన్ 'కంజకళిక
వికసితమ్మును జేసి సార్థకతగంటి
సూర్యనారాయణాభిఖ్య! సూరిముఖ్య!

ప్రథానాచార్యులు,
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము,
కొవ్వూరు.

ఇట్లు,
కే. వెం. న. అప్పారావు.
28-6-66.

KALAPRAPURNA,
*Viswanadha Satyanarayana*, M. A.,

MARUTHINAGAR,
VIJAYAWADA-4.
2-6-66.

బ్రహ్మశ్రీ ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రిగారు రచించిన 'కాళిదాసహృదయము' అన్న గ్రంథము వారే స్వయముగా చదివి వినిపింపఁగా విన్నాను.

వీరు చక్కని పండితులు. కాళిదాసుని యనంత ప్రతిభను వీరు తమ ప్రతిభచేత తగినంత గ్రహించి పాఠకులకు భావుకులకు నందిచ్చిరి.

ఈ గ్రంథమును పండితులును విద్యార్థులును అవశ్యము చదువవలయును. విశ్వవిద్యాలయములలోఁ బాఠ్యగ్రంథముగా నిర్ణయించినచో నుభయులకు చాల మేలు కలుగును.

వీరు వట్టి సంస్కృతపండితులే కాక ఇంగ్లీషు హిందీ భాషలు కూడ నేర్చినవారు. కాళిదాసునుగూర్చి యాత్తరాహులయిన పండితుల యభిప్రాయములు పాశ్చాత్య పండితుల పరిశోధనలు తెలిసికొని చక్కని కృషిచేసి వీరీ గ్రంథమును రచించిరి.

వీరు కోరినది యీ గ్రంథమువలన వీరికి లభించుగాత.

ఓమ్

# కాళిదాస హృదయము



"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥"

## —* ఉపమా కాళిదాసస్య *—

కాళిదాస మహాకవియొక్క కావ్యలక్ష్మి "ఉపమాలంకారము" చే నలంకృతయై సామ్రాజ్యమహాలక్ష్మివలె దీపించుచు నిరుపమానముగఁ బ్రకాశించుచున్నది. పరమేశ్వరనామశ్రవణమాత్రముచే "పార్వతీ" నామమువలె "కాళిదాస" నామశ్రవణమాత్రముచే "ఉపమా" శబ్దము మున్ముందుగ మనస్స్మృతిపథమునకు వచ్చును. ఇందులకు —

"ఉపమా కాళిదాసస్య"

అను నానుడియే కారణము.

చంద్రాలోకాద్యలంకారగ్రంథములందు మొట్టమొదట—

"........అర్థాలంకారాణాం మధ్యే
ప్రధానత్వా త్ప్రథమ ముపమా నిరూప్యతే"

అని "ఉపమాలంకారము" ఉపక్రమింపబడినది. కనుక నీయలంకృతి సర్వాలంకారములకు సార్వభౌమత్వము వహించినట్లు తెలియుచున్నది. మఱియు నిది సహృదయ హృదయాహ్లాదకమైన సుప్రసిద్ధ సాదృశ్య సంపదతో సంశోభితము కావలెనని యీక్రింది శ్లోకము తెలుపుచున్నది.

"ఉపమా యత్రసాదృశ్యలక్ష్మీ రుల్లసతి ద్వయోః।
హంసీవ కృష్ణ తే కీర్తి స్స్వర్గంగా మవగాహతే॥"

(చూ. చంద్రాలోకము. 1 శ్లో)

ఇచ్చట శ్రీకృష్ణకీర్తికి హంసాంగనతోఁ బోలికయుండుట సుప్రసిద్ధము. ఇట్టి సాదృశ్యకథనముచే నిచ్చట సహృదయరంజకమైన చక్కని విశేష విషయము లుదయించుచున్నవి. విలోకింపుడు.

"హంసీ" అను నుపమానపదముచే, నుపమేయమైన శ్రీకృష్ణుని కీర్తికి నిరుపమానధావళ్యము సూచితమగుచున్నది. ఇట్లే "స్వర్గంగాం అవగాహతే" అను సామాన్య ధర్మముచే "కీర్తికి" స్వర్లోకపర్యంత వ్యాప్తియుఁ, బవిత్రతయు సూచితములు. "గాహతే" అను క్రియతో "అవ" అను నుపసర్గమును జోడించుటచే స్వర్నదిలో నడుగుభాగము వరకు, ననగా గంగకు బాహ్యాభ్యంతర భాగములం దంతటను శ్రీకృష్ణుని కీర్తి వ్యాపించినట్లు * సూచితమగుచున్నది. "అవగాహతే" అని వర్తమాన ప్రయోగముచే నప్పుడేగాక ఇప్పుడు నెప్పుడును దత్కీర్తి సర్వత్ర వ్యాపించుచునే యుండునని వ్యంజిత మగును. ఇట్టి కీర్తి ఒక్క పరాత్పరునికే కలదు గావున నిట్టి కీర్తి కాధారమైన శ్రీకృష్ణుఁడు పరమాత్మ స్వరూపుఁడని కూడ వ్యంజితమగుచున్నది. ఇట్లీ యుపమానములోని సాదృశ్యసామర్థ్యముచే నిచ్చట విశిష్టార్థములెన్నో వీనుల విందుగ వ్యంజితము లగుచున్నవి.

ఇక ఉపమాలంకారము విభిన్నరూపములుగా మారుచు నన్ని యలంకారములకు మూల మెట్లగుచున్నదో కనుగొందము.

కాశీపండితులైన శ్రీ అప్పయ్య దీక్షితులవారు "అర్థచిత్ర మీమాంస" అను తమ యలంకార గ్రంథములో మొట్టమొదట ఉపమాలంకారమును గూర్చి,

శ్లో. ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్ ।
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః॥

"చంద్ర ఇవముఖం" ఇతి సాదృశ్యవర్ణనం తావదుపమా సైవ ప్రోక్తభంగిభేదేన అనేకాలంకారభావం భజతే॥"

---

* దీనిచే "సర్వం విష్ణుమయం జగత్" అను సూక్తి వ్యంజితము.

"ఉపమ' అను నర్తకి వివిధములైన విచిత్రవేషములు (మార్పులు) ధరించి, కావ్యరంగస్థలమందుఁ దన నూత్న నృత్యభంగి మములను జూపుచు సహృదయులగు పాఠకుల చిత్తములను రంజింపఁ జేయుచున్నది."

"ముఖము చంద్రునివంటిది" అనునపుడు చంద్రునిలోని చక్కని యాహ్లాదకరత్వము, కాంతిమత్త్వము, వర్తులత్వము, మున్నగు పోలికలు ముఖమందును జూపట్టుటచేతఁ జక్కని యీ సాదృశ్యమును బట్టి "చంద్ర ఇవ ముఖం" అన్న వాక్యము, ఉపమాన, ఉపమేయ, ఉపమావాచక, సాధారణ ధర్మములను నాల్గు అంగములతో "పూర్ణోపమ" యగుచున్నది. "ముఖము చంద్రునివంటిది" అన్నవాక్యమే కొన్ని మార్పులు, అనఁగా, ఆ వాక్యభంగిని కొంచెము భిన్నముగాఁ జేయుటచే నదే ఉపమాలంకారము, ఇంకొక యలంకారముగా మారిపోవుచుండును.

"చంద్రునివంటి ముఖము" అన్న వాక్యమును గొలదిగమార్చి "ముఖమువంటి చంద్రుఁడు" అన్నచో "ఉపమేయోపమాలంకార మగును. ఇట్లే, "ముఖము ముఖమువంటిది" అన్నచో "అనన్వయాలంకారమగును. ఇట్లే "చంద్రుడు (స్త్రీ) ముఖముతో సమానుఁడు" అనునపుడు "ప్రతీపాలంకారము." "చంద్రునిచూచి యతఁడు ప్రియాముఖమును స్మరించెను" అన్నచో స్మరణాలంకార మగును. "ముఖమే చంద్రుడు"అన్నచో రూపకాలంకారమగును. "ముఖచంద్రునిచే మన మూరటఁ జెందును" అన్నచో పరిణామాలంకార మగును. "ఇది ముఖమా లేక చంద్రుడా ? అన్నచో సందేహాలంకార మగును. "చంద్రు డనుకొని చకోరము లామె ముఖమువైపు వచ్చుచున్నవి" అన్నచో "భ్రాంతిమదలంకార" మగును. "చంద్రుఁడని చకోర పక్షులు, కమలములని తుమ్మెదలు, తన్ముఖమును జూచి సంతసించును" అన్నచో ఉల్లేఖాలంకార మగును. "ఇది చంద్రుడేకాని ముఖము

కాదు" అన్నచో అపహ్నవాలంకార మగును. "ఆకాశమునకు చంద్రుఁడు, భువికితన్ముఖము అలంకారములు" అన్నచో దృష్టాంతాలంకార మగును. "ముఖము చంద్రుని మించినది" అన్నచో "వ్యతిరేకాలంకారము". పై విధముగా ఉపమాలంకారములోని వాక్యభంగిని కొలఁదిగ మార్చుటచే నదే యలంకారము వివిధాలంకారములుగ మారి, ఒకే నర్తకి విభిన్న వేషములతో నింకొకనర్తకివలె గన్పట్టుచు, చూపరుల చిత్తముఁ జూరగొనినట్లు, పాఠకుల చిత్తము నీ యుపమ చూరగొనుచున్నది. కనుకనే శ్రీ అప్పయ్య దీక్షితులవారు "ఈ ఉపమాతత్వ జ్ఞానముచే, తత్వజ్ఞానముచే చరాచర ప్రపంచమువలె, నలంకార ప్రపంచము చిత్రవిచిత్రముగఁ గన్పట్టు ననుచు దన "మీమాంస"లో

> "తదిదం చిత్రం విశ్వం బ్రహ్మజ్ఞానా దివోపమాజ్ఞానాత్ ।
> జ్ఞాతం భవతీత్యాదౌ నిరూప్యతే నిఖిలభేదసహితా సా॥
>
> (చూ. అర్థచిత్రమీమాంస)

ఇట్లు ఉపమాలంకారము అన్ని యలంకారములకు నాద్యమనియు, దీని విభిన్నరూపములే యనన్వయాద్యలంకారములుగా రూపొందినవనియు నీయుపమాజ్ఞానముచే బ్రహ్మజ్ఞానముచేతంబలె విశిష్టవిశ్వము చిత్రముగ నవగత మగుననియుఁ బై విషయమును బట్టి వ్యక్తమైనది.

ఉపమాలంకారములో "సాదృశ్యము" ముఖ్యమైనట్లు తెలిసికొని యుంటిమికదా. కాగా "చక్కని పోలిక", అనునదే "ఉపమ"కు సర్వస్వ మనఁదగియున్నది. ఇట్టి "పోలిక"ను విభిన్నమైన రెండు వస్తువులలో కవి చూడగల్గిననాడే యా వస్తువులలోని సామ్యరూపజ్ఞాన మతనికి నవగతమగును. ఇట్టి జ్ఞానము, ఉపమాలంకారతత్వజ్ఞానముచేతనే యుదయించును. ఇదియే "బ్రహ్మజ్ఞాన" ముగ బరిణమించును. ఈ విషయమునే,

"........బ్రహ్మజ్ఞానాదివోపమాజ్ఞానాత్"
అను నర్థచిత్రమీమాంసావాక్యము విశదీకరించుచున్నది.

పై విషయమునుబట్టి మన కవీశ్వరునకు గల "ఉపమాలంకార" తత్వజ్ఞానమే తత్వజ్ఞానముగ బరిణమించిన దనవచ్చును. ఈ కవీశ్వరుఁడు తన కావ్యములలోఁ గైకొన్న చరాచర వస్తుసంతతికూడ బై విషయమును సమర్థించును. ఆ వస్తుసంతతిలో గొన్ని యివి. వృక్షములు, లతలు, పర్వతములు, నదీనదములు, పంచభూతములు, సూర్యచంద్రులు, రాత్రింబవళ్ళు, నక్షత్రములు, ఉషఃప్రదోషకాలములు, మేఘములు, పుష్పములు, (కొండగోఁగులు) కిసాలములు, ఆకులు, గడ్డి, గడ్డిపువ్వులు, తృణజ్యోతిస్సులు, లేళ్ళు, చమరీమృగములు, సింహములు, బెబ్బులులు, ఏనుగులు, జలజంతువులు, పక్షులు, తుమ్మెదలు, మెఱుఁగుడుఁ బురువులు, ఇవి యవి యననేల! చరాచర ప్రకృతి నంతటిని ఈ కవీశ్వరుఁడు తన కావ్యదర్పణమునఁ బ్రతిఫలింపఁ జేసినాడనియే యనవలెను. దీనిచే మనకుఁ దెలియున దేమనగా "ఈ ప్రపంచమునఁ గల ప్రతియొక వస్తువును సమాన ప్రాధాన్యముకలిగి ఏదో యొక ప్రయోజనముతోఁ గూడి లోకోపకారకమై యున్నది" అని తెలియుచున్నది.

ఇఁక నీ కవీంద్రుని యుపమానములందలి విశేషములను వింటము. కాళిదాస కవీంద్రుని కవిత ఉపమాలంకారముతో బ్రారంభమైన దనుటకు "వాగర్థావివసంపృక్తౌ .." అన్న రఘువంశ కావ్యాదిశ్లోకమే ప్రమాణము. పార్వతీ పరమేశ్వరులు శబ్దార్థములవలె కలిసియుండిరట. శబ్దార్థములలో నొకదానిని వేరొకటి విడిచియుండదు. అనఁగా శబ్దమును విడిచియున్న యర్థముకాని, అర్థమును విడిచియున్న శబ్దముకాని లేనట్లు పార్వతీ పరమేశ్వరు లొండొరులు అవినాభావసంబంధముతో చంద్రచంద్రికలవలె నైక్యరూపముతో సమ్మేళన మందియుండిరి. ఈ యుపమానముచే నిచ్చట వ్యంజితములగు విశేషార్థము లివి. ఈ శివులు

* "పరస్పర తపస్సంపత్ఫలాయిత పరస్పరము" కలవారు. అనగా నీశ్వరుని తపస్సు విడిచి యీశ్వరతపఃఫలము ఉండదుకదా! కాగా నీశ్వరతపము, ఈ తపఃఫల రూపమైన పార్వతియు నవినాభావ సంబంధముతో నొక్కటిగా నుండెనని వ్యక్తమైనది. ఇట్లే పార్వతీతపము, ఈమె తపఃఫలరూపమైన పరమేశ్వరునితో నభిన్నమైనది. ఇట్లు పార్వతీపరమేశ్వర సంబంధము విడదీయరాని యైక్యసంబంధము కలదియని యిట స్వారస్యార్థము నా శేముషికిఁ దట్టినది. ఇట్లే ఇట ఇంకొక స్వారస్యము కలదు.

"వాగర్థా విప" అనునది భిన్నపదమువలె నున్నను "ఇవేన సహ సమాసో విభక్త్యలోపశ్చ" అను వార్త్తికముచే వాగర్థశబ్దము "ఇవ" అవ్యయముతో అవ్యయసంబంధము కల్గియుండుటచే నేకపదమే యైనది. ఇట్లే శివులు వేరుగా కనిపించినను ఇరువురు నొక్కటిగ నిత్యసంబంధము (అవ్యయసంబంధము) కల్గి ఏకాకారముగ నుండిరి. ఇంకొక చమత్కార మేమనఁగా "ఇవ" అనునది ఉపమావాచకముగాన దీనిచే "ఉపమానము" సూచితమగును. "వాగర్థ"శబ్దముచే సుశబ్దసంశోభితమైన కాళిదాస కవిత్వము సూచితమగును. కాగా కాళిదాస కవితతో నుపమాలంకారము నిత్యసంబంధమును గల్పించుకొని, యీ కవి కవితతో సమ్మేళనము చెందియున్నదని వ్యంజిత మగుచున్నది. ఇట్టి స్వారస్యమకరందములు సహృదయ హృదయచంచరీకములకే ఆస్వాదన యోగ్యము లగుచుండునుకదా!

శబ్దశక్తి ♦ ని బట్టి తదనుకూలార్థము ఆశబ్దములో, పుష్పములోఁ బరిమళమువలె మిళితమై యుండును. "మహాకవులైన మహర్షులు ప్రయోగించిన శబ్దము ఒక విశేషార్థమును కూడ బోధించుటలో శక్తిమంతమై యుండునవియు, అట్టి శక్తి లౌకికకవులకు లేదనియు—

* "శివా చ శివశ్చ శివౌ" పుమాన్ స్త్రియేత్యేకశేషః" దీనిచేతగూడ వీరి సంబంధములో నైక్యము గోచరించును.

♦ "అస్మాచ్ఛబ్దాదయమర్థో బోద్ధవ్య ఇతి ఈశ్వరసంకేతశ్శక్తిః".

"లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే।
ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థో౽నుధావతి॥"

అను వచనము వ్యక్తము సేయుచున్నది. కనుక మహర్షికల్పులగు కాళిదాసువంటి * మహాకవులయొక్క శబ్దశక్తి అపరిమితమైనది. ఇట్లు "ఒకశబ్దము ప్రకరణానుసారముగా దెలుపు వాచ్యార్థమును, వ్యంగ్యార్థమును బాగుగ దెలిసికొని ప్రయోగించినచో అట్టి సుశబ్దము ఇహాపర సాధకమై కాంక్షితార్థ సాధనమునకు సమర్థమగుచుండును" అను విశిష్ట విషయమును "ఏకశ్శబ్దస్సుష్ఠుప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి" అని పతంజలి మహర్షియొక్క మహాభాష్య వచనము వ్యక్తము చేయుచున్నది. పవిత్రమైన యిట్టి శబ్దార్థసంబంధ జ్ఞానము తపస్సాధ్యమే యనవలెను. ఇట్టి శబ్దార్థ పవిత్రసంబంధము వంటిదే యిచ్చటి శివుల పవిత్రసంబంధము. ఈ జగత్సృష్టికే తలిదండ్రులై, జగన్మాంగల్యకర సంబంధముతో సమ్మిళితులైన యీ పార్వతీ పరమేశ్వరులు కాళిదాస కవికి శబ్దార్థజ్ఞాన మొసంగువారట. ఇట్టి జగన్మాతాపితరులు ప్రసాదించు శబ్దార్థ జ్ఞానముకూడ నట్టి పవిత్ర నిత్యసంబంధముతో జగన్మాంగల్య కారక మగుచుండును గదా! ఇంతకుఁ దేలిన విషయ మేమనగా కాళిదాస ప్రయుక్తమైన యొక్కొక్క శబ్దము జగన్మంగలకరార్థ సమ్మిశ్రితమై జగన్మాంగల్యమునకు మార్గదర్శక మగుచుండును" అని యిట ధ్వనించుచున్నది. ఇట్టి ధ్వని♦ప్రధానకావ్యములే లోకోపదేశ దక్షములై పాఠకుల కిహపరసాధకములై పరిఢవిల్లుచున్నవి.

"వాగర్థావివ..." అన్న ఉపమానసుమము పై విధముగా భవ్యభావసౌరభముల నెట్లు వెదజల్లుచున్నదో చూచియుంటిమి. ఈ

---

* "ధ్రువంస నీలోత్పల పత్రధారయాసమిల్లతాం ఛేత్తుమృషిర్వ్యవస్యతి"
(చూ. "తత్త్వజ్ఞానవైభవము" అను వ్యాసభాగము.

♦ "ఉత్తమం కావ్యం 'ధ్వని' రితివ్యపదిశ్యతే॥"
(ప్రతాపరుద్ర యశోభూషణం)

'యుపమ', "ఉపమా కాళిదాసస్య" అను ప్రపంచ ప్రశస్తికిఁ బ్రత్యేక నిదర్శనమై యుండును. ఈ కవీంద్రుని యుపమానము లిట్లే విశిష్టార్థ ప్రతిపాదకము లగుచు, విశిష్టభావకాంతులతో విరాజిల్లు చుండు ననుటకు నిదర్శనముగా మఱికొన్ని యుదాహరణములు చూపెదను.

దిలీప మహారాజుయొక్క శరీరనిర్మాణ రీతిని వర్ణించుచు మన కవీశ్వరుఁడు

"వ్యూఢోరస్కో వృషస్కంధః సాలప్రాంశు ర్మహాభుజః।
ఆత్మకర్మక్షమం దేహం క్షాత్రో ధర్మ ఇవా ఽశ్రితః॥"

(రఘువంశ కావ్యము 1-13)

ఇచ్చట దిలీపుఁడు, "క్షత్రియ ధర్మము తనకుఁ దగిన శరీరము దాల్చి వచ్చిన"ట్లుండెనట. "క్షత్రియ ధర్మము" అనఁగా నాపదలో నున్న వారిని రక్షించుట. అనఁగా శిష్టరక్షణము "క్షత్ర" శబ్దవ్యుత్పత్తిని గూర్చి యీ కవి "క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః" అని దిలీపునిచేఁ బలికించినాడు. (చూ. 2-53)

కనుక సత్ప్రభువైన వానికి దుష్టశిక్షణ పూర్వకమైన శిష్ట సంరక్షణము ముఖ్యధర్మము. దిలీపుఁ డిట్టి ధర్మసంరక్షణకే జన్మించిన సత్ప్రభువు. కనుక దిలీపుఁడు శరీరము దాల్చిన "క్షాత్ర" ధర్మమువలె నుండుట నూటికి నూరుపాళ్ళుగా దగియున్నది. శరీరములేని కేవల 'క్షాత్ర'ధర్మము ఏయొక్కపనిని జేయఁజాలదు కదా! యుద్ధములో దుష్టులను శిక్షించుట మున్నగు కార్యములు నిర్వర్తించుటకు పైశ్లోకము లోని "వ్యూఢోరస్క"త్వాదులు ముఖ్యాతిముఖ్యములు. ఈ యుపమానముచే నీ ప్రభువు ధర్మసంస్థాపనమున కుద్భవించిన విష్ణుస్వరూపుడనియు, * నీతని పాలనములో ధర్మము నాల్గుపాదములతో నిలబడ గలదనియు" నీతని యేలుబడిలో న్యాయసంరక్షణకు మొదటిస్థానము లభించగలదనియు నిట్లెన్నో విశేషము లిట ధ్వనించుచున్నవి.

---

* "నాఽవిష్ణుః పృథివీపతిః"

కనుక నిచ్చటి యుపమానము ఆకృతిలేని "క్షత్రధర్మము"నకు ఆకృతిఁ గల్పించి ప్రాణము పోసినది. ఇపుడు "క్షత్రియధర్మము" మనకుఁ బ్రత్యక్షమై మనమనస్సులతోఁ బాటు కనులకుఁగూడ విందొనరించినది.

ఇట్లే దిలీపుఁడు తనలోని మహారాజ గుణములు కారణముగాఁ దన యాశ్రితుల కెట్లు కన్పట్టుచున్నాఁడో తిలకింపుఁడు.

"భీమకాంతైః నృపగుణైః స బభూవోపజీవినాం ।

అధృష్యశ్చాఽభిగమ్యశ్చ యాదోరత్నైరివార్ణవః॥" (1–16(

దిలీపుఁడు తన యాశ్రితులకు సముద్రమువలెఁ గన్పట్టుచున్నాఁడు. ఈ యుపమానముచే నిటఁ దెలియఁదగిన విశేషము లివి. సముద్రములో మహార్ఘరత్నములు, తిమింగిలాది జలజంతువులు కూడ నున్నట్లు, ఈ దిలీపునిలో తేజఃప్రతాపాది భీకరగుణములు, కరుణాది మనోహర గుణములుకూడ నుండెననియు, చెడ్డనే వెదకెడు దుష్టులకు సముద్రము కేవల తిమింగిలాదులచే భయంకరమై చేరరానిదిగఁ గన్పట్టినట్లు, తన సేవకులలో గర్వితులకు రాజులోని కేవల ప్రతాపాది గుణములే కన్పట్టుచున్నవనియుఁ, గనుక వారాతనిఁ జేర వెఱచుచున్నారనియు నిట్లే గుణగ్రాహులగువారికి రత్నాకరములో రత్నములే గన్పట్టుచు సాధనాంతరములచే సముద్రము చేరఁదగియున్నట్లు, మంచి యాశ్రితులకు దిలీపుఁడు కేవల కరుణాది కమనీయ గుణములచేతనే గన్పట్టుచు ఆశ్రయణీయుఁడై యుండెను. ఔరా! ఈ యుపమాన మెంతటి భావముతో భవ్యమై భాసిల్లుచున్నది! ఈ చక్రవర్తియొక్క తేజము వారి వారి యర్హతలనుబట్టి తదనుసారముగఁ దేజరిల్లుచున్నట్లు ఈ యుపమానము తెలుపును. దిలీపుఁడు సద్వితీయముగ కులగురువు నాశ్రమమునకు వెళ్ళునపుడు "ఆ దంపతుల కలయికచేఁ గల్గిన శోభ చైత్రములో చిత్తానక్షత్రముతో చంద్రుఁడు కలిసినప్పటి శోభను గలిగి యుండెను." అని మన మహాకవి

"కామ్యాభిఖ్యాతయోరాసీ ద్వ్రజతో శ్శుద్ధవేషయోః ।
హిమనిర్ముక్తయోర్యోగే చిత్రాచంద్రమసోరివ॥ (1-46)

చైత్రమాసమున మంచుతెరలు తొలఁగిపోవును. కనుక అప్పటిచిత్రాచంద్రమస్సంబంధము, అపూర్వమైన సహజకాంతికిఁ గారణ మగుచుండును. ప్రస్తుతమున సుదక్షిణాదిలీపులకుఁగూడ శోకాపరూప మైనతెర యచిరములోఁ దొలఁగును. దీనితో వీరికి పుత్రసంతానముకలిగి, వీరి వంశమునకే ఒక క్రొత్తశోభ కలుగును. ఇట్టిశోభ యిప్పటి వీరి కలయికవలన నవ్యక్తముగ గోచరించుచున్నది. పౌర్ణమినాడు ఏ నక్షత్రముతోఁ జంద్రుఁడు కలియునో ఆ నక్షత్రనామమే ఆనెలకు వచ్చును. "చిత్రానక్షత్రయుక్తా పౌర్ణమాసీ చైత్రీ. *ఇదే చైత్రము. ఏతావతా విశేషణయుక్తమైన ఈ యుపమానముచే వీరి యీ కలయిక పుత్రసంతానప్రాప్తికిఁ గారణ మగుచున్నట్లు సూచిత మగుచున్నది. ఇతని విశేషణములు ఇట్లే భావగర్భితములై భావికథాసూచనాదుల కుపయుక్తము లగుచుండును. (చూ. రఘువంశము సర్గ. 2 - శ్లో. 1. "జాయాప్రతిగ్రాహిత గంధమాల్యాం" భర్త భార్యయందు పుత్ర రూపమునఁ జనించునుగాన "జాయ" అను పేరు భార్యకు సార్థకము. ♦ కనుక సుదక్షిణ యందునచిరములో రాజునకు గలుగబోవు పుత్ర జననము "జాయా" శబ్దప్రయోగసామర్థ్యముచేతనే సూచితమైనది. ఇట్లే ఒకచక్రవర్తి సామాన్యబాలకునివలె గోవును అడవులలో మేపు చుండుట చక్రవర్తి జీవితమునకు విరుద్ధముకాదా? అను ప్రశ్నకు సమాధానముగా "యశోధనః" అను నొకవిశేషణ మిట మన కవిచేఁ బ్రయుక్తమైనది. (2 - 1) ఈ రాజు, పుత్రసంతానజనితకీర్తినే నిజమైన ధనముగ భావించియుండెను. కనుక నితఁడు గోవునుమేపుటను దక్కువ తనముగ భావించియుండలేదు. ప్రకృతమనుసరామః —

* విశాఖానక్షత్రేణ యుక్తా పౌర్ణమాసీ వైశాఖీ. ఇదే వైశాఖము. ఇట్లే మిగిలిననెలలు.
♦ "తజ్జాయా జాయా భవతి యదస్యాం జాయతే పునః" (శ్రుతి.)

ఇట్లే దిలీపుఁడు తన సంపద్వైభవజనితసుఖముకంటెను తనకు అనపత్యతవలనఁగల్గిన విచారమే యెక్కుడుగ నుండెనని తన గురువుతో విన్నవించుకొనుసందర్భమున

"సో ఒహ మిజ్యావిశుద్ధాత్మా ప్రజాలోపనిమీలితః।
ప్రకాశశ్చాఽప్రకాశశ్చ లోకాఽలోక ఇవాఽచలః॥" (1-68)

ఇట దిలీపునకు "చక్రవాళపర్వతము"*తోఁ బోలిక చెప్పఁబడినది. రాజునకిట యాగక్రియాజనితస్వాంతరంగవిశుద్ధియు, అనపత్యతాజనిత బాహ్యనిమీలనభావము అను నీ రెండును ఒకే సమయమునఁ దుల్యబలముతో నున్నట్లు పాఠకులకుఁ జూపవలెను. ఇట్టి యసంభవప్రదర్శనమునకు కాళిదాసప్రయుక్తమైన యీ యుపమానమెక్కుడే సర్వసమర్థమై సముద్దీపించుచున్నది. చూడుడు: చక్రవాళపర్వము తన యంతర్భాగమున సూర్యకాంతిసంపర్కమువలనఁ బ్రకాశముకలిగియుండును. కాని, యిప్పర్వతబహిర్భాగమునఁ జీకటి యావరించియుండును. కనుక లోపలి ప్రకాశము ముద్రితమై పైకిఁ బ్రధానముగఁ జీకటియే కనుపించును. దిలీపుని తాత్కాలికపరిస్థితికూడ నిట్లే యున్నది. "కర్మాణి చిత్తశుద్ధ్యై" మ్మను సూక్తిచొప్పున రాజు యాగకర్మచేఁ గల్గిన చిత్తశుద్ధితో లోపల ప్రకాశముఁగల్గి యుండెను. కాని, "అనపత్యత" అనునది తన బాహ్యజీవితమునకుఁ జీకటిని గల్పించి యంతః ప్రకాశమును ముద్రిత మొనర్చుచున్నది. అనఁగాఁ బుత్రులులేనిలోటే ముఖ్యముగాఁ బైకి గనఁబడుచున్నది ఇట్టి మహారాజుయొక్క బాహ్యాభ్యంతరములలోని తాత్కాలిక విభిన్నదశావిశేషములను మన కాళిదాస కవియొక్క యుపమానము విస్పష్టము చేసినది. అంతర్దశావిశేషములనుగూడ అక్షిగోచరముచేయుటలో కాళిదాసోపమ 'x-ray' వంటిది కదా!

---

* చక్రవాళపర్వతము ప్రపంచమును జుట్టియుండుటచే దీని మధ్యనే సూర్యుఁడు తిరుగుచుండుటచే దీనిలోపల ప్రకాశము, వెలుపల చీఁకటి యుండును.

ఇట్లే దిలీపుఁడు తన గురువగు వసిష్ఠునితో "అనపత్యుఁడైన శిష్యునిజూచి సమర్థులగు గురువు లూరకయుండుట యుక్తమా?" అను సందర్భమున —

"తయాహీనం విధాతర్మాం కథం పశ్యన్నదూయసే।
సిక్తం స్వయమివస్నేహా ద్వంధ్యమాశ్రమవృక్షకం॥" (1-70)

"తన యాశ్రమములోఁ దనచేతులారఁ బెంచిన వృక్షకము సకాలమున ఫలింపకున్నచోఁ జూచి పెంచినవాడు వ్యథఁజెందినట్లు, ఓ స్రష్టా! నీవు అనపత్యుఁడనైన నన్నుఁజూచి వ్యథఁజెందుటలేదా"? అని యీ శ్లోక తాత్పర్యము. ఇచ్చటి యుపమానముచే సుద్గతములగు భావమకరందము లివిగో, ఆస్వాదింపుడు ఇచ్చటి యొక్కొక్కపద మొక్కొక్క భావసౌరభమును వెదచల్లును.

(1) "ఆశ్రమవృక్షకం" ఇచ్చట దిలీపునకు ఆశ్రమవృక్షకముతోఁ బోలిక చెప్పఁబడినది. ఆశ్రమము మహర్షిదైనచో నచ్చటి వృక్షము కూడ మహర్షికిఁ జెందినదేకదా! కనుక నిచ్చటి యుపమానముచే సూచితమైన దిలీపరూపమైన యీ వృక్షకము ఒక మహర్షి పాలనములో నున్నట్లు వ్యంజిత మగుచున్నది. ఇట్టి, వృక్షమునకుఁ గారణాంతరములచేఁ గల్గిన వంధ్యత్వాది ప్రతిబంధకారణములు మహర్షిచే వెన్వెంటనే నివారితము లగునని ధ్వనించుచున్నది.

(2) "స్వయంసిక్తం" ఈ యాశ్రమవృక్షకమును ఒక మహర్షి తన చేతులారఁ బెంచినాడు. ఇట్టియెడ, ఆవృక్షము సఫలము కాకున్నచో నాముని చూచిచూచి యూరకొనలేడు. కనుక "నీవృక్షమునకు (దిలీపునకు) గల్గిన ప్రతిబంధకములు ప్రయత్నపూర్వకముగ నివారితము లగును" అని పైవిశేషణము సూచించును.

(3) "స్నేహాత్" "ఈ వృక్షమునకు గల ప్రత్యేక లక్షణములనుబట్టి యిద్దాని నాదరపూర్వకముగఁ బెంచుట కొక మహర్షి

పూనుకొన్నాడు. ఇట్టి తటి యీ వృక్షసాఫల్యమునకు దీనియందు గల స్నేహమే తత్పాలకుని బ్రోత్సాహించును" అని సూచితము.

(4) "వృక్షకం" ఇట అల్పార్థమందు "క" ప్రత్యయ ప్రయోగముచే నీవృక్షము లేతదైనట్లును, ఇద్దాని సాఫల్యమునకుం దగిన సమయ మింకను ముందు గలదనియు సూచితము. ముఖ్యముగా "క" ప్రత్యయములోని యల్పత్వము, రాజు, మహర్షియెడ నొందు వినయభావమును భాసింపంజేయుచున్నది.

(5) "విధాతః" ఈ వృక్షపాలకుండు విధాత; అనగా బ్రహ్మ. అవసరము వెంబడిని, ప్రతిసృష్టిచేయుట కితండు వలంతి. కనుక గొడ్డుదానిని గూడ సఫలము చేయుట కీ "విధాత" సమర్థుండు. ఇట్టి బ్రహ్మణ్యుండే దిలీపునకు బ్రహ్మ. అనంగా కులపురోహితుండు. "పురః హితం విచ్ఛతి" అను సార్థకనామము కలవాడు. కనుక దిలీపుని కులాభివృద్ధిని గోరియున్నవాడీ బ్రహ్మ.

పై విధముగా నిచ్చటి యుపమాన స్వారస్యముచే దిలీపునకు సంతానరూప ఫలము తప్పక ప్రాప్తించు నను భావికథ యిచ్చటి యుపమాన సామర్థ్యముచే ముందుగనే సూచిత మగుచున్నది. ఇచ్చటి 'వంధ్య' విశేషణముచే "నీ వృక్షము సఫలమగుటకుం దగినంత పుష్కల సామగ్రియున్నను ఒక బలవత్తర ప్రతిబంధకముచే నిట్లైన"దని సూచిత మగుచున్నది. వినను బై విశేషణములనుబట్టి యట్టి ప్రతిబంధక సామగ్రి యంతయు నచిరకాలమునం దొలంగు నను విషయముకూడ వ్యంజిత మగుచున్నది.

ఇట్లీ కాళిదాస కవీంద్రుని యుపమాన సుమములనుండి వెల్వడిన భావసౌరభములు తత్కావ్యోద్యానము నంతటిని బరిమళ భరితము గావించుచు, నచ్చట విహరించెడివాని మనస్సుమములను ఆమోద భరితములం జేయుటలేదా? ఇంక వసిష్ఠుండు దివ్యదృష్టితో సంతాన ప్రతిబంధకారణమును రాజునకుం దెలుపుచుండగనే వచ్చిన నందినీ ధేనువును వర్ణించుచు మనకవీంద్రుండు

"లలాటోదయ మాభుగ్నం పల్లవస్నిగ్ధపాటలా ।
బిభ్రతీ శ్వేతరోమాంకం సంధ్యేవ శశినం నవం॥" (1—83)

ఈ గోవుముఖము లేతచిగురుటాకు రంగు కలది. ఇట్టి ముఖముపైఁ గొంచెము వంపుతిరిగిన తెల్లటి (చంద్రరేఖవంటి) రోమచిహ్నము కలదు. కనుక నిట్టి గోవు బాలచంద్రుని ధరించియున్న సంధ్యాప్రకృతి వలె నుండెను. ఈ యుపమానముచే నిట అప్రస్తుత విషయ మొకటి స్ఫురించుచున్నది. 'సంధ్యా' శబ్దసామర్థ్యముచే నిచ్చట సుదక్షిణాదేవి స్ఫురించును. "నూత్నచంద్ర" శబ్దసామర్థ్యముచే క్రొంగ్రొత్తగా పుట్టిన బాలుఁడు స్ఫురించును. కాగా సుదక్షిణాదేవి చిన్నిబాలుని వహించియున్న ట్లిట స్ఫురింప జేయుచున్న యీ కాళిదాసోపమ నిరుపమ యని యభినందింపఁదగిలేదా! ఇట్లు భావికథను ముందుగ ధ్వనింపఁజేసి యీ యుపమాన మిట, భావ్యర్థసూచన చేయుచున్న నాటకపద్ధతిని గూడ వహించియున్నది.

ప్రస్తుతములో దిలీపునకు గోసేవావ్రత మవశ్యాఽనుష్ఠేయమై యున్నట్లు యుక్తియుక్తముగా నొక యుపమచే ధ్వనింపఁజేయుచు మనకవీంద్రుఁడు

"…. …. …. …. …. …. …. …. …. …. …. ….
పయోధరీ భూత చతుస్సముద్రాం
జుగోప గోరూపధరా మివోర్వీం॥" (2—3)

"భూమి ర్ధేను ర్ధరణీ లోకధారిణీ" మున్నగు శ్రుతివాక్యములను బట్టి భూమి గోరూపధారిణియైనట్లు స్పష్టమగుచున్నది. మహారాజులకు భూపరిపాలనము స్వధర్మమై యుండగా భూమియొక్క యపరావతార మైన గోవుయొక్క రక్షణకూడ వారికి స్వధర్మమైయున్నట్లు పైయుప మానము ధ్వనింపఁ జేయుచున్నది. ఇచ్చట గోరూపధారిణియైన భూమియందు భూలక్షణమైన చతుస్సముద్ర ముద్రితత్వలక్షణమున్నట్లు నిరూపించుటకై కవీంద్రునిచే నిట "పయోధరీభూతచతుస్సముద్రాం"

అను విశేషణము ప్రయుక్తమైనది. ఏతావతా ప్రస్తుతము దిలీపున కీ గోసేవ విధ్యుక్తధర్మమువలెఁ దప్పక చేయఁదగియున్నట్లు వ్యంజిత మగుచున్నది. ఈ మహారాజు ఇట్టి గోసేవను భక్తిశ్రద్ధలతోఁ జేయుచున్నట్లు ఇందలి "యశోభిః సురభిః" అను విశేషణము మహారాజు శీలమును దెలుపుచున్నది. భూపతి భూమికి కాంతుఁడుకదా! తన కాంతయందు తత్కాంతునకు సహజముగనుండు ఆదరప్రేమ, గౌరవాదులు ఈ భూకాంతునకు ఈ గోవుపై సహజముగ నున్నట్లు ఈ యుపమానములోని స్వారస్యము.

దిలీపునితోఁగూడిన ధేను వెట్లున్నదో మన మనోముకురమునఁ బ్రతిఫలింపఁజేయుచు మన కవితల్లజుఁడు

"బభౌ చ సా తేన సతాం మతేన ।
శ్రద్ధేవ సాక్షా ద్విధినోపపన్నా॥" (2-16)

ఒక్కయాస్తిక్యబుద్ధిచే మానవునకు సంపూర్ణఫలము చేకూరదు. ఆస్తిక్యబుద్ధి (శ్రద్ధ)తో ననుష్ఠానముకూడ కూడియుండవలెను. అప్పుడే యాశ్రద్ధ సాఫల్యప్రదమై రాణించును. కాగా "అనుష్ఠానము" "సాఫల్యరూపము" అగును.

ఇట్లే ప్రస్తుతమున దిలీపునితోఁగూడిన ధేనువు సదనుష్ఠానముతోఁగూడిన శ్రద్ధవలె నుండెను. ఇంతకు దిలీపుని గోసేవకు పుత్త్రోదయరూపసాఫల్యము అచిరభావిలో నగపడుచున్నట్లిచ్చటఁ బైయుపమానముచే ధ్వనించుచున్నది.

ఇట్లే యీ గోసేవావ్రతవర్ణనాసందర్భములోఁ బ్రయుక్తములైన యుపమానములు రాజునకు భావిపుత్త్రోదయమును బహుముఖములఁ బ్రకటించును.* ఇక గురువునాదేశముపై గోక్షీరములు సేవించుచున్నపుడు దిలీపున కవి యెట్లు గానవచ్చెనో కనుఁడు.

---

* చూ. రఘు. 2-లో 21, 22, 34, 36 మొ. శ్లోకములు.

"స నందినీ స్తన్యం........పపౌ వసిష్ఠేన కృతాభ్యనుజ్ఞః।
శుభ్రం యశో మూర్తమివా ఽతితృష్ణః॥" (2-69)

తాను త్రావుచున్న నందినీక్షీరములు దిలీపునకు, శరీరముఁదాల్చిన తన విశుద్ధకీర్తివలె నుండెనట. పుత్రసంతానాఽభావముచే నింతకుముం దున్న దిలీపుని కీర్తి విశుద్ధము కాలేదు. పుత్త్రోదయానంతరమందే మానవునకు ఆనృణ్యారూపమైన విశుద్ధకీర్తి కలుగును.

కాగా పుత్త్రోత్పత్తి, విశుద్ధకీర్తిరూప మగుచున్నది. ఇట్టికీర్తి పుత్రరూపములో నీ క్షీరములందు దిలీపునకు ముందుగనే గనఁబడు చున్నది. కనుక పుత్త్రప్రసన్నత గోక్షీరములే రూపములై తన విశుద్ధకీర్తికి మూర్తిమత్త్వము నాపాదించినవి. ఏతావతా ఇచ్చట "గోక్షీరములు తేనికిఁ బుత్త్రప్రదములై" "పుత్" అను నరకనివృత్తికి మూలములై తన్ముఖమున దిలీపుని కీర్తికి విశుద్ధత నాపాదింపఁజాలి యున్నవి" అని యిట విశిష్టార్థము ధ్వనించుచున్నది.

ఇట్లే గర్భముదాల్చి యున్న సుదక్షిణాదేవి దిలీపరాజేంద్రునకు గానవచ్చినరీతిని వర్ణించుచు మన కవీంద్రుఁడు రఘువంశములో

"నిధానగర్భా మివ సాగరాంబరాం
శమీమివా ఽభ్యంతరలీనపావకాం।
నదీ మివాంతస్సలిలాం సరస్వతీం
నృపస్ససత్త్వాం మహిషీ మమన్యత॥" (3-9)

దిలీపుఁడు అంతర్వత్నియై యున్న తన దేవిని, సముద్రము లనెడు చీరెను ధరించి, "నిధి" గర్భమునఁదాల్చిన భూదేవినివలెఁ గాంచినాఁడు. ఇట్లే రాజు తన దేవేరిని గర్భమునఁ దాగియున్న యగ్నికల జమ్మినివలెను, అంతః ప్రవాహము కల సరస్వతీ నదినివలెను గాంచినాఁడు. మన కవీశ్వరుఁ డిట మూ డుపమానములను బ్రయోగించి, వీటి ముఖమున, సుదక్షిణాగర్భస్థ పురుష*శిశువునకుఁ గ్రమముగ "మహా

* ఇచ్చటి యుపమానములలోనినిధి, పావక, అంతఃప్రవాహ శబ్దములు పుంలింగములు. వీనిచే సూచితమైన గర్భస్థశిశువు పురుషుఁడు.

భాగ్యత్వము"ను "తేజస్విత్వము"ను "పావనత్వము"ను ధ్వనింపఁ జేసినాడు. ఇది "మాలోపమ" కుదాహరణము.

పుత్రుని యుదారచరిత్రలచేఁ దండ్రి పరాజయమందుట, లోకములో దండ్రులకుఁ గీర్తికారకమే కదా! * కాగా "సుదక్షిణాగర్భస్థుఁడు తన యుత్తమ చరిత్రలచే మహాపురుషుఁడు కాఁగలఁడు" అని సూచితమైనది. ఇట్టి యుపమ రఘువంశ కావ్యమున నింకను ఎన్నో యున్నవి. ఇక కుమారసంభవ కావ్యమునుండి కొన్ని యుపమానములు–

"పార్వతీదేవి పుట్టుకచే హిమవంతుఁడు ఏకకాలమునఁ బరిశుద్ధుఁడు, భూషితుఁడు నయ్యెను" అను సందర్భములో నింకొక మాలోపమ యీ క్రిందిది.

"ప్రభామహత్యా శిఖయేవదీపః
త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః
సంస్కారవత్యేవ గిరా మనీషీ
తయా స పూతశ్చ విభూషితశ్చ॥" (కు. సం 1–28)

"దీపపుశిఖచే దీపమువలెను, మందాకినీ నదిచే స్వర్గమార్గమునలెను, శాస్త్రసంస్కారయుక్తమగు వాక్యముచే విద్వాంసుఁడువలెను పార్వతిచే హిమవంతుఁడు పవిత్రుఁడు భూషితుఁడు నయ్యెను."

దీపములోని కాంతిభాగమంతయు దీపశిఖలోఁ బుంజీకృతమగుటచే, నందధిక ప్రకాశము మనకు గానవచ్చుచుండును. ఇట్టి దీపశిఖ, యా దీపమునకుఁ బరిశుద్ధతను, అధిక సౌందర్యమును జేయుచున్నను. ఇట్లే శిఖ, దీపమునకు భూషణప్రాయమగుటలో నర్థానికి స్వాతిసిద్ధముగా గల శుచిత్వమే మూలమగుచున్నది. ఈ శుచిత్వమును గూర్చి శ్రుతివాక్య మిట్లు నుడువుచున్నది. ఇది యగ్ని స్తవములోనిది.

* "ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్। ముక్తిమిచ్ఛే జ్జనార్దనాత్।ఐశ్వర్య మీశ్వరా దిచ్ఛే త్పుత్రాదిచ్ఛే త్పరాజయం"

"ఉదగ్నే శుచయ స్తవ శుక్రా భ్రాజంత ఈరతే।
తవ జ్యోతీంష్యర్చయః...." (మంత్రభాగము)

ఇట్టి శిఖా శుచిత్వముచే దీపమునకుఁ బ్రత్యేకశోభ ప్రసాదింపఁబడు చున్నది. ఇట్టి శిఖతోఁ బార్వతీదేవి పోల్చబడినది. ఇట్టి యీమె జన్మచే హిమవంతుఁడు ముందుగ "పూతుఁడు", పిమ్మట భూషితుఁడు నయ్యెను. ఈ విషయము "...తయా స పూతశ్చ విభూషితశ్చ" అను క్రమముచే సూచింపఁబడుచున్నది. దీనిచే పార్వతీదేవి యాజన్మవిశుద్ధ యనియు, నిట్టి యీమె జన్మసంబంధముచే నగరాజు పవిత్రుఁడై తన్ముఖమున భూషితుఁ డాయెననియు వ్యంజితమగుచున్నది.

ఇట దీపమందు ముందుగా ప్రకాశమే కానవచ్చుచు, పవిత్రత, దాని వెనుక సామాన్యముగాఁ గాననగును. కనుక నిట పవిత్రతకు ప్రత్యేకముగ రెండవ యుపమానము కూర్చబడినది.

దీనిచే ముందుగఁ గలుగు ఫలము పవిత్రత. ఇట్లే వ్యాకరణాశుద్ధమైన వాక్యప్రయోగముచే విద్వాంసుఁడు పూతుఁడు భూషితుఁడు నైనట్లు అనఁగా నైహికాముష్మికఫలము లొక్కసారిగ నందుకొన్నట్లు * హిమవంతుఁ డీమెచే శుద్ధుఁడు భూషితుఁడు నయ్యెను. ఇట్లిల మూఁడుపమానములందును మొదటిది పూతత్వము, ఏతత్ప్రయుక్తమైన భూషితత్వము రెండవది యని తెలియుచున్నది. కాగా నొకవస్తువునకు విశేషశోభ నిచ్చునది యాదలి విశుద్ధత్వమని ధ్వనించుచున్నది.

ఇట్టిదే యింకొక మాలోపము కలదు. (చూ. కు. సం. సర్గ 1 శ్లో. 30)

---

* "ఏకశ్శబ్దస్సుప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి"

అను మహాభాష్యకారుని వచనమునుబట్టి వ్యాకరణ శుద్ధికల వాక్యము, తత్ప్రయోక్తను శుద్ధునిఁ జేసి నపిమ్మట భూషితుని జేయును.

# వాక్యార్థోపమ

సర్గ 1 శ్లో 25 లో "........చాంద్రమసీవరేఖా।
జ్యోత్స్నాంతరాణీవ కళాంతరాణి॥" (కు. సం, 1—25)
ఇచ్చట ఒక వాక్యార్థమునకు నింకొక వాక్యార్థము ఉపమానముగఁ జూపఁబడినది. దీనికి దండిమహాకవి చెప్పినలక్షణము.

"వాక్యార్థేనైవ వాక్యార్థః కోపియ ద్యుపమీయతే।
ఏకానేకేవ శబ్దత్వా త్వా వాక్యార్థోపమా ద్విధా॥"

ఇఁక గిరిజయొక్క పాదాది శిరః పర్యంత వర్ణనములోఁ దదూరువులను వర్ణించుచు కాళిదాస కవీశుఁడు 1 సర్గ.36 వ శ్లోకములో "లోకములో స్త్రీల యూరువులకు మహాకవులు కరికర, కదళీకాండములను ప్రసిద్ధోపమానములుగ వాడుచుందురనియు,

ప్రస్తుతమున పార్వత్యూరువుల కా యుపమానములు సరిపడవనియు, నేనుఁగుతొండము "చర్మకాఠిన్యము" అను దోషముతోఁ గూడిన దనియు, నరటిబోదియ "నిత్యశైత్యము"ను దోషము కలదనియు నీ రెండు దోషములు గిరిజాంకములకు లేవనియుఁ గనుక నీమె తొడలతోఁ బోల్చుటకు లోకమున నుపమానముఁ గాఁదగిన వస్తువే లేదనియు వర్ణించినాడు. దీనిచే, గిరిజాంకములు నిరుపమానములని ధ్వనించినది. దీనిచే కాళిదాస కవీంద్రుని యుపమానముఁకూడ నిరుపమానమని ధ్వనించినది.

ఇఁక 39 వ శ్లోకములో గిరిజాకుమారియొక్క కడుపుపైఁ గాన వచ్చు వళిత్రయము ఎట్లుండెననగా, మన్మథుఁడు పైకినెక్కుటకు ఆమెయొక్క నవయౌవనముచేఁ గల్పితమైన సోపానపంక్తివలె వళిత్రయ మున్నది. ఈ యుపమానమందలి స్వారస్యసౌకుమార్యములు మాటలచే మ్లానములగునని యెంచి, వాటిని భావకోత్తముల మానసములకే విడిచెదను.

ఇఁక తనవద్దకువచ్చి తారకాసురునివలనఁ గలిగిన బాధలను విన్నవించుకొనుచున్న దేవతలనుగూర్చి బ్రహ్మ, వారిని బ్రశ్నించు సందర్భమున

"లబ్ధప్రతిష్ఠాః ప్రథమం యూయం కిం బలవత్తరైః ।
అపవాదైరివోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః॥ (కు.సం. 2-27)

"సామాన్య శాస్త్రములు * అపవాద శాస్త్రములచే బాధితములైనట్లు, లబ్ధప్రతిష్ఠులైనమీరు, బలవత్తరులైన మీ శత్రువులచే బ్రతిష్ఠాభంగము కావింపఁబడితిరా?" ఇవి బ్రహ్మవాక్యములు.

"మాహింస్యాత్సర్వభూతాని"

అనునది సామాన్యశాస్త్రము. ♦ 'హింస' అను విషయము వచ్చినచోటెల్లఁ బైసూత్రము "మాహింస్యాత్" అని నిషేధించుచుఁ దన ప్రభావ ప్రతిష్ఠలను దెలుపుచునే యుండును. ఇఁక "అగ్నిష్టోమ" యాగములో "పశువును" వేయవలెను." అను నర్థముకల "అగ్నీషోమీయం పశు మాలభేత" అను "అపవాద" (విశేష) శాస్త్రము పుట్టినది. ఇది ప్రవర్తించుచోట నెల్ల మొదటి సామాన్యశాస్త్రము దీనికి అడ్డువచ్చుచు, దీనికి చోటులేకుండునట్లు చేయగా, నట్టి సామాన్య శాస్త్రమును ఈ విశేష శాస్త్రము సంపూర్ణముగ జయించి, తన ప్రత్యేకతను జాటుకొనుచు, "అగ్నీషోమీయం..." మున్నగు ప్రత్యేక స్థలములలో తానే ప్రవర్తించును. కాగా నీయపవాద శాస్త్రము ముందు సామాన్యశాస్త్రము శక్తిరహితమై నిరర్థక మగును.

ఇట్లే ముందు లబ్ధప్రతిష్ఠులైన మీరు (దేవతలు) బలవత్తరులైన మీ శత్రువులచే, నపవాదశాస్త్రములచే సామాన్యశాస్త్రములట్లు జయింపఁబడితిరా?

---

* వ్యాకరణపరిభాషలో "శాస్త్రము" అనఁగా "సూత్రము" అని యర్థము.

♦ సామాన్యశాస్త్రమునకే "ఉత్సర్గశాస్త్రము" అని నామాంతరము.

ఇట శత్రువులకు అపవాదశాస్త్రములతోఁ బోలిక చెప్పఁబడినది. అపవాదశాస్త్రముల బలమునుగూర్చి

"పర నిత్యాంతరంగాపవాదానా ముత్తరోత్తరం బలీయః"

అని వ్యాకరణశాస్త్రపరిభాష కలదు. దీనిచే శత్రువులబలము సర్వాధికమైనట్లును, దేవతలకు సామాన్యశాస్త్రముతోఁ జెప్పఁబడిన పోలికను బట్టి దేవతలు తారకాసురుని ముందు సంపూర్ణముగ శక్తిరహితులైనట్లును నిచ్చటి యుపమానబలముచే మనకు స్పష్టమగుచున్నది. కవీంద్రా! నీ యుపమానప్రకాశము ప్రపంచముతో పాటు సర్వశాస్త్రప్రపంచమునుగూడ వ్యాపించి, మాదృశపాఠకులమానసములను విజ్ఞానవీథులలో విహరింపఁజేయుచున్నదయ్యా! అస్తు.

ఇట్లే తపస్సమాధిముద్రితుఁడైయున్న యీశ్వరునిగూర్చి 3–48 శ్లోకములలో

"మహేశ్వరుఁడు, తనలోని ప్రాణాదివాయువులను బంధించి యోగసమాధిస్థితుఁడైయున్నపుడు, వర్షాడంబరములేని మేఘునువలెను, తరంగములులేని హ్రదమువలెను, వాయుతాడనములేనిచోట నిశ్చలముగానున్న దీపమువలె నుండెనట."

పై యుపమానత్రయము మహేశ్వరుని మనస్సుయొక్క యేకాగ్రతను, అతని నిగ్రహశక్తిని ప్రధానముగా నతనిలోనున్న మహాగాంభీర్యమును వ్యక్తముచేయుచున్నది.

ఇఁక మానవుల మనోభావములను వ్యంజనాశక్తిచే నాలంకారికముగ నీ కవి వ్యక్తీకరించినరీతిని గన్గొందము.

మాయావటువు మహేశుఁడై గిరిజాకుమారియెదుట నిలబడి యున్నపుడు ఆ కుమారియొక్క భావకల్లోలమునుగూర్చి

"తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టిః
నిక్షేపణాయ పద ముద్ధృత ముద్వహంతీ।

మార్గాచలవ్యతికరాఽఽకులితేవ సింధుః
శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ॥" (5-85)

గిరిరాజతనయకు ఈసమయమునఁ గల్గిన భావోదయ్రకమము, వెన్వెంటనే యా భావములకు గల్గినమార్పు, ఆ భావకల్లోలము అను వీని క్రమరీతి యిట సూక్ష్మముగ గమనింపఁదగి యున్నది. శైలాధిరాజతనయ, యింతవఱకు నెవఁడో బ్రహ్మచారి యనుకున్నవాఁడు ఒక్కసారిగ మహేశ్వరుఁడై తనయెదుటఁ బ్రత్యక్షమైనాఁడు.

1. "తం వీక్ష్య వేపథుమతీ."

అట్టి మహేశ్వరుని జూచినవెంటనే గిరిజాకుమారికి ఒక్కసారిగ భయము జనించి శరీరము కంపించినది. ఈ కంపము, వెనుకటి మన్మథ మథన సన్నివేశము స్మరణకువచ్చియా? లేక, యేకాంతముగనున్న కన్యకా జనమనియా? ఎట్లైన నీ సన్నివేశము హఠాదాపతితముకదా!

2. "సరసాంగయష్టిః"

కాని, తనయెదుటఁ బ్రత్యక్షమై తన పాణినిబట్టినవాఁడు తన తపఃఫల రూపమేకదా! అనుకొనకుండగనే తనచేతికివచ్చిన తనతపఃఫలమును (హృదయేశ్వరుని) గనినంతనే యామెయంగములు చెమర్చినవి. ఈ సాత్త్విక భావోదయముతోఁబాటూ నగరాజకుమారికి వెన్వెంటనే సును సిగ్గుదొంతరలుకూడ జనించినవి. తన హృదయేశ్వరుని దలంచికొని, శృంగారభావడోలికలలో నూఁగుచున్న క్రొంగ్రొత్త పెండ్లికూతురు, క్రొత్తపెండ్లికొడుకువద్ద మొదట, ధైర్యముగ నిలబడగలదా?

3. "నిక్షేపణాయ పద ముద్ధృతం"

కనుక త్రపాపరవశయై యా ముగ్ధ యీశ్వరసన్నిధినుండి యింకొకచోటికి వెళ్ళుటకు పాద మెత్తినది.

4. "పదముద్ధృతముద్వహంతీ"

కాని, నేటికిఁ దన చిరకాలవాంఛితము చంద్రశేఖర రూపములోఁ బ్రత్యక్షమై, తన నేత్రచకోరములను దనుపుచున్నది. ఇట్టి తన ప్రియు

వాంఛితమును - కృచ్ఛ్రి చాంద్రాయణాది తపములతోఁ బ్రయత్న పూర్వకముగ సంపాదించుకొన్న యీ ధనమును - విడనాడి వెళ్ళుట కామె భావ మంగీకరించుటలేదు. కనుక, నా చలిపుల రా కన్నియ, యటనుండి కాలు కదపలేకపోయినది. అనఁగా ముందు జనించిన సిగ్గు, అటనుండి వెడలుట కామెను బ్రేరేచుచుండఁగా నామెలో రేఁగిన శృంగారభావములు, ఆమె నటనుండి కదలనిచ్చుటలేదు. ఈ భావ ద్వయ సంఘర్షణలో గిరిజాకుమారి, కిం కర్తవ్యతా మూఢయై యెత్తిన పద మెత్తినట్లే నిలిపినది.

ఇట్టి భావద్వయ సంఘర్షణములోఁ దగుల్కొన్న యప్పటి గిరిజయొక్క మనోభావ పరిణామరీతిని, అద్దములోఁ జూపినట్లు మనకు మన కవీశ్వరుఁడు తన యుపమాన ముకురములో యథాతథముగఁ జూపినాడు చూడుడు.

5. "మార్గాచల వ్యతికరాఽకులితేవ సింధుః"

ఒక నది వేగముగఁ బ్రవహించు చున్నపుడు మార్గమధ్య మునఁ గల యొక పర్వత మద్దాని కడ్డుతగిలిన దనుకొనుఁడు. అప్పు డా పర్వత ప్రతిబంధకముచే నొక్కసారిగ ప్రవాహ వేగము వెనుకకు నెట్టబడును. కాని వెనుకనుండి వచ్చుచున్న ప్రవాహవేగ మా ప్రవా హమును ముందునకుఁ ద్రోయును. ఇట్టి తరుణమునఁ తత్ప్రవాహము ఆ ద్వివిధ సంఘర్షణకు గురియై క్షణకాలము ఒక్కటనే కల్లోలితా వస్థలోనుండి ముందునకు గాని వెనుకకు గాని వెళ్ళజాలని పరిస్థితిలో నుండును. ఇట్లే ప్రస్తుతమున గిరిరాజతనయయొక్క శృంగారభావ వాహిని ప్రవహించుచుండగా నీశ్వరపర్వత మడ్డుతగిలి సిగ్గుచే నది కొంచెము వెనుకకు జంకినది కాని వెనుకనుండి వచ్చుచున్న తద్భావ వాహినీ వేగము వెనుదిరిగిన తద్భావ ప్రవాహమును ముందునకుఁ ద్రోయుచున్నది. ఇట్టి తరుణములో గిరిజాకుమారి త్రపా శృంగార

భావములమధ్యఁ జిక్కుకొని క్షణకాలము డోలాయమానచిత్తయై ముందునకు గాని వెనుకకు గాని వెళ్ళలేక యెత్తినపాద మెత్తినట్లే నిలిపివేసినది.

ఇట్లు మహేశ్వర సన్నిధిలో నగరాజకుమారియొక్క క్షణిక మనోభావపరిణామరీతిని మన కవీంద్రుఁడు తన యుపమాన ఫలకములో యథాతథముగఁ జిత్రించి, తరతరములవఱకు నీ విచిత్రతమ చిత్ర మట్లే నిలిచి యద్భుతరస మొలికించు చున్నటులు, మనమనఃఫలకములలో హత్తించినాఁడు. X-ray కిఁ గూడ లేని యీ శక్తి కవీంద్రా ! నీ యుపమానమున కెక్కడనుండి వచ్చినదయ్యా! నీ "ఉపమా కాళిదాసస్య" అను ప్రపంచ ప్రశస్తి యక్షరశః నీయుపమాన మ్మొక్కదానిలోఁ బుంజీకృతమై ప్రకాశించుచున్నదయ్యా! ఇట్టి యుపమానములెన్నో యీ కవీశ్వరుని కవితాఽమృత మానససరోవరమున మానసౌకసములవలె నీదులాడుచు, బాలకుల మానసములను మానసములుగ మార్చివేయుచున్నవి. ఇఁక మేఘసందేశమునుండి - ఈ కవీశ్వరుని యుత్ప్రేక్షాలంకారముకూడ ఉపమాలంకార చ్ఛాయాచ్ఛాదితమై, సాధర్మ్యవిశేషముచే, నుపమా ప్రభాభాసిత మగుచున్నట్లు వక్ష్యమాణోదాహరణములు వ్యక్తము సేయఁగలవు. యక్షుఁడు మేఘునితో ననుచున్న మాట లీ క్రిందివి.

"మేఘుని నల్లని శరీరముపై నింద్రధనుస్సు, రత్నకాంతుల వలె వివిధ వర్ణములతో విరాజిల్లుచుండును. అట్టి యింద్రధనుస్సుచేత నో మేఘుడా ! నీ శ్యామశరీరము, నెమిలిపింఛముచే శ్రీకృష్ణుని శరీరమువలె విశిష్టకాంతితో విరాజిల్లును". (చూ. మేఘసందేశం. 1-15)

ఇట ఇంద్రధనుస్సునకు నెమిలిపింఛముతో బోలిక చెప్పఁబడినది. ఒకవర్ణముప్రక్కనే వేఱొకవర్ణము కలిసియున్న పింఛములో నొకే సమయమున వివిధ వర్ణములు వెలయుచు జూడ ముచ్చటలు;

నుండును. దీనితోఁ బోలిక కల యింద్రధనుస్సును నిట్టిదైనలుపుమీఁద నింకను బ్రకాశించును. ఇట్టి ధనుస్సుతోఁ బ్రకాశించెడు మేఘుని శరీరము, కృష్ణశరీరము నెమిలిపింఛముతో భాసించినట్లు వింతకాంతు లతో నద్భుతముగఁ బ్రకాశించునుగదా! కవీంద్రా! ఇంతయు నీ యుపమా ప్రకాశమే. ఇంకను నీ పోలికచే నిట "ధూమ, జ్యోతి, స్సలిల, మరుత్తుల సమ్మేళన రూపమైన మేఘుని శరీరమునకు నొక దివ్యత్వ మాపాదితమై దివ్యభావము లెన్నిటినో రేపుచున్నది. ఇట్లే ఓ మేఘుఁడా! "విదిశా"ఖ్య రాజధానిని నీవు చేరినచో నట నీవు కాముక ధర్మఫలమును బూర్తిగ పొందఁగలవు. ఏమందువా? ఆ విదిశానగరియందు "వేత్రవతి" అను నది గలదు. ఆ నదీతీర ప్రాంత మున నీవు నెమ్మదిగ నుఱుముచు చంచల తరంగములు కల యా "వేత్రవతి"యొక్క మధురరసములను, భ్రూభంగ విలసితయగు విలాసినియొక్క ముఖమునువలె ఓ మేఘుఁడా! ఆస్వాదించగలవు.

ఇట మనకవి వేత్రవతీనదియందు, విలాసవతీ ముఖ భ్రూభంగ విలాసములను విలసిల్లఁజేయుటకునై "చలోర్మి" విశేషణమును బ్రయో గించి ఆ "వేత్రవతిని" విలాసవతిగాఁ బ్రకాశింపఁజేసినాడు. వింతలైన విలాసినీ విలసనములన్నియు నామె ముఖముమీఁద దాండవమాడుచు, కాముకునియొక్కచిత్తమును ఆమె తన యధరోష్ఠముపైకి నాకర్షించును. మఱియు "పాస్యసి" అను క్రియాపదముచే పానయోగ్యమైనది స్త్రీ యధరోష్ఠమే యగును. ఈ యధరోష్ఠమును బ్రియుఁడు గట్టిగ జుంబించి నపుడు ప్రియాముఖములో భ్రూభంగముదయించును. కాముకుల కీ "భ్రూభంగ"మే యానందసర్వస్వమగును. ఇట్టి "కాముకత్వఫలమును" మేఘునకు సంప్రాప్తింపఁజేయుటకునై మనకవి యిట "సభ్రూభంగంముఖ మివ"అనునుపమానమును రసికజనమనోభిరామముగఁ బ్రవేశపెట్టినాఁడు.

ఇట్లు కాళిదాసు నుపమానములన్నియు హృద్యములై మధుర మధుర భావముల నుద్గమింపఁజేయుట కింకను నీ కవీశ్వరుని కావ్యము లం దెన్నెన్నో యున్నవి.

"చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య".(శాకుంతలము)

ఓమ్

# కాళిదాస హృదయము

## దీపశిఖ

కాళిదాసమహాకవికి “దీపశిఖ” * అను నుపనామము ఉన్నట్లు కొన్ని నిదర్శనములవలన మనకుఁ దెలియవచ్చుచున్నది. ఆ నిదర్శనములలోఁ గొన్ని యిట చూపెదను.

“ప్రసిద్ధో [illegible] విద్వద్గోష్ఠీషు విశ్రుతా ।
♦ కాళిదాసకవీంద్రస్య [illegible] సంజ్ఞా దీపశిఖే”తియా ॥”

పై శ్లోకము, కాళిదాసకవికి “దీపశిఖా” నామము పండిత గోష్ఠులలోఁ బ్రసిద్ధమై యున్నట్లు ప్రకటించుచున్నది. విక్రమాదిత్య మహారాజు ఈ కవీంద్రుని “సంచారిణీ దీపశిఖేవరాత్రౌ” అను శ్లోకములోని సుందర భావమును గ్రహించి యీ కవికి “దీపశిఖా” అను బిరుద మిచ్చినట్లు ఆచార్య శ్రీ “మహావీరప్రసాద ద్వివేది” అను హిందీ పండితులు “సరస్వతీ” అను హిందీ పత్రికలోఁ బ్రకటించియుండిరి. ఇందుల కనుగుణముగా శ్రీ “కేదారనాథశర్మ” అను హిందీపండితుఁడు మేఘసందేశ కావ్యమునకుఁ టీక వ్రాయుచు “దీపశిఖా” బిరుదమునుగూర్చి

---

* మిత్రులు, ఉజ్జయినిలోని విక్రమ యూనివర్సిటీలో సంస్కృత శాఖాధ్యక్షులు “వేదాంత శిరోమణి” శ్రీ వి. వేంకటాచలం M. A గారి సంస్కృత వ్యాసము నుండి కొన్ని విషయము లిట స్వీకృతములు. శ్రీవారికి నా కృతజ్ఞతా వందనములు.

♦ కాళిదాసకవికి “మేధారుద్రుఁడు” అను నామాంతరముకూడ నున్నట్లు “సర్వశబ్ద సంబోధనీ” అను సంస్కృత నిఘంటువులోఁ గలదు. ఈ నిఘంటువు శ్రీమాన్ శ్రీనివాసాచార్యులవారిచే సంగ్రథితమైనది.

## "ప్రాక్కథన్" (మొదటిమాట)

## మహాకవి దీపశిఖా (కాళిదాస్)

"మహాకవి దీపశిఖా కా జన్మ కహాఁ హై?... ..."

"దీపశిఖా కే జీవనవృత్తి కే విషయమేఁ... ..."

"కహా జాతా హై దీపశిఖా పూర్వమేఁ అతిజడ్ థే"

"అప్నీ భార్యా విలాసవతీద్వారా... ..."

"దీపశిఖా కే కావ్యోం మేఁ ఉజ్జయినీ వర్ణన్ సే... ..."

"కుచ్ఛలోగ్ ఇన్హేఁ ఉజ్జయినీ వాసీ కహతే హైఁ"

"దీపశిఖాకృత తీన్ మహాకావ్య హైఁ... ...ఇన్ తీనోంకో మిలాకర్ 'లఘుత్రయీ' కహాజాతా హైఁ. 'శ్రుతబోధ' భీ ఇన్హీంకీ కృతిహై"

"దీపశిఖా 'ఉపమా' ప్రధాన్ కవి థేఁ. ఇన్కీ ఉపమాకో... కోయీ నహీఁ పాతా హై... ..."

"దీపశిఖా ప్రకృతి కే పరమోపాసక్ థేఁ".

పై వాక్యము లన్నిటిలో "దీపశిఖా" నామము "కాళిదాస" నామమునకు బదులుగా వాడబడుటచే నీ నామము పూర్వ మీ కవికిఁ ప్రసిద్ధముగ వాడబడుచున్నట్లు వ్యక్తమగుచున్నది.

"వినయచంద్రుడు" అను నాలంకారికుడు * "కావ్యశిక్ష" అను తన యలంకార గ్రంథములో ♦ (క్రీ.శ. 10) "కవిప్రౌఢోక్తి మాత్ర నిష్పన్నోపమ" అను సందర్భమున "ఘంటామాఘః" "ఛత్ర

---

* ఇతడు జైనమతావలంబి.

♦ ఇది యంతవరకు ప్రకాశితముకాని తాళపత్రగ్రంథము. చూ. ఓరియంటల్ సీరీజ్ గాయకవాడ్ (క్రీ.శ. 10.)

౻ "భవభూతి" అను నామముకూడ బిరుదనామమే యని వివరించుచు ఇట్టి బిరుదనామములనుగూర్చి డాక్టర్. శ్రీ వి. రాఘవ మహాశయులు గొప్ప పరిశోధనము గావించిరి. చూ॥ "జనరల్ ఆఫ్ ఓరియంటల్ రిసర్చి" అను పత్రిక.

భారవిః'' "దీపికా కాళిదాసః"........ అని యీ సంస్కృత కవుల కిట్టి బిరుదము లున్నట్లు వ్రాసినాడు. ఱ దీనినిబట్టి పదవ శతాబ్దిలో కూడ కాళిదాసు "దీపశిఖా" బిరుదముతో ప్రసిద్ధుఁడై యున్నట్లు తెలియుచున్నది. "కావ్యశిక్షలో" "దీపికా కాళిదాసః" అని యున్నను ఇందుమతీ స్వయంవరములో నీ కవి "సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ యం యం వ్యతీయాయ పతిం వరాసా !" అని యద్భుతోపమానముతో వర్ణించుటచే ఈ కవికి "దీపశిఖా" అను బిరుదమే సమంజసమని పలువురు పండితులు ఏకగ్రీవముగ నంగీకరించిరి. ఇంక "దీపశిఖా" అను విషయముపై ఈ కవియొక్క వివిధ కల్పనా చమత్కృతిని విలోకించుదము.

1. "సంచారిణీ దీపశిఖా"
2. "చారుతా పవిత్రతాయుక్తా దీపశిఖా"
3. "నిర్వాణోన్ముఖీ దీపశిఖా"
4. "అనిర్వాప్యా దీపశిఖా"
5. "నిష్కంపా దీపశిఖా"
6. "తైలబిందు సంయుక్తా దీపశిఖా" మొదలగునవి.

పై "దీపశిఖా" చ్ఛాయ లన్నిటికిని "సంచారిణీ దీపశిఖా" కల్పనము అలౌకిక చమత్కార శాలినియై యున్నది.

> "సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ యం యం వ్యతీయాయ
> పతింవరా సా। నరేంద్రమార్గాట్టఇవ ప్రపేదే వివర్ణభావం
> స స భూమిపాలః॥" (చూ. రఘువంశము. సర్గ 6. శ్లో 67)

మనము దీపశిఖను ముందునకుఁ దీసికొని పోవుచున్నపుడది తనకు ముందున్న వస్తువులను ప్రకాశింపజేయుచుండును. ఇంక నది ముందునకు సాగినపుడు మొదట ప్రకాశింపఁజేసిన వస్తువులకుఁ జీకటిని

గల్పించి తిరిగి తనకు ముందున్న వస్తువుల నది బ్రకాశితము చేయు చుండును. ప్రస్తుతమున ఇందుమతీ దేవియొక్క శరీరము, అభినవ యౌవన విలసితమై తళ త్తళ కాంతుల నీనుచు, భూషణ కాంతులచే ద్విగుణీకృతకాంతి కలదై తేజరిల్లుచుండెను. కనుక సంచరించెడు నీ శరీర లావణ్యజ్యోతి, సంచరించుచున్న దీపశిఖవలె నుండెను. ఈ యుపమానముచే నిట దీపశిఖకు కాళిదాసకవి ప్రాణము పోసినట్లైనది. కేవల దీపశిఖకు సంచరణశక్తి యుండదుకదా! ఇట ఇందుమతీ రూప మైన దీపశిఖ స్వయంవర సదస్సులోఁ దనకు ముందున్న రాజపుత్రుల ముఖములను ఆశాకిరణములచే బ్రకాశితము చేయుచు, వీరిని దాటి ముందునకు సాగినపుడు ప్రకాశితమైన యా రాజపుత్ర ముఖములనే తిరిగి ఈమె నిరాశాతమస్సులో ముంచి, ముందున్నవారి ముఖము లను గ్రొత్తగ ఆశాజ్యోతిచే మెరయించుచుండెను. ఇట్లు, ఇట ఇందు మతీదేవి విషయములో నీ యుపమాన కల్పనము, అక్షరశః సామ్యము భజించి, ఉపమా సౌభాగ్య సౌధ శిఖరము నధిరోహించుచు, రస సామ్రాజ్యపీఠ మధివసించి, వ్యంగ్య పరంపరా తరంగముల నుద్గమింపఁ జేయుచు, సహృదయ హృదయములను ఆనందాశ్చర్యములలో నోల లాడించుచున్నది. మన కవీంద్రుని కమనీయ ప్రతిభకు ఈ దీపశిఖా కల్పనము భూషణాయమానమైనచో, నీ "సంచారిణీ దీపశిఖా" కల్ప నము మకుటస్థానీయ మనవలసియున్నది.

## 2. చారుతా పవిత్రతా యుక్తమైన దీపశిఖ—

దీపమునకు దీపశిఖ ప్రాణతుల్యము. ఈ దీపమే పుణ్యాంగనా హస్తపల్లవముతోఁ బ్రజ్వలితమైనపుడు ఒక్క సౌందర్యపీఠమునేగాక, పవిత్రతా సామ్రాజ్యపీఠమునుగూడ అధిరోహించి ఇది అందరి వంద నములకుఁ బాత్రమగును. ఇట్టి గుణాఽతిశయమును మనమునం దిడు కొనియే మనకవి తన గిరిజాకుమారి నిట్టి దీపశిఖతోఁబోల్చి

"ప్రభామహత్యాశిఖయేవ దీపః.........తయా స పూతశ్చ
విభూషితశ్చ॥" (కుమారసంభవము సర్గ 1)

ప్రభ, సౌందర్యమునకు నిదానము, శిఖ పవిత్రతకు నిదానము. కనుక ప్రభావిశిష్టమైన (దీప) శిఖచేత దీపము పూతము, అలంకృతము నైనట్లు పార్వతీదేవిచే నగరాజు పూతుఁడు అలంకృతుఁడునుగూడ నయ్యెను. సామాన్యముగ సౌందర్యమున్నచోట "పవిత్రత" అరుదు. కాని యిచ్చటి "దీపశిఖా" విషయమున మాత్రము పవిత్రతా సౌందర్యముల కొక్కచోటనే చక్కని సమ్మేళనము కుదురుకొన్నది. ఇట్టి దీపశిఖతోఁ బోల్చబడిన పార్వతీదేవియుఁ దన జన్మచేతనే పవిత్రురాలనియు, సహజసౌందర్య సజ్జిత యనియుఁ దెలియుచున్నది. ఈ పవిత్రతచే దీపమునకు మాంగల్యసిద్ధికూడ చేకూరుచున్నట్లు ఈ కవి తన విక్రమోర్వశీయములో

"ఆచారప్రయత స్స పుష్పబలిషు స్థానేషు చార్చిష్మతీః।
సంధ్యామంగళదీపికా విభజతే శుద్ధాంతవృద్ధో జనః॥" (3-2)

ఇట్లే రఘువంశ కావ్యమున నందినీధేనువును దిలీపుడు సేవించు సందర్భమున మన కవీంద్రుఁడు చెప్పిన

"తా మంతికన్యస్త బలిప్రదీపాం........"

అన్న బలిప్రదీపముకూడ మాంగల్య విషయమునే ప్రకటించుచున్నది.

### 3. నిర్వాణోన్ముఖమైన దీపశిఖ—

ఇట మనకవీంద్రుఁడు దీపశిఖకు వివిధ దశలలో గల వివిధ సౌందర్యోన్మేషములను దనకావ్యములలో సందర్భానుసారముగా ప్రవేశపెట్టి, తత్సౌందర్య సమాస్వాదనావకాశమును సహృదయ పాఠకులకుఁ గలుగజేసినాడు. దీపశిఖయొక్క వివిధ సౌందర్య చ్ఛాయలలో నిర్వాణోన్ముఖమైన దీపశిఖ యొకటి.

కొలదికాలములో ఆరిపోవనున్న దీపమున మూడు విభిన్నా వస్థ లగపడును. దీపపుపాత్రలోని తైలము సమాప్తమగుట, వత్తిలో నున్న తైలముతో ఆ దీపము కొలది క్షణములు వెలుగుట, వర్తికా గతమైన తైలము ఆ వత్తిచివరకు, ఆగియాగి యందుటచే ఆ దీపము కూడ ఆగియాగి వెలుగుట. ఇట్లు ఆరిపోవుటకు సిద్ధమైన దీపశిఖ తిరిగి వత్తికి అందిన తైలముచే పెద్దదగును. ఆ మిగిలిన చమురుకూడ కాలిన పిమ్మట వెంటనే ఆ దీపశిఖ తగ్గిపోవును.

ఇట్లు నిర్వాణోన్ముఖమైన దీపశిఖ తైలశేషమునుబట్టి క్షణ కాలములోఁ బెద్దదై, మరుచటిక్షణము తగ్గిపోయినదై, ఇంకొక క్షణ ములోఁ బ్రకాశముకలదై, మరుచటి క్షణములోఁ జీకటిక్రమ్మినదై, యిట్లు వివిధ దశారూపములలో మనకు వింతగా గానుపించుచుండును. ఇట్టి దీపశిఖతో నొక వృద్ధకంచుకియొక్క పటుత్వముతప్పిన బుద్ధిని పోల్చి, ఒక క్షణకాలములో ఆ బుద్ధియొక్క వివిధ పరిణామరీతులను మన కన్నులకుఁ గట్టినట్లు సుసూక్ష్మముగఁ జూపగల్గిన మన కాళిదాస కవీంద్రుని యుపమాన ప్రాభవము సర్వదా సహస్రధా సంస్తుత్య మగుచునే యుండును. చూడుడు.

"క్షణాత్ప్రబోధమాయాతి లంఘ్యతే తమసా పునః।
నిర్వాస్యతః ప్రదీపస్య శిఖేవ జరతో మతిః॥

(అభిజ్ఞాన శాకుంతలం 5–2)

పై శ్లోకము గౌడపాఠానుసారియగు శాకుంతలమునందే గాననగును. వంగదేశీయమైన యీ పాఠము "రిచర్డు పిషల్" అను జార్మణ్య (జర్మనీ) పండితునిచే మొదట ప్రకటితమైనది. శ్రీ గురుప్రసాదశాస్త్రి ప్రణీతమైన "అభినవ రాజలక్ష్మి" అను వ్యాఖ్యతో కూడి యిది కాశీలో పునఃప్రకటితమైనది. పై శ్లోకము, "పిషల్" పండితునియొక్క ద్వితీయ సంస్కరణమందు 57 వ పుటయందును, కాశీ సంస్కరణ ప్రతియందు 292 వ పొరటయందును ఉన్నట్లు తెలియుచున్నది.

ఈ శ్లోకములోని యద్భుతోపమాన ఘటనా పటుత్వము, దీప శిఖా సౌందర్యములోని వివిధ చ్ఛాయలయం దీ కవీంద్రునికిఁగల గొప్ప మోజును విశదీకరించుచున్నది.

ఇక జరాజర్జరిత గాత్రుఁడైన దశరథుని తుదియవస్థను వర్ణించుచు మన మహాకవి తన "రఘువంశ మహాకావ్యము"లో ద్వాదశ సర్గాదిలో నిట్లు నుడివెను.

"నిర్విష్టవిషయస్నేహః స దశాంత ముపేయివాన్ ।
ఆసీ దాసన్ననిర్వాణః ప్రదీపార్చి రివోషసి॥" (12-1)

"దశరథుఁడు, సుఖభోగము లన్నిటిని అనుభవించి ప్రస్తుతమున ముగియనున్న తన వార్థక్యదశతో (దశాంతం) సమీపించిన శరీర పాతము, లేక మోక్షము కలవాఁడై, ఉషఃకాలమందున్న దీపశిఖవలె నుండెను. ఇందలి విశేషణములు దీపశిఖకుకూడ సమన్వయించును. తెల్లవారువఱకును వెలిఁగిన దీపముఁకూడ "నిర్విష్ట విషయ స్నేహము" అనగా పీల్చినతైలముకలది. మఱియు "దశాంతమును పొందినది." అనగా దీపము, వత్తికొనకు వచ్చియున్నది. కనుకనే అది "ఆసన్న నిర్వాణము" కలది. అనగా ఆరిపోవుటకు సిద్ధముగ నున్నది.

ఇట్లు "మన మహాకవి, ప్రకృతి సౌందర్య ముగ్ధుఁడై దీపశిఖ యొక్క బహుముఖ సౌందర్య చ్ఛాయలను ఆకళించుకొని ఆనందించుచుండువాఁడు" అనుటలో నే యొక సహృదయుఁడును 'కా'దనఁజాలఁడు.

ఇట్లే రాజయక్ష్మ పీడితుఁడైన యగ్నివర్ణుని తుదియవస్థను చిత్రించుచు ఈకవి ఆరిపోవనున్న దీపముయొక్క వామన (పొట్టి) దశను వర్ణించినాఁడు. (చూ. సర్గ. 19 శ్లో. 51 రఘువంశము)

## స్థిరమైన దీపశిఖ

కవిలోకప్రసిద్ధమైన రత్నదీపములు తైలమును గాని, వత్తిని గాని యపేక్షింపవు. కనుక యీ దీపముల ప్రక్రియే వేరుగనుండును.

ఈ దీపములు గాలిదెబ్బకు లొంగవు. సాధనాంతరములచేఁగూడ వీటిని ఆర్పలేము. కనుకనే వీటికి గాలిచే గల్గిన చలనముగాని, వామనావస్థ గాని యుండదు.

ప్రస్తుతమున తారకాసురునిచేఁ బీడితులైన వాసుకి మున్నగు నుగ్ర సర్ప రాజములయొక్క దయనీయావస్థను వర్ణించుచు మనకవి యిట్లనెను.

"జ్వలన్మణిశిఖా శ్చైనం వాసుకిప్రముఖా నిశి।
స్థిరప్రదీపతా మేత్య భుజంగాః పర్యుపాసతే॥"
(కుమారసంభవము స. 2 శ్లో. 38)

వాసుకి మొదలగు భయంకర సర్పనాయకులు తమ తలలయందుఁ ప్రకాశించుచున్న మణిదీపకాంతులతో[6] తారకుని సేవించుచున్నవి. పై స్థిరప్రదీప కల్పనచే వాసుకివంటి యుగ్రసర్పములకుఁగూడ నీ యసురవలనఁ గలిగిన భయము, కన్నుమిన్ను గానని తారకుని పొగరు, ఈ పొగరువలనగల్గిన తత్కర్తృక జీవహింస మొదలగునవి యిట మనకవిచే సూచితములైనవి. ఇచ్చట నింకను విశేషములు కలవు. ఈ దీపములు తారకునకు సంతతముగ వలసిన కాంతిని మాత్రమే యిచ్చును గాని పొగను రానీయవు. కనుక ధూమకర్తృకమైన అక్షిపీడ యిట అప్రయత్నముగనే తొలఁగినది. ఇది మనకవి కల్పనాపాటవమే యనవలెను. వీటికి చమురు అక్కరలేదు. కనుక నివి ఒకే రీతిగ స్థిరముగ వెలుగుచుండును. కనుక "చంచలత్వము" అను దోషముకూడ నిట అంతరించినది. ఇట్లే యిట దీపము తగ్గుచుండుట అను దోషముకూడ తగ్గిపోయినది. కనుక దీపములకు ఒకప్పుడు "ప్రకాశమాంద్యము"ను మాటయేలేదు.

ఇట "స్థిర" శబ్దము రెండు విధములుగ అర్థమిచ్చును.

5

(1) తారకుని యింటిలో ఆయా స్థానములలో వాసుకి మున్నగు సర్పములు నియమితస్థానములలో నుండునట్లు ఆయా స్థానములలో నియుక్తములై యున్నవి.

(2) ఈ దీపములు హెచ్చుతగ్గులులేక యొకేరీతిగ (స్థిరముగ) వెలుగుచున్నవి. మేఘదూతములో అలకాపురీ వర్ణన ప్రస్తావమునఁ గూడ ఈ కవి యీ రత్నదీపములనుగూర్చి తెలిపినాడు.

"........అర్చిస్తుంగా నభిముఖ మపి ప్రాప్య రత్నప్రదీపాన్ ।
హ్రీమూఢానాం భవతి విఫలప్రేరణా చూర్ణముష్టిః॥"

* ..వ్యల్లతా వ్యాఖ్యాకారులు ఇచటి "విఫలప్రేరణా" అను విశేషణమునుగూర్చి

"నిష్ప్రయోజని భూతప్రక్షేపా" అస్థాన పతనాద్వా; ప్రసిద్ధ దీపవనిర్వాపవ్య జ్వాలత్వాద్వా; అత్ర "దీపాన్" ఇతి బహువచనేన ఏకస్య యత్నతో నిర్వాపణేపి అన్యేషాం జాగరణాత్ తాసాం (హ్రీమూఢానాం) అపూరణం కదాపి మనోరథస్య వ్యజ్యతే ఇతి.

## తైలబిందువుతోడి దీపశిఖ

వెలుగుచున్న దీపమునుండి పడిన నూనెబొట్టుతో, ఆ దీప జ్వాలాఖండముకూడ కలిసి పడును. ఈ దృశ్యమునకు మోహితుఁడైన మన కవి తన రఘువంశకావ్యములో నారదుని వీణనుండి పడిన పువ్వు మాలనుజూచి శాపవిముక్తినిపొందిన ఇందుమతీ దేవియొక్క శరీర త్యాగమును వర్ణించు సందర్భమున

"వపుషా కరణోజ్ఝితేన సా నిపతంతీ పతి మప్యపాతయత్ ।
నను తైలనిషేకబిందునా సహ దీపార్చి రుపైతి మేదినీం॥"
(8 సర్గ. 38 శ్లో.)

---

* ఈ వ్యాఖ్య 19.6 సంIIన శ్రీరంగమున ప్రచురితము.

దీపజ్వాలాఖండము తైలబిందువుతోఁగూడి క్రిందఁ బడినట్లు ఇందుమతీ దేవి భర్తతోఁ గలిసి క్రిందఁబడెను.

మనకవి ఇట ఒక గొప్ప కావ్యరహస్యమును నిక్షేపించినాడు. స్వయంవరములో ఇందుమతీదేవి, "సంచారిణీ దీపశిఖేవ ... ..." అని దీపశిఖోపమానముతో అనఁగా దీపశిఖనుఁబోలిన దన శరీరకాంతిచే అజ మహారాజు నాకర్షించినట్లీ కవి తెలిపినాడు. ఇందుమతీదేవి తిరిగి దివ్యధామమునకు వెడలునపుడుఁకూడ అదే దీపశిఖోపమాన ముతో "...తైలనిషేక బిందునా సహ దీపార్చి రుపైతి మేదినీం" ఆమె పతి నాకర్షించినట్లు తెలిపినాడు. అవగా మొదట భౌతిక భోగాను భవసిద్ధికై యామె పతి నాకర్షించిన సాధనముతో తుదినిగూడ భర్తతో స్వర్గస్వారాజ్య భోగానుభవసిద్ధికై యామె యజు నాకర్షించినది. భౌతికము స్వర్గానందముగ మారినది. ఔరా! భారతీయుల పవిత్ర ప్రణయ ప్రాభవములోని ప్రత్యేకత ఇట్టిదేకదా! ఇట్టిపట్టులందే మహా కవుల ధ్వన్యర్థ పరిమళములు తత్కావ్యోద్యానములను మనోహర సౌరభములచే సురభితముల గావించుచు, తన్ముఖమున సహృదయ హృదయ పుష్పవాటికలను మధురభావ మకరందములచే తుందిలముల గావించుచుండును. పై శ్లోకములోని యుపమాన బలముచే "నీ దంప తులలోని యపూర్వ రాగానుబంధమును మన మహాకవి అతి గంభీర ముగ సూచించినాడు. ఈ మహాకవి యీ దంపతులలోని ప్రణయము అకృత్రిమమైనదని తెలుపనెంచియే అజుడు స్వర్లోకములోఁగూడ ఇందుమతీదేవితోఁ గలిసి సుఖించుచున్నట్లు

"....పూర్వాఽకారాఽధికతరరుచా సంగతః కాంతయాఽసౌ
లీలాఽగారే ష్వరమత పున ర్నందనాఽభ్యంతరేషు."

(చూ. రఘువంశము. సర్గ. 8-95)

"పూర్వజన్మని యా నారీ పూర్వజన్మని యద్ధనం।
పూర్వజన్మని యా విద్యా అగ్రే ధావతి ధావతి॥"

అను భారతీయ సనాతన సూక్తిలోని సత్యము ఇదియ కాబోలు.

## లక్షణ—లేక గౌణరీతిచే దీపశిఖా నిర్దేశము

గాలిదెబ్బకు దీపము నిత్యముగా ఆరిపోవును. ఇట్టి యా దీపపు వత్తినుండి సన్నగ పొగ వెడలును. ఇదేవిషయము తెలుపుచు మనకవి రతివిలాప సందర్భమున

"గత ఏవ న తే నివర్తతే స సఖా దీప ఇవా౽నిలాహతః ।
అహ మస్య దశేవ పశ్య మా మవిషహ్యావ్యసనేన ధూమితాం॥"
(చూ. కు. సం. 4-30)

వత్తికి జీవితసర్వస్వము దీపము. రతిదేవికి జీవితసర్వస్వము మదనుఁడు. దీపమారిపోయినట్లు మదనుఁడు ఆరిపోయినాడు. దీపనిర్వాణానంతరమున మిగిలినది కాలి నల్లపడినవత్తి. ఈ వత్తి, విషాద పరంపరనువలె పొగను వెడలఁగక్కుచుండును. ఇట్టి ధూమిత వర్తికాదశతో నప్పటి రతీదేవిదశను బోల్చి మన మహాకవి, రతీదేవియొక్క నూతనవైధవ్య జనిత దుఃఖపరంపరా ధూమోద్గమములతోఁ బాఠకుల నేత్రములను బాష్పపరీతముఁ జేయుచున్నాఁడు. ఔరా! కాళిదాసుయొక్క "ఉపమా" మహాత్వ మెంతటిదోకదా! ఇట్టి యుపమానములతో మానవులయొక్క తాత్కాలిక జీవితదశా విశేషములను అణువణువుగాఁ జూపగల్గిన మానవ మానసిక దశాపరిణామములను ప్రత్యణువుగా విడదీసి వివరింపఁగల్గిన సిద్ధహస్తుఁడు మన కాళిదాసు. జీవితములలోని వివిధ దశాపరిణామరీతులను ఇంతసూటిగ, ఇంత సూక్ష్మముగ, ఇంత యనుభవసిద్ధముగఁ జిత్రించగల్గిన శక్తి ఈ కవీశునియొక్క యొక్క "ఉపమ" కే కలదనినచో నే సహృదయుఁడు "కా"దనగలఁడు ?

మృత్యువువంటి భయంకర సంఘటనలుకూడ కాళిదాసుచేతిలోఁబడి పరిణతిఁజెంది, శృంగార రసచ్ఛాయా౽వృతములై ప్రశావ్యములై చెన్నొందుచున్నవి.

"రామ మన్మథ శరేణ తాడితా
దుస్సహేన హృదయే నిశాచరీ।
గంధవ ద్రుధిర చందనోక్షితా
జీవితేశ వసతిం జగామసా॥"

"రామచంద్రుని బాణహతిచేఁ జచ్చిన తాటకియొక్క వర్ణన మిది. రాముఁడను మదనునియొక్క శరముచే హృదయమునఁ గొట్టబడిన తాటకి రక్తమను చందనముతోఁ బూయఁబడి ప్రాణేశుని సన్నిధికిఁ జేరినది" మహాకవీ! నీ యుపమానములో నేదో "బీజాక్షర సంపుటి" యున్నదయ్యా!

ఓ ష ధి దీ ప ము లు

హిమవద్వర్ణనములోను, ఓషధిప్రస్థపురవర్ణనములోను, ఈ * "ఓషధి దీపములు" మన మహాకవిచే వర్ణితములైనవి. ఇవి రాత్రులందు స్వయంభాసమానములై యచ్చటి కామినీ కాముకుల కెంతగనో రాత్రులం దుపయోగించిన వని వర్ణించిన మనకవి, ఉపయోగించని వస్తు వనునది లేదని సూచించినాడు. ఇంకను ఈ తృణజ్యోతిస్సులు రఘుజైత్రయాత్రలోఁ గలవు. (చూ. 4-47)

దీ ప ము నుం డి దీ పాం త ర ము

"రఘు మహారాజుల కులమునకు ప్రకృష్టదీపమై యుద్భవించిన శ్రీరామచంద్రుఁడు అను ప్రకృష్ట దీప ప్రకాశముచే రాక్షస గృహాగత దీపములు వెలవెలఁ బారెను." అను విషయముచే మనకవి, శ్రీరాముని జన్మకారణముగా రాక్షస నిధన మాసన్నమైనట్లు సూచించుచు నిట్లు నుడివెను.

"రఘువంశ ప్రదీపేన తేనాఽప్రతిమ తేజసా।
రక్షోగృహా గతాదీపాః ప్రత్యాదిష్టా ఇవాఽభవన్॥
(చూ. రఘువంశము. 10-68)

---

* ఈ యోషధులను "తృణజ్యోతిస్సులు" అనికూడ అందురు.

ఇచ్చట "రఘువంశప్రదీపేన" అను విశేషణము, "రఘువంశ మహాకావ్యము" ఇతరకావ్యములకుఁ బ్రకృష్టదీపము వంటిది అను విషయమును ధ్వనింపఁజేయుచున్నది. కాగా "ఈ మహాకావ్యము ముందు సామాన్యకావ్యములు రక్షోగృహగత దీపములవలె వెల్వెలం బారినవి" అని యిచ్చటి స్వారస్యము. పై శ్లోకములో "ప్ర" అను నుపసర్గచే రఘుకుల ప్రదీపమైన శ్రీరామునియందు బ్రకృష్టమైన తేజము సూచితమైనది. ఇట్టి తేజముచే నుపసర్గ రహితమైన (ఒట్టి) దీపములు, అనగా రాక్షసులు నిస్తేజస్కులై కళనుదక్కి యాసన్ననిధనులై యునవి ట్లున్నది." అని యొక్క యుపసర్గ ప్రయోగముచే నింతటి భావవ్యర్థ సూచనము గావించిన యీ కవీశ్వరుని "యక్షర రమ్యత" ఏమని పొగడవలెనో తెలియకున్నది. ఇట్లే "రఘు మహారాజు పుట్టినపుడు అతడి శరీర తేజముముందర పురిటింటి దీపములు వెల్వెలఁబారి చిత్రములో వ్రాయబడిన దీపములవలె నిస్తేజస్కములైనవి" అని యీ కవి వర్ణించి యిట అద్భుతమగు నొక వ్యంగ్యార్థమును మెరయించినాడు. చూడుడు.

* "నిరస్త పాదపే దేశే ఏరండోపి ద్రుమాయతే॥"

అనునట్లు రఘుమహారాజు ఉదయించనంతవరకు సామాన్య రాజులు మహారాజులవలె ప్రవర్తింతురుగాక. కాని రఘూదయానంతరమున నతడి శరీర తేజముచే నచటి దీపములు చిత్రగత దీపములవలె కాంతివిహీనములైనవి. అనగా సూర్యభగవాను డుదయించినపిమ్మట రాత్రి దీపములు నిరుపయోగములగును. సూర్యవంశ ప్రవర్ధకుఁడైన యీ రఘుమహారాజు సూర్య సమాన తేజము కలవాడు. కనుక సూర్యోదయానంతరమున రాత్రిదీపములు నిరుపయోగములైనట్లు రఘూదయానంతరమున నితరరాజుల తేజము వ్యర్థమగుట యుక్తమేకదా! ♦

---

* చెట్టులేనిచోట ఆముదపుచెట్టు మహావృక్షమగును.

♦ ఇట్టిదే విక్రమోర్వశీయమున "అభివ్యక్తాయాం చంద్రికాయాం కిం దీపికా పౌనరుక్త్యేన॥ (3-7-4) సంపాదకః R. D. కరంస్కర్.

పై విధముగా నీ శ్లోకములోని యుపమానముచే మన మహాకవి రఘుమహారాజునందు విశ్వవిఖ్యాత తేజమును వ్యంగ్యరీతిచే మెరయించి, తన విశ్వవిఖ్యాత ప్రతిభను ప్రత్యేకముగ వెలయించినాడు. దీనిచే నీతని పాత్రపోషణశక్తి, యీతని యుపమానమువలె నిరుపమానమైనదని వ్యక్తమగుటలేదా ?

## దీపమునుండి యన్యదీపము

"రూపం తదోజస్వి తదేవ వీర్యం తదేవ నైసర్గిక మున్నతత్వం
న కారణాత్స్వాద్బిభిదే కుమారః ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్॥"
(చూ. రఘువంశము. 5–37)

జనకదీపమందుగల ప్రకాశత్వము, దాహకత్వము, ఊర్ధ్వగామిత్వము అను గుణములు జన్యదీపమునందును సమానములై యున్నట్లు, జనకునియందుగల రూపము, పరాక్రమము, ఉన్నతత్వము అను గుణములు "కారణగుణ న్యాయానుసారముగా నిట పుత్రునియందును సంక్రమించినవి." కనుక "ప్రదీపమునుండి వెలిగించిన దీపమువలె రఘుకుమారునియందు తండ్రి గుణములు సంపూర్ణముగ బ్రతిఫలించినవి" ఇచ్చటి యుపమానములోని "ప్ర" ఉపసర్గమునుగూర్చి యాలోచించితిమేని మన కిట ఉదాత్తమైన భావము గోచరించును. మానవులలో భిన్న భిన్న భావములనుబట్టి జన్య జనక సంబంధములోఁగూడ నంతరము గానవచ్చుచుండును. కనుకనే మన తత్వ శాస్త్రజ్ఞులు "కొడుకు తన తాతముత్తాలనుండియుఁ దనవంశపారంపర్య లక్షణములను గ్రహించుననియు, పరిసర వంశపారంపర్యములు రెండును కలిసి పిల్లల స్వభావోన్మేషమునకు దోహదము లగుననియు సిద్ధాంతీకరించి యున్నారు. ఈ సృష్టిరహస్యమును మన మహాకవి తెలుపనెంచియే జనకదీపమునకు "ప్ర" అను నుపసర్గ చేర్చి కొడుకుకంటె తండ్రియందు ప్రకృష్టతను సూచించినాడు. అర్థవంతమైన యీ కవి యక్షర

రమ్యత బహుళార్థసాధకమైనదికదా! ఇంకను ప్రకీర్ణములైన కొన్ని దీపోల్లేఖములు ఈ కవి వర్ణించినాడు.

పై విధముగా కాళిదాసకవీంద్రుని కావ్యపట్టము "దీపశిఖా" శబ్దము కాని "దీప" శబ్దము కాని తరచుగా స్థానము కల్పించుకొనుచుండుటచే నీ "దీపశిఖా" బిరుద మీ కవికి సముచితమై, విద్వద్గోష్ఠులయందు విశ్రుతమైయున్నదని నమ్మదగియున్నది. పై దీపశిఖా సౌందర్యమును, దీపికా లక్ష్మీ సముల్లాసమును మన మింతదనుక యాస్వాదించియుంటిమి గాన ఈ శబ్దముచే నీ కవీంద్రుని మానసము బాగుగ నావర్జితమై ఆనందితమైయున్నదని తెలియుచున్నది.

ఓమ్

# కాళిదాస హృదయము



## వాల్మీకి - కాళిదాసు

"సూత్రస్యే వాఽస్తిమే గతిః॥"

శ్రీమద్వాల్మీకిరామాయణము "ఆదికావ్యము" అని పండిత లోకము ఏకగ్రీవముగ నంగీకరించియుండెను. కాళిదాసు, తన "రఘువంశ" కావ్యరచనకుఁ బై "ఆదికావ్యము" మార్గదర్శకమైయున్నట్లు తన "రఘువంశ" కావ్యములో నిట్లు నుడివినాఁడు.

"అథవా కృత వాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వ సూరిభిః ।
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాఽస్తి మే గతిః॥
(చూ. సర్గ. 1 శ్లో. 4)

పై శ్లోకవ్యాఖ్యలో మల్లినాథసూరి, రామాయణము కాళిదాసకవికి మార్గదర్శకమైన విషయమునుగూర్చి

"....వాల్మీక్యాదిభిః కృతం రామాయణాది ప్రబంధరూపాయా వాక్ సైవ ద్వారం ప్రవేశో యస్య తస్మిన్ సూర్యవంశే, వజ్రవిద్ధే మణౌ సూత్రస్యేవ మే సంచారోఽస్తి."

అనఁగా సూర్యవంశపు రాజుల చరిత్రను, తదుదారశీలప్రకాశకముగ వర్ణించుటలో వాల్మీకిమహర్షి యొక్క రాచబాటను యేర్పరచియుంచె ననియుఁ, బ్రస్తుతమునఁ దన "రఘువంశ" కావ్య వర్ణనమున కా బాట మార్గదర్శకమగుననియుఁ, గనుక ప్రస్తుతములోఁ దన రఘువంశ వర్ణనము, రంధ్రము వేయఁబడిన మణియందు దారమువలె సులభప్రవేశము కలదనియు కాళిదాసు నుడివినాఁడు. కాఁగా శ్రీమద్వాల్మీకి రామాయణము రఘువంశ వర్ణనమున కాలంబన మనఁదగును. ఇట్లు

రామాయణ మొక్క రఘువంశమున కాలంబనమగుటయే గాక యీ కవి కవితారీతికే యాలంబనమని యీ క్రింది యుదాహరణములు సూచించును. దిలీప మహారాజు నందినీ ధేనువును పగలంతయు వనములో మేపి సాయంకాలము నిలయమునకుఁ దోలుకొని వెళ్ళునపుడు తద్వన రామణీయకమును జూచుచు వెళ్ళుచుండె నను సందర్భమున కాళిదాసు తన రఘువంశములో

"స పల్వలోత్తీర్ణవరాహయూథా న్యావాసవృక్షోన్ముఖబర్హిణాని ।
యయౌ మృగాధ్యాసితశాద్వలాని శ్యామాయమానాని వనాని
పశ్యన్॥" (2-17)

పై శ్లోకరచనములోని చమత్కారము మనోహరాయులు శ్రీమద్వాల్మీకి కవితాలక్ష్మినుండియే కాళిదాసునకు లభించినవని యీ క్రింది వాల్మీకి రచనము వ్యక్తముసేయుచున్నది.

"వర్షోదకాప్యాయితశాద్వలాని ప్రవృత్తనృత్తోత్సవబర్హిణాని ।
వనాని నిర్వృష్టవలాహకాని పశ్యాఽపరాహ్ణే ష్వధికం విభాంతి॥"
(వా. శ్రీమద్రామాయణము. కిష్కింధాకాండ. 28 సర్గ 21 శ్లో)

వర్షర్తు వైభవమునుగూర్చి శ్రీరాముఁడు లక్ష్మణునితో నన్న మాటలివి. ఈ శ్లోకములోని "శ్యామాయమానాని", "బర్హిణాని" "వనాని" పదములను యథాతథముగ గ్రహించుటేగాక, యీ శ్లోక గమనికకు ముగ్ధుఁడై మనకవి, యిదేగమనములోఁ దనశ్లోకమును నడిపించినాడు. ఇట వనరామణీయక మంతటిని ఒకచోటఁ జేర్చి వరుసలోఁ జూపుచున్నట్లు విశేషణము లన్నిటిని ఒక వరుసలో జేర్చి నడిపించుటయు, క్రియను మధ్యనుంచి, చివరకు విశేష్యమును జేర్చుట, ఇది రచనలో నొకపద్ధతి. ఈ పద్ధతిచే పద్యమును హృదయంగమముగ నడిపించుటలో కవియొక్క జాణతనము, నడకలోని విన్నాణము, అందచందములు, ప్రౌఢతనము, మున్నగు సొంపులు శ్రోతల హృదయములను గదిలింపఁ జేయుచున్నవి. మన కవియొక్క లలిత లలిత శైలీవల్లి, రామాయణ

ఇట్లే "శ్రౌతవిజ్ఞానము" లో మానవునకు స్వవిహిత కర్మా చరణము చతుర్విధ పురుషార్థసిద్ధి దాయకమనియు, "ప్రకృతిసమాజీవనము" లో ప్రతి మనుజునకును చరాఽచరప్రపంచముతో నుండవలసిన సంబంధబాంధవ్యములును "సూక్తిమాక్తికములు" లో, లోకస్వభావము అనునవి సూచితములైనవి. ఇక తుదివ్యాసములో విభిన్న మానవసంఘములు విశ్వకల్యాణమునకు ఎట్లు అర్హత సంపాదించవలెనో, తత్సిద్ధికి ఏది మార్గదర్శకమో సోదాహరణముగ వివృతమైనది. ఇట్లీ కాళిదాస కావ్యములు విశ్వశ్రేయ స్సంపాదనములో ముఖ్యపాత్ర వహించిన రీతిని నా యల్పాఽల్ప జ్ఞానముతో సూచించితిని. భారతీయసంప్రదాయ ప్రదర్శనమున కీ కవి కావ్యములు మహితసాధనములని నా భావము.

ఈ పుస్తక ముద్రణములో ప్రూఫ్‌లు సరిచూచి నాకు చేదోడు వాదోడుగనున్న బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారికి నా కృతజ్ఞతా వందనము లర్పించెదను. ఈ పుస్తకము పంపించినంతనే సాదరముగఁ జదివి తమ యుదారాఽశయములు వ్రాసి పంపించిన విశ్వ విజ్ఞాన విరాజితులు పండిత వరేణ్యుల కందఱకును నా హృదయపూర్వక నమోవాకము లర్పించెదను. ఈ ముద్రణమునకు మొదట ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికా సంపాదకులు నావ్యాసములఁ గొన్నిటిని తమ పత్రికలో ప్రచురించి, నాకోరికపై నావ్యాస భాగములుగల కొన్ని ప్రతులు వేరుగ నాకు పంపించుచుండిరి. అందు ఒక్కొక్క వ్యాసభాగమును జదివి పరమానందభరితులై అనేకరీతులఁ గొనియాడుచు నాకెన్నియో యుత్తరములు వ్రాయించిన మధ్వ శ్రీశ్రీ కాశీకృష్ణాచార్య మహోదయులకు, ఆంధ్రప్రభుత్వాస్థాన కవివరేణ్యులకు, విద్యావారిధి, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, మున్నగు నుత్తమ బిరుదములతో ప్రశస్తిగన్న గురుమూర్తులకు నా ప్రత్యేక ప్రణామము లర్పించెదను. ఇట్లే నాయం దెంతయు వాత్సల్య

రకు గల సంభ్రమాదరములు తుల్యములే. ఇట్టి భావతౌల్యమునకు మూలము. శ్రీమద్రామాయణ గౌరవమే మూలమనుట నిక్కువము. ఇట్టివే మఱికొన్ని సందర్భములు.

సీతావియోగముచే ఖిన్నుండగు శ్రీరాముడు వర్షర్తువులో లక్ష్మణునిగూర్చి యిట్లనును.

"ఏషా ఘర్మపరిక్లిష్టా నవవారిపరిప్లుతా ।
సీతేవ శోకసంతప్తా మహీ బాష్పం విముంచతి॥"

(శ్రీమద్రామాయణము. కిష్కింధాకాండ. 28 వ సర్గ. శ్లో. 7)

వేసవిలో నెండకుఁ గాలిన భూమిపైఁ గ్రొత్తగ వర్షముపడినపుడు, అట్టి భూమినుండి యొక యావిరి వెచ్చగఁ బైకివచ్చును. దీనినే వాల్మీకిమహర్షి పై శ్లోకములో భూమి విడుచుచున్న బాష్పముగా నిరూపించినాడు. ఇదేభావమును గ్రహించిన మన కాళిదాసకవి, తన కుమారసంభవములో గిరిజ తపస్సు చేయునపుడు

"నికామతప్తా వివిధేన వహ్నినా నభశ్చరేణేంధనసంభృతేన సా।
తపాఽత్యయే వారిభి రుక్షితా నవైః భువా సహోష్మాణ
మముంచ దూర్ధ్వగం॥" (5-23)

ఇందు, భూమియు గిరిజాకన్యయు సమముగా బాష్పమును విడిచినారని కాళిదాస భావన. నభశ్చరాగ్ని యనఁగా సూర్యుఁడు. ఇంధన సంభృతాగ్ని యనగా నగ్ని. వేసవిలో, నీ రెండురకములైన యగ్నులచేతను భూమి తప్తమైనట్లే, గిరిజయుఁ బంచాగ్నిమధ్య తపోరూపమునఁ దప్తమైనది. గ్రీష్మావసానమునఁ గ్రొత్తగ వర్షము పడుటచే నిరువురును సమముగ "ఊష్మము" * ను విడిచినారు. అనఁగా నొకరు ఆవిరిరూపములో బాష్పమును విడువగా నింకొకరు నిట్టూర్పు రూపమున విడిచినారు. రామాయణములో, శోకాగ్నిసంతప్తయగు సీతవలె భూమి బాష్పమును విడువగా గిరిజ భూమితోఁగూడి బాష్పమును విడిచినది.

---

* "గ్రీష్మోష్మ బాష్పా ఊష్మాణః" అని యాదవనిఘంటువు.

గిరిజ ప్రకృతిస్వరూపిణి కదా! ప్రకృతి స్వరూపములలో నొకటియగు ♦ భూమి యిట్లున్నపుడు సాక్షాత్ప్రకృతియే యైన గిరిజ మాత్రము భూమితో సమదుఃఖభాగిని కాకుండునా? ఇట్లే భూమాత, తన ముద్దులపట్టి విచారించునపుడు తానుమాత్రము విచారించక యుండ కలదా? ఇది యిచ్చటి స్వారస్యము. పై కాళిదాసభావమునకు వాల్మీకి రచనమే మూలమని యే సహృదయుఁ డంగీకరింపడు? ఇట్లే రామ చంద్రుఁడు వర్షర్తువులోని పర్వతములనుగూర్చి లక్ష్మణునితో

> "మేఘకృష్ణాఽజినధరాః ధారాయజ్ఞోపవీతినః ।
> మారుతాఽఽపూరితగుహాః ప్రాధీతా ఇవ పర్వతాః॥"

(కిష్కింధాకాండ 28 వ సర్గ. 10 శ్లో)

"కృష్ణాఽజినము" అనఁగా నల్లయిఱ్ఱిచర్మము. ఈ చర్మమును వడుగులో వటువు ఉత్తరీయస్థానీయముగ ధరింపవలెను. ఇందులకుఁ బ్రమాణము

> "అజినోత్తరీయో హి దీర్ఘాయు ర్భవతి"

(కారికాసూక్తి)

ఇచట పర్వతములు బ్రహ్మచారులతోఁ బోల్చబడినవి గాన, ఈ పర్వతములకును "కృష్ణాఽజిన" ధారణము, ఇట మేఘధారణరూపములో సిద్ధించినది. ఇంక

> "యజ్ఞోపవీత్యేవా ధీయీత"

అను సుప్రసిద్ధసూక్తినిబట్టి, అధ్యయనముచేయుటకు బ్రహ్మచారికి యజ్ఞోపవీతధారణము ముఖ్యము కనుక, పర్వతరూప బ్రహ్మచారులు కూడ వర్షధారల రూపమున నిట యజ్ఞోపవీతములు ధరించినవి. దీనికిఁ బిమ్మటిది వేదపఠనము. ఈ పఠనములోని యుచ్చారణారీతులు పాణినీయ శిక్షలో సవివరముగ వివృతములై యున్నవి. ఉదాహరణార్థమై

♦ "ప్రకృతిః పంచభూతేషు స్వభావే మూలకారణే"

యొకవిషయ మిట ముచ్చటించెదను. సౌరాష్ట్రికాదేశములోని గొల్ల పడుచులు పెరుఁగు అమ్మునపుడు "త(క్రాం... ..." అని అమ్మెదరు. *
ఇదేవిధముగ వేదములోని "రంగలు" అను పదభాగములు ఉచ్చరించునపుడు ఆ గొల్లతలయొక్క "త(క్ర" పదోచ్చారణవలె నుచ్చరింపవలెను. ఇట్లే ఉపధ్మానీయ పదోచ్చారణలో (ల్గఫ్) పెదవులను రెండును బంధించి బుగ్గలతో గాలి పూరించి విడువవలెను. ఇదేరీతిగ ప్రస్తుత పర్వతగుహాలలో గాలి పూరితమై, తిరిగి విడువబడినపుడు ఒక లయతోగూడిన ధ్వని వినఁబడును. ఇది బ్రహ్మచారుల వేదపఠనము వలె నుండును. ఇట్లు ఇట పర్వతములకు, బ్రహ్మచారులకు వేదాధ్యయన కాలములో నుండు వేషభాషలన్నియు సరిపడియున్నవి. ఇట్లే వాల్మీకి రచనములోని పదగుంఫనము, వైదికభావ గాంభీర్యము, రచనా వైచిత్రి మున్నగునవి మన కవియొక్క మానసము నాకర్షించినవి. కనుకనే యీ కవి తన కుమారసంభవములో మాయావటువును వర్ణించుచు

> "అథా ౽జినాషాఢధరః ప్రగల్భవాక్ జ్వలన్నివ
> బ్రహ్మమయేన తేజసా ।
> వివేశ కశ్చి జ్జటిల స్తపోవనం శరీరబద్ధః ప్రథమా(శ్రమో
> యథా॥" (5-30)

ఇందు రామాయణములోని "అజినము" (చర్మయజ్ఞోపవీతము) కలదు. విశేషముగా నిచ్చటి బ్రహ్మచారికి "ఆషాఢము" ♦ అనగా పాలాశ దండము కలదు. ఇక మూలములోని "మారుతా౽పూరిత గుహాః ప్రాధీతాః" అను పదములు భావమును ప్రకాశింపఁజేయుచు మనకవి

* "యథా సౌరాష్ట్రికా నారీ "త(క్రాం......" ఇత్యభిభాషతే ।
ఏవం రంగాః ప్రయోక్తవ్యాః ఖే...అ...రాం...ఇతిభేదతః॥"
(చూ. పాణినీయశిక్ష)

♦ "పాలాశోదండ ఆషాఢః" అమరనిఘంటువు.

"ప్రగల్భవాక్, శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా" (యథా శబ్ద ఇవార్థే) అను వాక్యమును ప్రయోగించి వాల్మీకి రచనయందుఁ దనకుగల మక్కువను ప్రకటించినాడు. ఇంకను "సకీచకై ర్మారుత పూర్ణరంధ్రైః... ..." అను తన రఘువంశగత శ్లోకరచనముచే కాళిదాసు, పై వాల్మీకిరచనలోని పద, భావ మాధుర్యములను మననము జేసికొనినాడని నుడువఁదగును. (2-12) ఇట్టి సందర్భము లెన్నో యున్నవి. మచ్చునకుఁ కొన్ని చూపెదను వాల్మీకిమహర్షి వర్షర్తువును వర్ణించుచు శ్రీరాముని ముఖమున నిట్లు పలికించెను.

"మేఘాఽభికామా పరిసంపతన్తీ సమ్మోదితా భాతి బలాకపఙ్క్తిః।
వాతాఽవధూతా వరపౌండరీకీ లమ్బేవ మాలా రచితాఽమ్బరస్య॥"
(చూ. కిష్కింధాకాండ. 28 సర్గ. 23 శ్లో)

'బలాకములు' అనఁగా తెల్లకొక్కెర పక్షులు ఈ పక్షులు మేఘము క్రొత్తగ వచ్చినపుడు ఆకాశముపై పంక్తులుకట్టి తిరుగుచుండును. మేఘాఽభిముఖములై యున్న యీ పక్షులకీ సమయములో గర్భోత్పత్తి యగును. ఈ ప్రయోజనముకొఱకే యివి మేఘము నాశ్రయించును. ఈ విషయమే రామాయణములో "మేఘాఽభికామా..." అను శ్లోకమునఁ జెప్పఁబడినది. ఈ శ్లోకమునకు "గర్భధారణార్థం మేఘ మభికామయత ఇతి మేఘాఽభికామా... ..." అని గోవిందరాజీయ వ్యాఖ్య. ఇట్టి బలాకపంక్తి యెట్లుండె ననగా, ఆకాశముపై గాలికి చలించుచు, వ్రేలాడుచున్న పద్మపంక్తివలె నుండెను. ఇది వాల్మీకిమహర్షి భావము. ఈ భావమును స్వీకరించి మన కాళిదాసకవి తన మేఘసందేశ కావ్యములో

"మందం మందం నుదతి పవన శ్చానుకూలో యథా త్వాం
వామ శ్చాయం నదతి మధురం చాతక స్తే సగంధః।
గర్భాధానక్షణపరిచయా న్నూన మాబద్ధమాలాః
సేవిష్యంతే నయనసుభగం ఖే భవంతం బలాకాః॥" (1-9)

మేఘుఁడు మధ్యేమార్గములోఁ జూడదగిన వింతదృశ్యములనుగూర్చి తెలుపుచున్న యక్షునియొక్క మాట లివి.

"ఓ యంబుధరా! అలకాపట్టణమునకై పయనించుచున్న నీకు అనుకూలముగా వాయువు వీచును. చాతకపక్షులు నీమార్గములో నీకు ఎడమభాగమున నెగురుచు మనోహరముగ కూయును. ఈ శుభసూచక శకునములకు తోడుగా బలాకపక్షులు, తమ గర్భోదయోత్సవమునం దాశ కలవై నీ కభిముఖముగా పంక్తులుకట్టి, నేత్రాఽభిరాముఁడ వైన నిన్ను సేవింపఁగలవు" ఇది కాళిదాసీయ భావము. బలాకపక్షులు మేఘుని సన్నిధిలో గర్భముఁదాల్చు ననుటకు నిదర్శనము.

"గర్భం బలాకా దధతే ఽభ్రయోగాత్ నాఽకే నిబద్ధాఽ
వలయ స్సమంతాత్"
(చూ. కర్ణోదయము)

"పయనించువానికి వాయు వనుకూలముగ వీచుట, వామభాగమున చాతకకూజితము. మేఘసన్నిధిలో మాలలుకట్టిన బలాకపక్షుల దృశ్య దర్శనము, అను నివి శుభసూచకములు." అని శకునశాస్త్ర సిద్ధాంతము. ఇందు మనకవి పేర్కొనిన మూడవ విషయమునకు, అనగా "... ...గర్భాధానక్షణ... ...బలాకాః" అను రెండు పాదముల లోని భావమునకు "మేఘాఽభికామా... ..." అను వాల్మీకి శ్లోకమే మూలమని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. బలాకములు మేఘుని కామించుటలోని కారణము మూలములో గుప్తముగ నిక్షిప్తమై, సహృదయ హృదయంగమముగ సూచితమైనది. శృంగారరస ప్రియుఁ డౌటచేతను గాబోలు మన మహాకవి తన సందేశ కావ్యములో మాత్రము నగ్నముగా ఆ పదము నట్లే ప్రయోగించి, భౌతికవాంఛా వశులగు రసికులకు సంతోషకారకు డైనాడు. కాని యిట, ప్రియాం సంశ్లేష సంస్మరణ సంతుష్ట స్వాంతుఁడై కేవల కామియై యున్న యక్షుని నోటినుండి యిప్పట్టున ఇట్టి శబ్దమే వచ్చునేమో? యక్షుని

వలె శ్రీరాముడును భార్యా విశ్లేషములో నున్నను ఈ నాయకోత్త ముని భావ మతిగంభీరమై, యధిక నిగ్రహశక్తి కలిగి, ప్రపంచమునకే యాదర్శప్రాయ మైనది. "రామో విగ్రహవాన్ ధర్మః" అనునట్లు ఈ యుత్తమనాయకుఁడు శరీరము దాల్చి భూలోకమున నివసించిన ధర్మము. ఈ ధర్మమూర్తి నోటినుండి వచ్చిన మాటకూడ ఇంతటి పరమధర్మముతోఁ గూడి యుండవలెను. చూతుము. శ్రీరాముని నోటి నుండి వెలువడిన వాల్మీకిమహర్షియొక్క "మేఘాఽభికామా" అను శ్లోకభావమునుండి యీ క్రింది విశిష్టభావము ద్యోతితమగుచున్నది.

"....అనేన భగవంతం కాళమేఘశ్యామం ప్రాప్తుం
ప్రవృత్తా భక్తిరూపా ఉపన్నధీ ర్భవతి సజ్జనస్యేతి ద్యోత్యతే"
(చూ. గోవిందరాజీయ వ్యాఖ్య)

"భక్తిరూపిణియైన సజ్జనుని బుద్ధి నీలమేఘశ్యాముఁడైన పరమాత్మ స్వరూపుని సమాశ్రయించి సఫలతఁ గాంచును" అని యిది ధ్వనించు చున్నది. ఇట్టి ధ్వన్యర్థమునకు మూలములైన "మేఘాఽభికామా" "బలాకపంక్తిః" అను నేకవచన ప్రయోగములు సందేశకావ్యమున లుప్తములగుటచే రామాయణములోవలె నిట ధ్వన్యర్థము రాకున్నది. "రామాయణము" ఆదికావ్యముకదా! ఈ కావ్యోద్యానమునుండి యంటుకట్టి మన కాళిదాసు తెచ్చికొన్న భావలతాలతలు ఎన్నో యాతని కావ్యోపవనమును నుజ్జ్వలముగఁ దీపింపఁజేయుచున్నవని యనుకొంటిమికదా! ఇట్లే వాల్మీకి కాళిదాసుల కావ్యములలో పద గుంఫనాదులందు సమముగ సముద్దీప్తములైన యీ రచనాసామ్యములఁ గొన్నిటిని సమవలోకింపుఁడు.

"తటిత్పతాకాభి రలంకృతానాం ఉదీర్ణగంభీరమహారవాణామ్॥"
(శ్రీమద్రామాయణము. కిష్కింధ. 27 సర్గ)

"యత్రాంశుకాక్షేపవిలజ్జితానాం యదృచ్ఛయా కింపురుషాంగనానామ్॥"
(చూ. కుమారసంభవకావ్యము 1-14)

"ప్రాచీనవాహినీం చైవ నదీం భృశ మకర్దమాం॥"

(రామా. కిష్కింధ. 27 సర్గ)

"సరితః కుర్వతీ గాధాః పథ శ్చాశ్యానకర్దమాన్॥"

(రఘువంశము 4-24)

"మహాంతి కూటాని మహీధరాణాం ధారాభిధౌతా న్యధికం విభాంతి।
మహాప్రమాణై ర్విపులైః ప్రపాతై ర్ముక్తాకలాపై రివ లంబమానైః॥"

(శ్రీమద్రామాయణ కిష్కింధాకాండము 27 సర్గ)

"బాలేందువక్రా ణ్యవికాసభావా ద్బభుః పలాశా న్యతిలోహితాని।
సద్యో వసంతేన సమాగతానాం నఖక్షతానీవ వనస్థలీనాం॥"

(కుమారసంభవము 3-29)

ఇట్లు వాల్మీకిమహర్షి శైలిని దర్శించుచున్నశైలి, కాళిదాసకావ్యము లలో నంతటను వినిపించుచునే యుండును.

ఇందులకు ముఖ్యకారణము వాల్మీకిమహర్షి రచనారీతియందు మన కాళిదాసునకు గల పూజ్యభావము, గౌరవాదరములే ముఖ్య కారణము.

పైరీతిగ కాళిదాసకవితాశైలికి, వాల్మీకికవితాశైలి ఆలంబనమై యున్నది. పారాయణయోగ్యమగు నిట్టిశైలి నిట స్వల్పముగఁ జూపి, యీ విషయమునుండి విరమించెదను.

వాల్మీకిమహర్షి ప్రస్రవణపర్వతమును వర్ణించుచుఁ, దన రామాయణములోఁ దన కవితామృతమును ప్రపంచ ప్రజల కిట్లు ప్రసాదించెను.

"....గిరిశృంగ మిదం రమ్యం.................. ।
నానావిహగసంఘుష్టం మయూరరవనాదితం ।
మాలతీకుందగుల్మైశ్చ సింధువారకురంటకైః ।
కదంబార్జునసర్జైశ్చ పుష్పితై రుపశోభితం॥"

(రామా. కిష్కింధాకాండ.)

## నదీవర్ణనము

చంపకై స్తిలకై స్తాలైః తమాలై రతిముక్తకైః ।
పద్మకై స్సరళై శ్చైవ అశోకై శ్చైవ శోభితాః ।
"వానీరై స్తిమిశై శ్చైవ వకుళైః కేతకై ర్ధవైః ।
తీరజై శ్శోభితా భాతి నానారూపై స్తత స్తతః ।
వసనాఽభరణోపేతా ప్రమదే వాఽభ్యలంకృతా । *
ఏకైక మనురక్తై శ్చ చక్రవాకై రలంకృతా ।
పులినై రతిరమ్యై శ్చ హంససారససేవితైః ।
ప్రహంసతీ వ భాత్యేషా నారీ సర్వవిభూషితా । †
పారిప్లవశతై ర్జుష్టా బర్హిణక్రౌంచనాదితా ।
రమణీయా నదీ సౌమ్య మునిసంఘై ర్నిషేవితా॥

(చూ. కిష్కింధాకాండ 27 సర్గ)

హనుమంతుఁడు లంకను దర్శించినపుడ దది యిట్లుండెను.

"శాద్వలానిచ నీలాని గంధవంతి వనాని చ । ‡
గండవతి చ మధ్యేన జగామ నగవంతి చ ।
దదర్శ హనుమాన్ లంకాం దివి దేవపురీ మివ॥

(చూ. సుందరకాండ సర్గ 2—శ్లో. 5)

ఇట్లు వాల్మీకికవితాశైలి, కాళిదాసకవితాశైలికి జీవాత్మయై మార్గదర్శక మగుటచేతనే మన కాళిదాసు—

"సూత్రస్యేవా_స్తిమేగతిః" అని సత్యవిషయమును వచించి, తన కవితకు రామాయణ కవితయొక్క గౌరవాదరములు కల్పించినాడు.

---

* "నద్యో విశాలపులినాంతనితంబబింబాః ।
మందం ప్రయాంతి సమదాః ప్రమదా ఇవా ఽద్య॥"

(చూ. ఋతుసంహారము శరదృతువర్ణనము. 3-3)

† చూ. ఋతుసంహారము. సర్గ 2-5.

‡ చూ. రఘువంశకావ్యము. సర్గ 4.

ఓమ్

# కాళిదాస హృదయము



## శ్రీ కాళిదాస సౌందర్య సమారాధనము - విశ్వప్రేమము

మనము ప్రకృతిసౌందర్యము దిలకించినపుడు ఆనందభరితుల మగుచుందుము. ఇట్లె "అజంతాది" శిల్పము, శ్రీనివాసుని దేవాలయ శిల్పము మున్నగు శిల్పసౌందర్యములను జూచునపు డవి మన మానసములలో సుమధుర మధురానుభూతుల నుదయింపజేయుచునే యుండును. కనుక "సౌందర్య" మనునది నిత్యసంతోషజనకమై, యఖండానందము నమరజేయుచుండునని వ్యక్తమగుచున్నది.

పై "సుందర" శబ్దార్థము గురుబాలప్రబోధికలో నిట్లు నిర్వచింపబడినది. "సుతరాం ఆద్రియత ఇతి సుందరం" "దృఙ్ ఆదరే" మిక్కిలి సంతోషపెట్టునది "కీట్సు" (Keats) అను పాశ్చాత్య కవి * పై విషయమునే

"A thing of beauty is a joy for ever"

"సౌందర్యము నిత్య సంతోషదాయకము" అని తెలిపినాడు.

కనుక నీ దృశ్యమాన ప్రపంచములోని 'సుందర' వస్తువు లన్నియుఁ గనువారి కందోయికి విందొనర్చుచు ఆనందదాయకము లగుచున్నవని వ్యక్తమగుచున్నది. వస్తునిష్ఠమైన యీ 'సౌందర్యము' మానవుల యాత్మవృత్తిద్వారా అనుభవింపబడుచుండుటచే "నిది

---

(Keats John) * "ఇతడు ఇంగ్లండులో జన్మించి క్రీ.శ. 1821 వఱకు నున్నవాడు. ఇతడిరచనలు సౌందర్యతత్త్వబోధకములై యుండును. ఇతడు ముందు వైద్యుఁడై యావలసారస్వతోపాసకుఁ డైనవాఁడు. 5 సంవత్సరాలకావ్యరచనతో నాంగ్లవాఙ్మయ పీఠమును శాశ్వతముగ నధిష్ఠించినవాఁడు. కవిమర్శకులను సరకుగొనిన ధీరుఁడు. ఈతని రచనలన్నింటిలో సౌందర్యదృష్టి గోచరించును. అనేక గేయగుచ్ఛములను రచించి పిన్న వయసున నే కీర్తిశేషుఁడయ్యెను" (చూ. కాళిదాసకవిత. అనుబంధము)

వస్త్వాఽశ్రితమే కాని ఆత్మాశ్రితము కాదు" అను విషయముకూడ విశదమగుచున్నది.

ఇట్టి "సౌందర్య" మీ చరాచర ప్రపంచము నాశ్రయించి యున్నట్లే కావ్యప్రపంచమునుగూడ నాశ్రయించియున్నది. ఉదాహరణకు - కాళిదాసకవి కావ్యములను గనువారును, వినువారును అందలి సన్నివేశములు, అతి సుకుమార సౌందర్య సందేశ సంభరితము లని తనివితోఁ దమ తల లూపుచుండుట ♦ విజ్ఞులకు విదితమైనదే. కనుక సుందరాత్మకమైన కళాప్రపంచమునకు సంబంధించినదే "శాశ్వత సౌందర్య" మనఁదగి యున్నది. ఈ విషయమే శుక్రనీతిసారములో

"శాస్త్రమానే నయో రమ్యః సరమ్యోనాన్య ఏవహి"(14-4-104)

"సత్కావ్యాశ్రితమైనదే సౌందర్య"మని చెప్పఁబడినది. అనఁగా కాళిదాస మహాకావ్యములలోఁ జిత్రింపఁబడిన శకుంతలాదు లిపుడు లేకున్నను, వారి దివ్యసౌందర్య మణికాంతులు ఇప్పటికిని మహాకవుల కావ్యాదర్శములలో నిత్యసన్నిహితములై, యాచంద్రతారకముగఁ బ్రకాశించుచునే యున్నవి.

భారతీయ కవితాసౌందర్యము పాశ్చాత్య కవితాసౌందర్యము లన్నిటిలోఁ బ్రత్యేక ప్రాతినిధ్యము వహించిన దనవలెను. కారణ మేమనఁగా, నిది కేవల భౌతిక విషయలంపటమైనది కాక, ఆధ్యాత్మిక భావనా భాసితమై, ప్రపంచ మాంగళ్యమునకు బద్ధకంకణమై పరిఢవిల్లి యున్నది. ఇది యిట్లుండ, కాళిదాసునికాలములోఁ బ్రవృత్తితోఁపాటు

---

♦ "కిం కవేస్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతా పరస్యహృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః" ఏ కావ్యము కాని యే బాణము కాని ప్రయోగించినంతనే అది యెదుటివారి హృదయములో నాటుకొని, వారి తల లూపింపఁజాలదో అట్టి కావ్యము కాని, అట్టి బాణము కాని నిరర్థకమైనది. విన్నంతనే సంతోషముతో తల లూపింపలేని కావ్యము కాని, ప్రయోగించినంతనే గుండెలో గ్రుచ్చుకొని వాని తల వ్రేలాడఁజేయని బాణము కాని నిరుపయోగమని భావము. "గథే" యను యూరపియన్ కవి శాకుంతలముఁ జూచి సంతోషభరితుఁడై నాట్యముచేసినాఁడుకదా!

నివృత్తిమార్గము మంగళదాయకముగఁ దలంపఁబడుచుండెను. ఇందును భారతీయులు స్వతః ఇంద్రియములకు దాసులు కానివారు. ఏతదనుకూలముగనే యానాఁటి కవిత సాగవలసియుండును గదా! మఱియు నీ కవి కాలములోఁ "ప్రకృతిపురుష భావన" వ్యాప్తిలో నున్నది. కనుకనే కాళిదాసు మున్ముందుగా "ప్రకృతి" రూపములైన ఋతువుల నారాధించి (ఋతుసంహార రచన) పిమ్మట 'పురుషుని'తో ఆ ప్రకృతిని సమ్మేళనము గావించుటకై, ఏతదనురూపమైన 'కుమారసంభవ కావ్యము' నారంభించినాఁడు. ఇట్టి సమన్వయమున కీతఁడొకఁడే యర్హుఁడు గాన తత్కాల యుగ సమన్వయ సిద్ధాంతమునకీ కాళిదాస మహాకవియే యుగాధ్యక్షుఁ డనఁదగియుండెను.

ప్రస్తుతమున నీతని సౌందర్య వర్ణనాతత్త్వము భారతీయతత్త్వమును ప్రకాశింపఁజేయుచు "సత్యం-శివం-సుందరం" అను సూక్త్యర్థమును వివరించుచున్నట్లున్నది. మఱియు సౌందర్యోపాసకుఁడైన యీ కాళిదాసు సమ్యక్ దృష్టితో సౌందర్యము నారాధించిన ట్లితని కావ్యోదాహరణములు స్పష్టీకరించుచున్నవి. ఈ విషయము విశదమగుటకై యితని సౌందర్య వర్ణనమును బూర్వోత్తర భాగములుగ విభజించితిని. ఇట్టి విభాగముచేఁ బూర్వభాగములోఁ గేవల భౌతికముగఁ గానవచ్చుచున్న సౌందర్యము ఉత్తర భాగములోఁ బవిత్ర తపశ్శక్తి భాసురమై యలౌకిక మగుచు, జగన్మాంగళ్యమునకు మంగళ తోరణ మగుచున్నది.

బంగారమైనను (నయ్యది) అగ్నిలోఁ దప్తమైన పిమ్మటనే యందలి మాలిన్య మంతరించి, యద్దాని నిజకాంతి ప్రజల నేత్రములకును గాత్రములకును మంగళాలంకార మగుచుండును. ఇందులకు దేశకాలాదభిన్నత బాధకము కానేరదు. ఇట్లే యెంతటి సౌందర్యమైనను అగ్ని, తపో నియమాదులచే సంస్కృతమై, సౌశీల్యాది గుణసంపదచే నిర్మలమై, పవిత్ర చరిత్రచేఁ బావనమై ప్రకాశించిన పిమ్మటనే యద్దాని

యందలి 'సత్య'శోభాసందీప్తమై యది లోక 'శివం'కర మగుచుండును. ఇట్టి 'సౌందర్య' మే మన భారతీయ సంస్కృతికి మకుటమై ప్రపంచ ప్రశస్తికిఁ బాత్రమై ప్రకాశించిన రీతి నిఁక వివరించెదను. సర్వమంగళా దేవి రూపవైభవ మెంతటి కవితా వైభవముతో నీ కవీశ్వరునిచేఁ బోషింపఁ బడినచో పరిశీలింపుఁడు.

"ఉన్మీలితం తూలికయేవచిత్రం సూర్యాంశుభి ర్భిన్న మివారవిందం
బభూవతస్యా శ్చతురశ్రశోభివపు ర్విభక్తం నవయౌవనేన॥"
(చూ. కుమారసంభవము, సర్గ–1, శ్లో–32)

చక్కని సాముద్రిక లక్షణములుగల శర్వాణి శరీరము క్రొంగ్రొత్త జవ్వనముచేఁ గ్రొత్తగను, వేఱువేఱుగ విలసిల్లుచున్న విశిష్టావయవ ములతోను విరాజిల్లుచుండెను. అట్టి యామె రూప మెట్లుండె నన, రంగుకుంచియల రంజనద్రవ్యముచే రమ్యముగ రంజిత మగుటచే వినూత్నముగ విలసిల్లుచున్న రేఖాచిత్రమువలెను, సూర్యకిరణ ప్రసారము లచే వికసితమై,నవవికాసామోదములతోఁ బ్రత్యగ్రముగఁ బ్రకాశించు చున్న పద్మమువలెను బ్రకాశించెను. అనఁగాఁ జిత్రములో నణఁగియున్న దంతయు రంగు కుంచియలచేఁ వ్యక్తము। సేయఁబడినట్లును, పద్మములో నాచ్ఛాదితమైయున్న సౌందర్యము సూర్య కిరణములచే సుస్పష్టముగ రాణించినట్లును, శర్వాణిలో స్వతస్సిద్ధముగ నున్న యందము, అప్పటి యౌవనప్రాదుర్భావముచే నుజ్జ్వలమై యుద్భాసితమయ్యెను.

పై శ్లోకము, పార్వతీ సౌందర్య వర్ణనమునకుఁ బ్రారంభమై, ఈ కవీశ్వరుని "సౌందర్య సమారాధన" కు ముందు, తత్సిద్ధికైన మంత్రజపమువలె భాసించుచు, నీ సర్గము నంతటిని భాసింపఁజేయు చున్నట్లున్నది. ఏమందురా ? ఈ కవి యిట పదునొకండక్షరములు గల "వృత్తము" నుపయోగించినాఁడు. కనుక మన కవీశ్వరున కీ వృత్తము ఏకాదశాక్షరీ మహామంత్ర జప ఫలితమును బ్రసాదించుచు *

* "ఏకాదశరుద్రాః" అని యుండుటచే ఏకాదశత్వవిశిష్టేశ్వరారాధన మిట సూచితము.

'సౌందర్యారాధనమున'కు నీతని యర్హతను సూచించుచున్నది. చూడుఁడు. శ్రీ ఆదిశంకరులు తమ సౌందర్యలహరీ స్తుతిలో "తుహిన గిరికన్య" యొక్క సౌందర్యమును వర్ణించుచు,

"త్వదీయం సౌందర్యం తుహినగిరికన్యే! తులయితుం
కవీంద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః...."

అని, గిరిజా సౌందర్యవర్ణనకు బ్రహ్మాదులే సమర్థులన్నారు. కనుక నిట నేవంవిధవర్ణనము సేయుచున్న మన కాళిదాస కవిబ్రహ్మ, "విరించి" యేకావలయును. మఱియుఁ దపఃఫలములన్నిటిని స్వయమున భక్తుల కీఁజాలిన "ఈశ్వరుఁడు" ఏదో కోరికతోఁ దపస్సు చేసినాఁడని కవి భావము. "స్వయం విధాతా తపసః ఫలానాం కేనాపి కామేన తపశ్చ చార" (1-57). అవాప్త సర్వకాముఁడైన యీశ్వరుని కిట పార్వతీ సౌందర్య సర్వస్వలాభ సముత్కంఠ వినా వేఱొక కోరిక యేముం డును ? పార్వతీ పరమేశ్వరులు "పరస్పర తపస్సంప త్ఫలాయిత పరస్ప రము" కలవారుకదా! కాఁగా 'ఈశ్వరుఁడు' కూడఁ దాను తపస్సు చేసినపిమ్మటనే పార్వతీ సౌందర్యతత్త్వము పొందఁదగినవాఁడు" అని యిట సూచితమగుచున్నది ఇంతటి 'మహా సౌందర్యము'ను వర్ణిం చుట కిట ఆదిశంకరు లనినట్లు మన కాళిదాసమహాకవి విరించి (బ్రహ్మ) వినా - ఒక భారతీయ సౌందర్య తత్త్వవేత్త వినా - వేఱొక రెట్లు సమర్థు లగుదురు ?

పై విధముగ ఈశ్వరుఁడు తపశ్చరణముచే బ్రహ్మతేజోవిరాజ మానుఁడై (5-30) నైష్ఠిక సుందరుఁ డగుచు. (5-62) * పార్వతీదేవి కూడ పంచాగ్నిమధ్య తపశ్చరణాది కృచ్ఛ్రతపః కృశయై, సత్య

---

* వైముఖ్యముతోఁ గూడిన యింద్రియ సుఖానుభవమునుండి ఆధ్యాత్మిక సుస్థితిని లభింపఁజేయఁ జాలినదే నైష్ఠిక సౌందర్య" మని రవీంద్ర కవీంద్రుని యాశయము

సౌందర్య సందీపితమై, యీశ్వరుని యర్ధాంగలక్ష్మి యగుటకుఁ బాత్రమై యుండెను.

ఇంతటితోఁ బార్వతీసౌందర్యము ఆధ్యాత్మిక తేజస్సంభృతమై ఆదిదేవునంతటివాని కాదరణీయము కాఁగల్గినది. ఈశ్వరుఁడుకూడ నింతకుముందు యోగాభ్యాస బలమున "పరంజ్యోతిని" దనలో దర్శించి (3-58) ఆధ్యాత్మిక తేజస్సంపన్నుఁడై "సత్యం శివం సుందరం" అను సూక్త్యర్థమునకుఁ జక్కని నిదర్శనమై పార్వతీదేవి పాణిగ్రహణ భాగ్యముతో నిరువురును జగత్పితరు లగుచున్నారు.

ఇట్లు జగన్మాంగళ్యమునకు సారవత్కారణమైన పార్వతీ సౌందర్య సర్వస్వమును, పై శ్లోకము ("ఉన్మీలిత" మ్మను దాని)లో నిక్షేపించి యీకవి "సౌందర్యసమారాధన" ప్రబంధమున కీ శ్లోకమును నాందిగాఁ జేసినాఁడనుట యుక్తము. ఇంతటి మహత్తర నాంద్యర్థమును వివరించుటకు డాక్టర్ శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి "సౌందర్య మీమాంస" అను వ్యాసమునుండి * కొన్ని వాక్యముల నిట ఉల్లేఖించెదను.

> "చిత్రము షడంగకము........" రూపభేదాః ప్రమాణాని
> భావలావణ్య యోజనం, సాదృశ్యం వర్ణికాభంగ ఇతిచిత్రం
> షడంగకం.
>
> (చూ. జయమంగళ వ్యాఖ్య)

"......బాహ్యజగత్తులో సుందరములుకాని వస్తువులు సైతము కళాప్రపంచమున సౌందర్యముగా స్ఫురించఁగలవు. అనఁగా కళాప్రపంచముననే సౌందర్యమున్నదిగాని అన్యత్ర లేదు. శృంగారాది రసములుకూడ లోకమునఁగాక, కావ్యముననే కలవు.

> "సర్వానుగ్రాహకంహి శాస్త్రమితి న్యాయాత్ తేన నాట్య ఏవ
> రసాన లోక ఇత్యర్థః కావ్యంచ నాట్యమేవ"

---

* చూ. 'భారతి' 'సర్వజిత్తు' సంవత్సర జ్యేష్ఠము.

అని, అభినవగుప్తుఁ డనినాఁడు (చూ. "అభినవ భారతీ" పుట 292)

... ... ... ... ...

చిత్రమున భావలావణ్యములు (Matter and Form) ఏకానుసంధానాత్మకములు కావలెను.

ఏవం విశిష్టమైన భావలావణ్య యోజన తూలికచే నున్మీలిత మగును. తాదృశ ఉన్మీలనముగా పార్వతిని భావనచేసిన కాళిదాసున కీ యుపమానము రుచింపకపోవుటచే "సూర్యాంశుభి ర్భిన్న మివారవిందం" అను ద్వితీయోపమ చెప్పఁబడినది. చిత్రగత సౌందర్యము కవి భావనా సమున్మీలితమైన దగుటచే వస్తుతంత్ర (Objective) మైనను, మనోవృత్తి (Subjective) చే నావృత మగుచున్నది. అనఁగా అమర్త్యమైన సౌందర్యమునకు మర్త్యస్పర్శ పనికిరాదు.

చిత్రగతసౌందర్యమున నిది కనబడుటచేతనే ద్వితీయోపమ మహాకవిచేఁ బ్రయుక్తమైనది.

ఇఁక సూర్యకిరణస్పర్శచేఁ బద్మము వికసించుచున్నది. పద్మమునకు మానవస్పర్శ లేదు. రవికిరణజనిత ఉన్మేషమే సౌందర్యాభివ్యక్తి హేతువగుచున్నది. అనఁగా సౌందర్యము జగన్నిష్ఠము కాని ఆత్మనిష్ఠము కాదు... ... ... ... ... ... ...పద్మములో లీనమైయున్న సౌందర్యాభివ్యక్తికి సూర్యకిరణములు నిమిత్తము లగుచున్నవి. కావున "భిన్న" శబ్దమునకు "ఆచ్ఛాదితమైయున్న సౌందర్యము అభివ్యక్తమగుచున్నది" అని అర్థము సెప్పుకొనవలెను.

ఇఁక "చతురస్ర శోభివపుః"... ... ... ... ... ... ...అనఁగా "చతురస్ర" శబ్దము సౌందర్యాభివ్యక్తి సూచకమైన రూప పరము; లావణ్య పరము... ... ... ... ...ఆమె శరీరము చతురస్రత్వమును శోభింపఁజేయునది... ...ఇట్టి శరీరమున భావలావణ్యముల కేకానుసంధానత్వ ముండుటచే, ఆత్మవృత్త్యధీనమైన సౌందర్యభావన, వస్తు

తంత్రతనిష్ఠమైన సౌందర్యయోజన పార్వతిలో లలితవిజ్ఞాన యోజనల *
మేళనమునంది, అలౌకిక, ఆధ్యాత్మిక సౌందర్యాభివ్యక్తికి నిర్దేశకము
లగుచున్నవి... ... ... ..."

ఇట్లలౌకిక సౌందర్యసజ్జిత యగు పార్వతీదేవియొక్క పాదార
విందముల నీ కవి మొదట ఆరాధింప నెంచినట్లు సులలిత సుకుమార
రీతితో "తచ్చరణములు అవ్యవస్థిత స్థలారవింద శోభ నాహరించి"
నట్లు వర్ణించినాడు. (చూ. కుమారసంభవము 1-33) శ్రీ ఆది శంక
రులుకూడ శర్వాణీచరణస్తుతి సందర్భమునఁ దమ సౌందర్యలహరిలో
"... ... ...భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛా సమధికం,
శరణ్యే లోకానాం తవహిచరణావేవ నిపుణౌ అని తత్పాదారవింద
భజనము కాంక్షితాధిక ఫలప్రద మగుచున్నట్లు తెలిపిరి. ఇఁకఁ
దత్పాదాది శిరఃపర్యంత వర్ణనములోఁ గల కొన్ని వర్ణనములనే
యిటఁ గైకొందును.

పార్వతీదేవి కంఠశోభ గాంచఁదగినది. లోకములో స్త్రీల కంఠా
ద్యవయవములు రత్నహారాది భూషణములచే నలంకరింపఁబడును.
కాఁగ కంఠమునందు "భూష్య భావము", హారమునందు "భూషణ
భావము" అను నివి కవిలోకమునఁ బ్రసిద్ధములై యున్నవి. ప్రస్తుత
మున "భూష్యభావ" యుక్తమైన గిరిజా కంఠము "భూషణ భావ"
భాసురమైన కంఠహారమునుగూడ నొకప్పుడలంకరించుచున్నది. కనుక
ఇంతవఱకు హార, కంఠములందు ప్రసిద్ధమై యున్న "భూషణ"

---

* ఈ కవి తన మాళవికాగ్ని మిత్ర నాటకములోఁగూడ

"అవ్యాజసుందరీం తాం విజ్ఞానేన లలితేన యోజయతా ।......... (2-13)
లలితమై విజ్ఞానవంతమైన యోజనవలన సౌందర్యాభివ్యక్తి కలుగును. దీనిలో భావ
లావణ్యముల కేకానుసంధానత్వ ముండును.

ఇందు రూపావిష్కృతి "చతురస్ర" శబ్ద వాచ్యము.

(చూ. భారతి సౌందర్య మీమాంస)
(సర్వజిత్తు సం. జ్యేష్ఠం)

"భూష్య" భావము గిరిజా కంఠ విషయమున విపర్యస్తమై పర్యాయ ముగ నుభయసాధారణమగుచున్నది. (చూ. కు.సం. 1-42) ఈ విశేషము సామాన్య స్త్రీలోకమునఁ గానరానిది.

అలంకారములు లేకున్నను శరీర మలంకారయుతమైన ట్లొందగించుచుండుట "రూప" మనఁబడును. * ఇట ఉమారూపము, పై 'రూప' లక్షణమును విడువకయే అలంకారములనుగూడ నలంకరించు నంతటి విలక్షణశోభతో విరాజిల్లుచుండుట, మన సౌందర్యారాధకుని సౌందర్య వర్ణనా పాటవమునకుఁ దార్కాణము. ఇఁక ఉమాముఖ వర్ణనము.

"చంద్రం గతా పద్మగుణాన్న భుంక్తే పద్మాశ్రితా
చాంద్రమసీ మభిఖ్యాం । ♦
ఉమాముఖంతు ప్రతిపద్యలోలా ద్విసంశ్రయాం ప్రీతి
మవాపలక్ష్మీః॥" (కు. సం. (1-43)

"శోభాలక్ష్మి (ఆముష్మికమైన.) చంద్రు నాశ్రయించి యున్నపుడు, పద్మగుణాగతానందము నంద లేకున్నది. ఇట్లె ఆ లక్ష్మి భూలోక స్థితమైన (ఐహికమైన) పద్మము నాశ్రయించి యున్నప్పుడు చంద్రుని లోని కాంతిమత్త్వాదులవలనఁ గల్గు నానందము నంద లేకున్నది. ఇట్లా శోభాలక్ష్మి చంద్రారవిందములలో, నేయొక్క చోటను నఖండానందము నందుకొనలేనిదై చంచలయై తుదకు గిరిజా ముఖము నాశ్రయించి, యిట చంద్రునిలోని కాంతి శైత్యాది గుణాగతానందమును, పద్మములోని సౌకుమార్య సౌరభత్వాగతానందమును ఇట్లు వస్తు

* "అంగాన్య భూషితాన్యేవ కేన చిద్భూషణాదినా, యేన భూషితవద్భాతి తద్రూపమితి కథ్యతే" "భూషణములు లేకున్నను భూషణములు ధరించినట్లు శరీర మందగించుట "రూప లక్షణము"

♦ అభిఖ్యానామశోభయోః" అమరము.

ద్వయము నాశ్రయించిన ద్వివిధానందము నొక్కసారిగ అఖండముగ ననుభవింపఁ గల్గుచున్నది." ఈ శ్లోకార్థమును, మును నేను భావించు చుండఁగా నొక వ్యంగ్యార్థ మిట్లు భాసించినది. భావుకు లీ విశేషార్థ మును విలోకించెదరు గాక.

"భారతీయ కవితా కీర్తిలక్ష్మి యనఁదగిన సంస్కృత కవితా లక్ష్మి, శోభాలక్ష్మికి నిత్య నిలయమైన యువా ముఖలక్ష్మి వంటి కాళిదాస కవీంద్రుని కావ్యలక్ష్మిని ఆశ్రయించినదై ద్విసంశ్రయమైన, అనఁగా నాముష్మికయుతమైన యైహికానందము నొక్కసారిగ నా సంస్కృత కవితాలక్ష్మి పొందఁగల్గుచున్నది." ఐహికముతో నాముష్మి కము కలిసినపుడే అట్టిది అఖండానందదమై, మన కవీశ్వరుని కావ్య లక్ష్మినటె బ్రహ్మానందదాయక మగుచుండునని యీ వ్యంగ్యార్థము లోని భావము. ఇట్టి భావములు పరిణత భావభాసురులకు పరిగ్రా హ్యము లగుచుండును.

పై విధముగ మన కవీశ్వరుఁడు పార్వతీదేవి రూపమును మనో జ్ఞముగను, మహితముగను వర్ణించి తద్రూపమును సౌందర్య శేవధిగ *

"సర్వోపమాద్రవ్య సముచ్చయేన యథాప్రదేశం వినివేశితేన।
సానిర్మితా విశ్వసృజాప్రయత్నా దేకస్థ సౌందర్య దిదృక్షయేవ॥"

(1-49)

'చంద్రారవిందాద్యుపమాన వస్తుగతకాంతి సౌకుమార్యాది సౌందర్య ద్రవ్యమంతటిని సంతరించి, యథానసగముగ దీని నుపయోగించుచు బ్రహ్మ పార్వతీదేవిని అందాలరాసిగా, కేవల సౌందర్య ద్రవ్య స్వరూ పిణిగఁ బ్రయత్నముతో నిర్మించినాఁడుఁట ఇంతటి యపూర్వ, నూతన నిర్మాణమునకుఁ గారణము బ్రహ్మకు "ఏకత్ర సౌందర్య దిదృక్ష"యే; ప్రపంచములోఁగల "సౌందర్య"ము నంతయు నొక్కచోఁ జూచు

---

* నిధి ర్నా శేవధిః (చూ. అమరము 1.71)

కోరికయే. ఇట్టికోరిక బ్రహ్మకు లేనిచో నిట్టి యపూర్వనిర్మాణ ప్రయత్న మెందులకుఁ బ్రాదుర్భవించును ?

ఇట్టి గిరిజ * గిరీశుని సపర్యకై గిరిరాజుచే నియుక్తయై యొక నాఁడు గిరీశుని సన్నిధికి వచ్చుచున్నది. అప్పటి యామె రూపమును జూచి రతిదేవికూడ సిగ్గుచెందుచున్నది. (3-57) ఇట్టి రత్యధిక రూపముతో వనదేవతలు చెలులై తనవెంట రాఁగా నా పర్వతరాజకన్య అకాల వసంత శోభలతో మునులనుగూడ మోహపెట్టుచున్న వసంత విజృంభణములతో వెలయు స్థాణ్వాశ్రమములోనికి వచ్చుచున్నది. అప్పటి యామె సహజసౌందర్యము మన కాళిదాసకవీంద్రుని కవితా సౌందర్యముచే మఱింత వన్నెకెక్కి మహితముగ నిట్లు భాసించుచున్నది.

"ఆవర్జితాకించిదివ స్తనాభ్యాం వాసోవసానా తరుణార్కరాగం
పర్యాప్తపుష్ప స్తబకావనమ్రా సంచారిణీ పల్లవినీలతేవ॥"

(3-54)

"నగరాజపుత్రి పయోధరముల గౌరవముచే నీమన్నమిత (వంగినది)యై బాలసూర్యుని రాగమువంటి రంగుకల వస్త్రమును ధరించి యా చంద్రశేఖరుని సమీపమునకు వచ్చుచుండఁగా, నిండు పూగుత్తుల బరువుచే వంగి, చిగురుటాకులతోఁ గూడి, నడచి వచ్చుచున్న లతవలె నా రాకన్నియ, లలితసుందర సుకుమార గాత్రయై కానవచ్చెను." ఆ హిమ గిరికన్య వచ్చుచున్నప్పు డింకను నెట్లుండె ననఁగా "సంయమి యగు నీశ్వరునిఁ జూచుటతోడనే భయముచేఁ జెదర్చిన తన చేతినుండి యప్రయత్నముగఁ జాఱముఁజార్చిన మన్మథుని సన్నగిలిన సాహసమును దిరిగి గిరిజ తన సమ్మోహనరూపముతో ఎగసనద్రోయుచుఁ జెలికత్తెయలతోఁ గూడి వచ్చుచున్నది" (3-52) ఇట్లు గిరిజాకన్య రాకను, మన కవిచంద్రుఁడు శ్లోకపంచకముతో నైదువిధములుగ విస్మయకర విలాస విభవములచే నొయ్యారముగ వర్ణించినాఁడు చూడుఁడు.

---

* "గిరీశో గిరిశో మృడః" (చూ. అమరములో దేవవర్గము)

"ఈ హిమవత్పుత్రి పొగడపూల మాలను మొలనూలుగా ధరించి వచ్చుచుండఁగా నా మేఖల, మాటిమాటికి మొలనుండి జాఱుచున్నది. జాఱుచున్న యా మేఖల యెట్లుండె ననఁగా మన్మథుఁడు మున్ముందుపయోగించుకొనుటకై దాఁచుకొనుట కుత్తమస్థానమైన యీ గిరిజా నితంబస్థానమున దాచిన రెండవ నారిత్రాడువలె నున్నది. (పొగడదండ) ఇట్టి యీ కేసరదామకాంచిని గిరిజ పదేపదే పైకిఁ బట్టుకొనుచు వచ్చుచున్నది. (చూ. 3-55)

గిరిజా కల్యాణానంతరమునఁ బునర్జీవితుఁడైన మన్మథుఁడు తిరిగి ఈ గిరిజా సాధనముచే (ఈ నారిచే) మదనారిని మోహపెట్టి తన కోపముఁ దీర్చికొన్నాఁడు కదా ! కనుక మన్మథుని ద్వితీయ మౌర్వివలె నీ గిరిజా నితంబ స్థితమగు కేసరదామ కాంచి, విశ్వమోహన కరముగఁ గరము ప్రకాశించుట సహజము.

మఱియుఁ "బద్మినీజాతికిఁ జెందిన యీ గిరిరాజకన్య, వామదేవునివైపు వచ్చుచున్నపుడు ఈమె సౌగంధికనిశ్వాసమును జవిగొన్న యొక తుమ్మెద, ఆమె నిశ్వాసము పద్మపరిమళ మనుకొని యామె యధర సమీపమునఁ దిరుగుచున్నది. అప్పుడా లోలాక్షి భయసంభ్రమములతో 'లోలాక్షి' యగుచుఁ దన చేతిలోని లీలారవిందముచే నా తుమ్మెదను నివారించుచు వచ్చుచున్నది"

(చూ. కు. సం. సర్గ 3 శ్లో. 56)

ఇట్లు సంయమీంద్రుఁడగు సర్వేశ్వరునిఁగూడ మోహపెట్టఁగల్గినంతటి సమ్మోహనరూపముతో వికారకారులగు విలాసవైభవములతో మదజనకమగుచున్న ప్రకృతి ప్రాభవముతో ప్రభావితయై యాగిరిరాజకన్య వచ్చి, యా సంయమీంద్రుని సమీపించి, కిసలయఖండ మిశ్రితమైన వాసంతపుష్ప ప్రకరమును దత్పాదమూలమునఁ జల్లి, తన నల్లని కురులలో జాలువారుచున్న నవకర్ణికార పుష్పములను ఒయ్యారముగ జార్చుచు, కర్ణాలంకారముగధరించిన చిగురుటాకుజారునట్లు తనశిరము

వంచి యా మోహనగాత్రి యా సంయమికి మ్రొక్కెను. ఈ సుము హూర్తసమయమున సుమాస్త్రుఁడు సమీపించి, తత్సమ్మోహనరూపము ను త్తమోపకరణముగఁ జేసికొని సాహసముతో నా సర్వేశ్వరునిపైఁ దన సమ్మోహన బాణమును బ్రయోగించెను. ఈ సరస సన్నివేశ ద్వయ సమ్మేళన శక్తిచే నా జితేంద్రియుని ధైర్యము, చంద్రోదయ సమయమున సముద్రమువలెఁ గొంచెము చలించినది. తోడనే మహే శుఁడు పర్వతరాజకన్య యధరమువైపు సాభిలాషముగఁ జూచినాఁడు. మహేశునిలోఁ గల్గిన ఈ సరస భావోదయము శర్వాణిలో శృంగార చేష్టితముల నుద్గమింపఁజేసి, చంద్రశేఖరుని ముఖమువైపు తన్ముఖమును ద్రిప్పించినది. విరూపాక్షునిచిత్తములో వికార ముదయించినది.

ఇట్టి వికార మీశున కింతవఱకుఁ దెలియనిది అకాండ జనిత మగు నిట్టి వికారమును దనలో నడంచికొని యీశుఁడు రుద్రుఁడై వికారకారకుఁడైన యా మదనుని, భస్మావశేషునిఁజేసి యచటువీడి యంతర్ధానము పొందెను. ఇంతటితోఁ దృతీయసర్గాంత మగును.

సమ్మోహనబాణముంబోలిన పార్వతీ సమ్మోహనరూప మిట శర్వునిచిత్తమును గొంచెము మెత్తన చేయునంతవఱకే యుపయోగిం చినది. కనుక వికారకారకమైన సమ్మోహన బాణముతోపాటు వికార జనకమైన పార్వతీ సమ్మోహనరూపముకూడ వమ్మైపోయినది. గిరిజ శూన్యచిత్తయై గిరిరాజ గృహముఁ జేరుకొన్నది.

( ఇది పూర్వభాగము )

భారతీయ వివాహ సంప్రదాయములోఁ గన్యాదాత, వరునిగూర్చి

"ధర్మేచ, అర్థేచ, కామేచ. త్వయైషా నాఽతిచరితవ్యా"

"ఈ వధువుతోఁగూడి నీవు ధర్మార్థకామములను సమదృష్టితో సేవించ వలయును" అని వరున కుపదేశించును. ఆవరుఁడపుడు 'నాఽతిచరామి' అని కన్యాదాతకు వాగ్దానము చేయును. ఈ సూత్రార్థమునే యీక్రింద సూక్త్యర్థ మిట్లు స్పష్టము చేయుచున్నది.

"ధర్మార్థకామాః సమమేవ సేవ్యాః
యో హ్యేకసక్తః స జనో జఘన్యః"

కనుక మన వైవాహిక సంప్రదాయానుసారముగాఁ గేవల కామపురుషార్థ సేవనము నింద్యమైనది. ఇట్టి తృతీయ పురుషార్థమునే ప్రస్తుతమునఁ బ్రధానముగఁ దోఁపించుచుఁ దన విరక్తుల చిత్తములను వికారాస్పదముగఁ జేసిన మన్మథుని మన్నింపక, మన కవీశ్వరుఁ డీశ్వరునితోఁ గలిసి భస్మముచేసి, మదనసహకారియైన పార్వతీ సమ్మోహనరూపమును - విశ్వైక సౌందర్య సర్వస్వమును - మోమాటము లేక తిరస్కరించి, త్యజించి, భారతీయ పవిత్ర ప్రణయ ప్రభావము నిటఁ బ్రకటింపఁ దలఁచినాఁడు.

"ధర్మార్థ కామ మోక్షములు" అను మన పురుషార్థ చతుష్టయములో "ధర్మము" * మొదటిది. కనుక భారతీయ సంప్రదాయ రీత్యా "ధర్మము"న కగ్రస్థానము లభించినది. అనఁగా భారతీయునికి సర్వప్రథమముగ స్వమతధర్మ మవశ్యానుష్ఠేయ మగుచున్నది. తుదకు మనకు స్వధర్మములో నిధనముకూడ శ్రేయస్కరమే. ♦ కనుక భారతీయుఁ డైనవానికి "ధర్మము" ప్రాణతుల్యమే కాక ప్రాణాధిక మగుచున్నదని స్పష్టమగుచున్నది. ఈ "ధర్మ"సూక్ష్మమును బాగుగ నెఱింగినవాఁడు కనుకనే యీ కాళిదాసు మాయావటు ముఖమునఁ దపోనిష్ఠలోనున్న పార్వతినిగూర్చి యిట్లు పలికించినాఁడు.

"అనేనధర్మస్స విశేషమద్య మే త్రివర్గసారః ప్రతిభాతిభామిని।
త్వయామనో నిర్విషయార్థ కామయా య దేక ఏవ ప్రతిగృహ్య
[illegible] ।

---

* "ధ్రియతే ఇతి ధర్మః" [illegible]
గల్గుచున్నదో అదే ధర్మము.

♦ "స్వధర్మే [illegible]

'ఓ గిరిజా! నీ విపు డర్థకామములయం దాసక్తి విడనాడి, ఒక్క "ధర్మమునే" ఇంతగా నారాధించుచుండుటచేధర్మమే "త్రివర్గములో" సారము కలదని నేను (కపట వటువు) తలంచెదను.

కనుక, భారతీయ పవిత్ర ప్రణయ జీవితపుష్పమాల్యము "ధర్మే చార్థేచ కామేచ త్వయైషా నాఽతి చరితవ్యా" అను సూత్రముచే సుసంగ్రథితమై సుబద్ధమై యున్నది. దీనిచే "అర్థకామములు ధర్మానుస్యూతము లైనపుడే మానవానంద మందఁజేసి సార్థకము లగుచున్న" వను భావమును బైసూత్రము ధ్వనింపఁజేయుచున్నది. ఈ గృహ్య సూత్రార్థమునే కాళిదాసకవీంద్రుఁ డిట వివరింపఁదలచి, భౌతికమైన ప్రస్తుత గిరిజాసౌందర్యమును నిరహంకారముగను ధర్మయుతముగను నిర్మలముగను సంస్కరింపఁ దలఁచి నాయికా నాయకులను కవి దాత్కాలికముగ నిట వేఱుచేసినాఁడు.

"సత్యము"నకు స్థానము లేనిచోట "శివ"ము నకును స్థానము లభించదు. ఈ సత్యము, శివము లేనినాఁడు "సుందరము" సున్న. కనుక సత్యము, శివము కలసి "సుందరము" తో సమ్మేళనము చెందినపుడే అట్టిది "భారతీయ సౌందర్య" ముగఁ బరిణమించును. ఇట్టి పరిణామ మంతయుఁ దపస్సుచేతనే సాధ్యమగును. ఈ పరమార్థమును బట్టి గిరిజా రూపమును సత్య సౌందర్య సంయుతముగ సరిదిద్దఁదలఁచి మనకవి యిట గిరిజచే (సౌందర్యగర్వితచే) దపస్సుచేయించుటకు నిశ్చయించినాఁడు. కనుక గౌరియుఁ దంద్రి యనుమతితో

"ఇయేషసాకర్తు మవంధ్యరూపతాం సమాధిమాస్థాయ తపోభిరాత్మనః।
అవాప్యతేవాకథ మన్యథాద్వయం తథావిధం ప్రేమపతిశ్చ తాదృశః॥"

(5-2)

"ఉమాదేవి తన మొదటి నిరుపమ సౌందర్యరూపమును దపోనియమములచే నిపుడు "అవంధ్య" రూపముగా సంస్కరింప సమకట్టినది. ఇట్లీమె తన రూపము "నవంధ్య" ముగ సంస్కరింపనిచో నీశ్వరుని

యర్ధాంగము నాహరించునంతటి పవిత్ర సుస్థిర ప్రేమయు, అఖండసౌభాగ్యసంధాతయగు మృత్యుంజయుఁ డంతటివాఁడు పతిగాఁ బ్రాప్తించుటయు అను నీ యభ్యుదయద్వయ మీ శర్వాణి కెట్లు చేకూఱఁగలదు ?"

ఇట గమనింపఁదగిన విషయ మిది. గిరిజ తపోనియమములతో "నవంధ్య" రూపమును సంపాదింప సమకట్టినదికదా ! కాఁగా నింతకుఁ బూర్వమందుఁగల యీ యామె యంద మంతయు - విధాతకుఁగూడ వినోదమును గల్గింపఁజాలినంత కమనీయరూప మంతయు - "వంధ్య"మైనట్లు వ్యక్తమగుచున్నది. కనుకనే గిరిజ తన "వంధ్య" రూపముతో శివుని చిత్తమును జూఱఁగొనలేక తత్వ్యక్తయై, "పతి చిత్తము చూఱఁగొనలేని యతివ యందము అందమేకాద"ని తన యప్పటి వంధ్య రూపమును దానే నిందించుకొన్నది. (5-1)

ఇప్పటి యీ యామె సౌందర్యములో "సత్యత" లేకపోవుటచేతనే యీయామె శివుని వశీకరించుకొనలేకపోయినది. కనుక నిపు డాలోటు తీర్చుకొనుటకై యీ గిరిజ తపశ్చరణమునకుఁ గడంగవలసివచ్చినది. కాఁగా తపశ్చరణము "సత్యసౌందర్య సంపాదక"మని స్పష్టమైనది. ఇట్లనుట కింకొక నిదర్శనముకూడ లేకపోలేదు. చూడుఁడు-కు.సం.లో.

"ఏతావాతా న న్వనుమేయ శోభి కాంచీగుణ స్థాన మనిందితాయాః।
ఆరోపితం యద్గిరిశేన పశ్చా దనన్య నారీకమనీయ మంకం॥(1-37)

"జితేంద్రియుఁడైన శివుఁడు అన్యస్త్రీలకు లభ్యముకాని తన తొడపై పార్వతీదేవిని ఆమె తపశ్చరణానంతరమందే అధిష్ఠింపఁ జేసికొనినాఁడన్నచో నామె నితంబబింబము తపస్సంస్కృత సౌందర్యసంయుతమై జితేంద్రియుని చిత్తమునుగూడ రంజింపఁజేయునంతటి శోభకలదనియు, తత్కాంతి యూహింపఁదగినదేగాని వర్ణింపఁదరము కానిదనియు, దానిచే "తపశ్శక్తి" యెంతటి దుష్కరకార్యములనైనను సుకరముగాఁ జేయుననియు నిట స్పష్టమగుచున్నది. కనుకనే

"యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం।
తత్సర్వం తపసా ప్రాప్యం తపోహి దురతిక్రమం॥"

"ఏ వస్తువు మానవునకు దుస్సాధ్యము, దుర్లభము, దుర్గమము నగుచుండునో ఆదేవస్తువు తపశ్శక్తిచే సుసాధ్యము, సులభము, సుగమము నగుచుండును. మనకు మన మహర్షులచే నొసంగఁబడిన 'మూలశక్తి' ఈ తపశ్శక్తియే. ఈ ప్రత్యేక శక్తియే భారతీయుల "ప్రత్యేకతకు" ప్రధానకారణము. ఇదియ వీరి మూలధనము భారతీయులు తరతరాల వఱకుఁ బుష్కలముగ వాడుకొన్నను దఱుఁగని, తెలియని వారి యీ మూలధనమే "తపోధనము". ఇదియ వీరి కంగరక్ష. ఇదియ వీరి యిహపర సౌఖ్యమునకు మూలము. ఇదియ వీరి ప్రపంచప్రశస్తిలోని రహస్యము. ఈ రహస్యమును మన కాళిదాసకవీంద్రుఁడు సంపూర్ణముగఁ దెలిసినవాఁడు కనుకనే గౌరీదేవిచే మహాతపస్సు నాచరింపఁజేసి * తదాచరణానంతరమున నామెను బరమపావనమూర్తిగను, తపఃప్రభావ భాసిత దివ్యసౌందర్య సమలంకృత గను, వినిర్మల తేజో విరాజితగను బరిణమింపఁ జేసినాఁడు. కనుకనే యీ పావనగాత్రి కారణమున పర్వతరాజు సాన్వయముగఁ బవిత్రీకృతుఁడైనాఁడు (చూ. 5-35) ఇప్పటి యీయామె రూపము పదార్వన్నె బంగారమువలెఁ బవిమల ప్రభాప్రదీప్తమై, కమనీయ కాంతి గభీరమై సత్యసౌందర్యముచే స్వయం ప్రభాసమాన మగుచున్నది నాఁటి దీక్షాగురుఁడే - అప్పటి యా కందర్పదర్ప హారుఁడే - ఇప్పుడీమె చెంతకు మాయావటువై స్వయముగ వచ్చి ప్రసంగవశమునఁ దెలిసిన నామె యాంతరంగిక విశుద్ధికి వివశుఁడై యామె సచ్ఛీలమున కిట్లు సంతసించును.

"యదుచ్యతే పార్వతి! పాపవృత్తయే న రూపమిత్యవ్యభిచారి తద్వచః। తథాహి తే శీలముదారదర్శనే తపస్వినామప్యుపదేశతాం గతం॥" (5-36)

* "మహా తపస్సాక్ష్య ఇవస్థితాః క్షపాః" (కు. సం. 5 సర్గ)

"సుగుణసజ్జితమైన సురూపము పాపప్రవృత్తులకుఁ గారణము కానేరదు" అనుసూక్తి, ఓ గిరిరాజపుత్రీ! నీ విషయమున నెంతయు నిజమై యున్నది. సౌందర్య శేవధివైన నీయొక్క సద్వర్తనము ప్రస్తుతమున మహర్షులకుఁ గూడ మార్గదర్శకమై కీర్తింపఁబడుచున్నది."

మన మహాకవి పై శ్లోకార్థముచే 'యత్రాకృతిస్తత్ర గుణాః' అను సూక్త్యర్థమును సువ్యక్తముచేసినాఁడు. 'భార్యారూపవతీ శత్రుః' అను సామాన్యశాస్త్ర మిట కాళిదాస కవీంద్రునియొక్క పై విశేష శాస్త్రముచే బాధితమగుచున్నది. ఇప్పటి పార్వతీరూపము తపశ్చరణాత్పూర్వమువంటిది గాక, యిపుడు శాంతగుణ సజ్జితమై, నిర్మల తేజస్సంభరితమై సత్యశోభా సముల్లసితమై, యాధ్యాత్మిక తేజో విరాజమానమై యమ్మాయారూపవటుని మానసమునకు సంతోషకారణమైనది. కాఁగా సత్ప్రవర్తనము, సచ్ఛీలము, ముఖ్యముగఁ దపశ్చరణము అనునివి లౌకిక సౌందర్యమునకు, బంగరునకుఁ బరిమళమువలె నపూర్వ శక్తిని శోభను బ్రసాదించునని ప్రస్ఫుటమైనది.

పై విధముగఁ దపశ్చరణానంతరమునఁ బార్వతీరూపము పరమేశ్వరుని నేత్ర చకోరములకుఁ జంద్రికయై, తన్మానసమున రాజహంసమై రాణించినది. అమ్మాయారూపవటు వీక సఫలమనోరథుఁడయ్యెను. ఈతఁడి తపశ్చరణముగూడ నింపులకై యుద్దిష్టము కావచ్చునని మన మనుకొన్నదే కదా! అనుకొన్నదే యైనది. ఇక మాయారూప మెందులకు? చల్లకువచ్చి ముంతదాచుట యెందులకు? కనుక అమ్మాయారూపవటువే మహేశుఁడై యమ్మగువచెంత నిలిచి యిట్లనెను.

"అద్య ప్రభృత్యవనతాఙ్గి తవాస్మి దాసః క్రీత స్తపోభిరితి
వాదిని చంద్రమౌళౌ.........."

(చూ. కు. సం పంచమసర్గాంతము)

"ఓ సుందరాంగీ! నేఁడు మొదలుకొని నేను నీకు దాసుఁడనైతిని. కారణ మేమనఁగా, నీవు నీ తపోధనములు వెచ్చించి నన్ను నిక్క-

ముగ నీవానినిగఁ జేసికొంటివి" అని యా చంద్రశేఖరుఁడు తన ప్రణయచంద్రికా సమ్మిశ్రితమైన, శేఖరీకృత చంద్ర చంద్రికతో నా శర్వాణియొక్క బాహ్యాభ్యంతర పరితాపములను బాపి ఒక్క క్షణములో నామె యంతరంగము నానందభరితముఁ జేసెను.

ఇంతటితో గౌరీతపస్సు పరిపూర్ణముగ ఫలించినది. ఇట్లుమా మహేశ్వరు లొండొరుల తపస్సులకును ఒండొరులు ఫలరూపములుగఁ బరిణమించినారు.

శ్రీ కాళిదాసమహాకవి ధర్మమా యని యానాఁటి గౌరీతపస్సు ఈనాఁటికిని భారతీయ కన్యకారాజముపాలిటి కల్పతరువై, నూతన వధూవరుల భావిసౌభాగ్య జీవితమునకును, జీవిత సౌభాగ్యమునకును అంకురార్పణ మగుచున్నది. ఈ గౌరీతపస్సుతోపాటు మన కాళిదాస కవీశ్వరుని "సౌందర్య సమారాధనము" గూడ "సత్యం" పదభ్రాజమానమై, గౌరీకళ్యాణ మహోత్సవముతో, లోక "శివం" కరమై, సర్వాంగ "సుందరం" అను సూక్తికిఁ జక్కని నిదర్శనమై సమర్పించినది. కనుకనే యీ గౌరీశంకరులు "పరస్పర తపస్సంపత్ఫలాయితౌ పరస్పరు"లై "ప్రపంచ మాతాపితరు"లై ప్రపంచ మాంగళ్యమున కాదిదంపతు లైనారు. దీనితో భారతీయ ప్రణయము పవిత్రశక్తి భాసురమై జగన్మాంగళ్యమునకు మంగళతోరణ మైనది.

ఇఁక పై శ్లోకములో వ్యంగ్య మర్యాదచే విశేషార్థమొకటి విన్పించుచున్నది. ఈ యర్థము "సౌందర్య" వర్ణనములో కాళిదాస కవీశ్వరునికిఁ గల ప్రత్యేక దృష్టిని, పరమార్థ దృష్టిని బ్రత్యక్షముగఁ బ్రకాశింపఁజేయుచు నీ కవీంద్రుఁడు "సౌందర్యమును" సర్వాంగ సుందరముగా నారాధించి ధన్యుఁడైనరీతి నిట స్పష్టము సేయుచున్నది. ఇప్పుడీ కవీశ్వరుఁడు, తపఃప్రభావ భాసుర సౌందర్య భాసిత యగు శర్వాణి

రూపములో సౌందర్యాధిదేవత * యగు సాక్షాజ్జగజ్జననీ రూపమును (కాళీ రూపమును) సందర్శించి యిట్లు తన జన్మమును ధన్యమొనర్చు కొనుచున్నాఁడు, దర్శించుఁడు.

అవనతాంగి=సౌందర్య భారేణ అవనతాన్యంగాని యస్యాః, అతః హే సౌందర్య రూపిణి ♦; హే కాళి! అస్మి=అహం; † తవ= కాళీ రూపాయాః తవ; దాసః=అర్థా త్కాళి దాసోహం;" అని స్వనామధేయోచ్చారణ పూర్వకముగ ‡ పార్వతీరూపములో నున్న కాళిమాతకుఁ దన యారాధ్యదేవత కీ కాళిదాసు వ్యంగ్య మర్యాదచే నంజలి ఘటించి, తన నామధేయముతోఁ బాటు తన జీవితమునుగూడ కాళ్యనుగ్రహపాత్రముగఁ జేసి, (యీ సౌందర్యారాధనతో సహా) ధన్యముచేసికొనిన ట్లిచ్చట నాకు గోచరించినది. కాళిదాసు శాకుంతల

---

* గిరిజ సౌందర్యాధిదేవత యనుటకు శ్రీ ఆదిశంకరుల యీ సౌందర్యలహరీ స్తుతియే చక్కని నిదర్శనము.

"హరిస్త్వామారాధ్య ప్రణతజన సౌభాగ్య జననీం
పురానారీభూత్వా పురరిపు మపిక్షోభ మనయత్
స్మరోపిత్వాం నత్వా రతినయన లేహ్యేనవపుషా
మునీనామప్యంతః ప్రభవతిహి మోహాయ జగతాం||" (5-శ్లో)

"ఓ శర్వాణీ! పూర్వము శ్రీహరి నిన్నారాధించుటచేతనే జగన్మోహినీరూపము దాల్చి మహేశునిఁగూడ మోహపెట్ట గలిగినాఁడు. ఇట్లే మన్మథుఁడు, జననీ! సౌందర్య నిధివైన నిన్ను సేవించుటచేతనే రతీనేత్రపర్వమైన తన సమ్మోహన రూపముతో మును లనుగూడ మోహపెట్టుచు, జనతయొక్క చిత్తములను జిందరవందర చేయుచున్నాడు.

♦ "త్వదీయం సౌందర్యం తుహిన గిరికన్యే తులయితుం
కవీంద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః..." (చూ. సౌందర్యలహరి)

† అస్మీత్యహమర్థే "అవ్యయం" ఉదాహరణ:- "పాదప్రహార ఇతి సుందరి! నాస్మిదూయే" ఓ సుందరాంగీ! నీ చేసినపనికి నేను చింతింపను.

‡ "తతోభివాదయే ద్వృద్ధానసావహమితి బ్రువన్" (గృహ్యసూత్రవివృతి) దేవతలకుఁగూడ తమపే రుచ్చరించి నమస్కరించుట శిష్ట సంప్రదాయము.

భరతవాక్యములోఁ గోరిన పునర్జన్మ రాహిత్యకాంక్ష, పైనిగల నా భావమునంగీకరించు ననుకొందును. ఇది సహృదయ సంగ్రాహ్యము

ఇంతవఱకుఁగల నా యాశయసంతతి నాదరించుచు, వానిని వివరించి విస్పష్టము చేయుచున్నట్లున్న శ్రీ అరవింద యోగీంద్రుల యమృతాయమానమాన్యభావములఁగొన్నిటి నిటఁ బాఠకుల కందించు చుంటిని. పార్వతీదేవియొక్క మొదటి భౌతిక సౌందర్య సర్వస్వము శక్తిరహితమై, ఈశ్వర తిరస్కృతము కాఁగా నదే తపస్సౌశీల్యాదుల సంసర్గముచే శక్తియుతమై పరమేశ్వర పరిగృహీతమైన క్రమపరిణామ రీతి నీ క్రింది యోగీంద్రుల వాక్యములు వ్యక్తముచేయుచున్నవి.

పార్వతీ సౌందర్యము లోకాతీతము. దానిని కవి తన యసాధారణ శిల్పసామర్థ్యముతో నుత్తమ చిత్రకారునివలెఁ జిత్రించినాఁడు. పార్వతి యౌవనమయమున నొక యుత్తమ ప్రబంధనాయికయే యైనది. తా నట్టి సౌందర్యవతి నని గిరిరాజసుతకుఁ గూడఁ దెలియును. యౌవన మీ యహంకారమునకుఁ గరావలంబన మొసంగినది. ఈ స్థితిలో నామె శివుని వశీకృతునిఁ గావించుకొనుటకై శుశ్రూష మొనర్చినది. ఈమెకు మన్మథుఁడు, మన్మథున కీమెయు, నిరువురకు మాధవుఁడును సాయపడి విఫలు లైనారు. భౌతికశక్తి ఆత్మశక్తి నెప్పటికిని జయింపలే దను నాధ్యాత్మికరహస్య మిందు (కాళిదాసుచే) కావ్యమార్గమునఁ (కాంతా సమ్మిళితముగ) ప్రబోధింపఁ బడినది.

అహంకారము రజోగుణలక్షణము. ఈరజోగుణ మణంగినఁగాని సత్త్వోద్రేకమున కవకాశము లేదు. సత్త్వోద్రేకమునఁ గాని శివ వశీకరణము సాధ్యముకాదు. ఈవిధముగా నామెకు (ముందు) సాధనసంశుద్ధి లేదు. ముందుగా శారీర సౌందర్యాహంకార మణఁగవలయును. అప్పుడామెయందలి రజోగుణ మణఁగును. పిమ్మటఁ దప మొనరించినచో సత్త్వము ద్రేకించును. నైష్ఠిక సౌందర్యజ్యోతి వెలుఁగొందును. అప్పుడామె తనకుఁ బరిగ్రహణ యోగ్య యగునని యెంచి యౌవనాహంకార కారకుఁడైన మన్మథుని భస్మమొనర్చి శివుఁ డంతర్హితుఁ డయ్యెను.

మన్మథ నిర్మథనముతో పార్వతి యౌవనాహంకార మంత రించెను. శివుఁ డరూపహార్యుఁడనియు * అతనిని సాధించుటకుఁ దన సుందరశరీరసంపద నిరర్థకమనియు (నామె)సమర్థించుకొన్నది. దుర్లభుఁ డైన శివుని సమాగమమునకు మార్గాంతరముగానక తపోదీక్ష వహించి నది. ముందు సర్వసమత్వమును అలవరచుకొన్నది. వృక్ష లతాదు లందు, కురంగ శాబకములందు వాత్సల్యము నెఱపినది. శీతోష్ణాది ద్వంద్వములందు సమభావము సాధించినది. ఈ విధముగా పార్వతి (ప్రకృతిరూపిణి) ప్రకృతితో నభేదమునొందినది. ఇఁక పురుషునితో (శివునితో) నొందవలసియున్నది. (కనుక) నిత్యాభియుక్తురాలై ♦ యనన్యచిత్తముతో శివునిఁ బర్యుపాసించి యాకర్షించినది. అతని యగ్ని పరీక్షలో నెగ్గి హరునిఁ గైవసము గావించుకొన్నది. శారీరకముగాఁ గూడ నద్వైతసిద్ధి (అర్థనారీశ్వర రూపము) నంది లోకారాధ్య యైనది.

పార్వతీ సౌందర్యము ప్రణయమునందును, ప్రణయము పరి ణయమందును, పరిణయము కుమార ప్రభవమునందును సార్థకత నొందెను. శివుని వశీకృతునిఁ గావించుకొనుటతో నామె ప్రేమ తనివి సనలేదు. అతని మెప్పించి శరీరార్థము నాచికొన్నఁగాని (ఆమె) కృత కృత్యత భావింపలేదు. జగత్పితకు భార్యయై జగదుద్ధారకుఁ డగు కుమారస్వామిని బ్రసాదించి జగన్మాతృ గౌరవ మందుకొన్నది. ఇందలి క్రమపరిణామము, పాత్రోన్మీలనవిధానము, భారతీయ ప్రణయ రహస్య గోపనము భావించుకొలంది భావింపఁజేయును. ఆనందించు కొలఁది నానందిపఁ జేయును.

"పరస్పర తపస్సంప త్ఫలాయిత పరస్పరౌ ।
ప్రపంచ మాతాపితరౌ ప్రాంచౌ జాయాపతీ స్తుమః॥"

---

* భవుడు కేవల భౌతికసౌందర్యమునకు వశుఁడుకాడు !

♦ "తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం" గీత.

## శాకుంతల శకుంతల

శ్రీ కాళిదాస కవీంద్రుని శకుంతలా సౌందర్య సర్వస్వమును సందర్శించుటకు ముందు మనము గిరిజా సౌందర్యముతో శకుంతలా సౌందర్యమునకుఁగల సామ్యములను దెలియుట మంచిది.

పార్వతీదేవి జన్మచేతనే పవిత్రురా లైనది. హిమవంతుఁ డీమె జన్మచే, మందాకినీ నదిచే స్వర్గమువలెఁ బవిత్రుఁడై విభూషితుఁ డయ్యెను. (చూ. కు. సం. 1-28) ఇట్టి యీమె బాల్యక్రీడలుకూడ పవిత్ర "మందాకినీ సైకతవేదిక"లోఁ గడచినవి. (చూ. కు. సం. 1-29)

ఇట్లీమె బాల్యజీవితమంతయు హైమవత దివ్య భూములలోఁ గడచినది ఇంక నీమె యౌవనవయస్సు పవిత్రస్థాణ్వాశ్రమములోఁ దపమొనరించెడు పరమేశ్వరుని పరిచర్యతోఁ గడచినది. (చూ.కు.సం.1-60)

ఇఁక శకుంతలయు జన్మచే నప్సరస్సంభవ; * మహర్షి తనూజ; కనుక అప్సరస్త్రీ యొక్క దివ్యసౌందర్య వైభవము, మహాముని మహిత తేజము ననునవి యీమెలో మేళన మందినవి. ఈమె బాల్య జీవితమంతయు "కులపతి" కణ్వర్షి తపోవనములోఁ గడచినది. ఆ వాతావరణమంతయుఁ బ్రశాంతతతోఁ బరిపూర్ణము, పరిపూతము నైనది. నిజమున కా కణ్వాశ్రమము "శాంతినికేత" మనవలెను. ఆ తపోవనమంతయు నిత్యమును యజ్ఞయాగాదిక్రతువుల పవిత్రాజ్యాహుతి గంధములతోఁ బరిళించుచుండును. ♦ ఇట్టి ప్రశాంత పవిత్ర తపోవనములోఁ బెరుఁగుచున్న శకుంతలకు, ఆమె చెలిమికత్తియలతో పాటు అచ్చటి ముగ్ధ మృగములు, పరోపకారైక జీవనముగల పాదపములు, లతలు,

---

* "సురయువతి సంభవం కిలమునేరపత్యం తదుజ్ఝితాధిగతం..." (చూ. శాకుంతలం అంకం)

♦ ఈ మహాకవి కావ్యతపోవనము లాయా క్రతువుల యాహుతి గంధములతోఁ బరిమళించుచునే యుండును"...భిన్నో రాగః కిసలయ రుచా మాజ్యధూమోద్గమేన..." (చూ. శాకుంతలం అంకం) "...పునాసం పవనోద్ధూతైర్ధూమై రాహుతి గంధిభిః" (రఘువంశ కావ్యం)

పక్షులు మొదలగునవి ప్రేమపాత్రములైనవి. శకుంతల వృక్షములకు ముందు జలములిడి పిమ్మటనే తానుత్రాగును. లతలకు నొప్పికలుగునని వాని కిసలమైనను త్రుంపదు * గిరిజయుఁ దన తపశ్చరణావసరమున నచ్చటి వృక్షకములను ఘట స్తన ప్రస్రవణములతోఁ బెంచి వానియందుఁ బుత్రవాత్సల్యము నెఱపినది (చూ. కు. సం. 5-14) ఇట్లీరువురును దమలోదాగియున్న విశాల విశ్వప్రేమ మున్నంతను విశ్వజనీనమై విరాజిల్లునట్లు బాల్యముననే తమ ప్రేమామృతమును జరాచర ప్రకృతిలో నొలికించి, జగన్మాతను మఱొకను భరతమాతగను కాఁబోవు పవిత్రపరిణతి నిప్పుడే తమ ప్రవిమల ప్రవర్తనమునఁ బ్రకటించినారు. ♦

ఇఁక వీరిలో నాశ్రమవిరుద్ధమైన వికారమునకుఁ గారకులు, అటు భావజుఁడు, ఇటు భావజరూపుఁడు దుష్యంతుఁడు ఈ భావజుల రాకయే ముగ్ధులగు పార్వతీ శకుంతల శృంగార భావ సాగరములకు నిజముగ 'రాకయే (16 కళలతోనున్న చంద్రుఁడుకల పౌర్ణమి) యైనది. కాఁగా నిఁక వీరి యిప్పటి యౌవనోద్రిక్తతతోఁ గూడిన సరస భావవాహిని గల్లుత్రెంచుకొని పొంగి పొరలుచుండెను. అశాశ్వతమగు నిట్టి యౌవనోద్దామతనుండి యుదయించిన ప్రేమగూడ నశాశ్వతముగనే యుండును. ఇట్టి ప్రేమ భారతీయ సంస్కృతికి విరుద్ధమైనది. ఇంతియే కాక మన కాళిదాసకవి తన సౌందర్య వర్ణనమును సచ్చిదానందాత్మకమగు దివ్య ప్రణయమునందే పర్యవసింపఁ జేయుచుండు నను విషయమును పార్వతీ సౌందర్యోత్తరభాగములోఁ గన్గొని యుంటిమి. కనుక నిట నవయౌవనాహంకార దోషదూషితమైన వీరి ప్రేమను నిరాకరింపఁ దలఁచినట్లు మన కవీశ్వరుఁడు, అట పార్వతికి ముక్కంటి కంటిమంటలను, ఇట శకుంతలకు అగ్నివంటి దుర్వాసుని

* (చూ. శాకుంతలం 4 అంకం శ్లో. 8, 13, 14, అంకం) "అస్తిమమాపి సోదరస్నేహ ఏతేషు తరుషు"

♦ (చూ. కు. సం|| సర్గ 5. శ్లో 14, 15.)

దుర్భర శాపమును గల్పించినాఁడు. అహంకార నిష్కాసన సమర్థము లైన యీ సన్నివేశ (ద్వయ) ప్రయోగబలముచే వీరి యౌవనాహం కార కిల్బిష మంతరించినది. ఇఁక వీరికిఁ జిత్తనైర్మల్యసిద్ధి కలుగుటకై వీరిచే మనకవి తపస్సు చేయించినాఁడు. దీనితో వీరి శీలాదులు పుటార్చిన బంగారమువలె వినిర్మలములై విశిష్ట తేజోవిరాజమానము లైనవి. ఇట్టి వీరి నైర్మల్యము వీరి సౌందర్యమునకుఁ బవిత్ర శక్తి మత్త్వమును, దివ్యకాంతిమత్త్వమును బ్రసాదించినది. ఇఁక వీరు తప మొనరించిన ప్రదేశములుకూడ గౌరీశంకర శిఖర దివ్యభూములు, శాశ్వతానందనిలయమైన మారీచమహర్షి దివ్యాశ్రమ స్వర్గభూములు. ఇచ్చటి దివ్యవాతావరణముకూడ వీరి జీవితములను దివ్యభావ భాసి తములుగఁ జేయుటలోఁ బరమోపకారమైనది.

పై విధముగ మన కవీంద్రుఁడు తన కావ్యనాయికల సౌందర్య సమృద్ధిని క్రమముగఁ బరిణామ భాసురముగ దిద్దితీర్చి ఆ నాయికలు విశ్వప్రేమ విరాజిత విశుద్ధమానసలుగఁ బరిణతిగాంచిన పిమ్మటనే వారి నాయకులతోఁ జేర్చి 'మాతృత్వ' పదముతోను, 'జగన్మాతృత్వ' పదముతోను వారి జన్మలను ధన్యమొనర్చినాఁడు.

ప్రస్తుతమున, భౌతికమై యస్థిరమైన శకుంతలా సౌందర్యమును నిత్యమై, యాధ్యాత్మిక తేజస్సందీప్తముగఁ బరిణమింపఁజేసిన మన కాళిదాసకవీంద్రుని సౌందర్య పరిణామక్రమరీతి అతి నిపుణమై, సహజ సుందర సుకుమార సులలిత మనోహరము నై యున్నది. ఈ విషయ జాత మంతయు విస్పష్టమగుటకై జర్మన్ మహాకవియైన 'గెథే' మహా శయునియొక్క యొకచిన్న యాంగ్లగీతమును, శాకుంతల కథామంజరీ సౌరభవిశేషములను ఖండఖండాంతరములలో వెదఁజల్లిన దాని నిటఁ గైకొందును.

క్రొత్త పరువములో నున్న పుష్పములు క్రమ పరిణతితో ఫలములైనట్లు, శకుంతలయొక్క భౌతిక సౌందర్యము క్రమ వికాస

ముతో నొక్కటనే ఆధ్యాత్మిక సౌందర్యముగఁ బరిణతిఁ జెందిన క్రమము నీ పద్యము తెలుపును అనగా నవకుసుమములు వాని ఫలములు ఒక్కసారిగనే ఈ నాటకమునఁ జూడనగును.

(Sakuntala Its inner meaning)
"Would'st thou the young year's blossoms
and the fruits of its decline,
And all by which the soul is charmed,
Enraptured, feasted, fed.
Would'st thow the Earth and Heaven itself
In one sole name combine ?
I name thee, O Sakuntala ! and all at
Once is said, (Goethe)

తన యాంగ్లమాతృకకు శ్రీ "గొథే" మహాకవియే భావానువాదముగ స్వయముగ వ్రాసిన చక్కని సంస్కృతమే యీ క్రింది శ్లోకము.

"వాసంతం కుసుమం ఫలంచ యుగపత్ గ్రీష్మస్య సర్వంచయత్
యచ్చాన్య న్మనసో రసాయన మత స్సంతర్పణం మోహనం।
ఏకీభూత మభూతపూర్వ మథవా స్వర్లోక భూలోకయోః
ఐశ్వర్యం యది వాంఛసి ప్రియసఖే శాకుంతలం సేవ్యతాం॥"

పై "గొథే" పద్యమునకు "విశ్వకవి" శ్రీ రవీంద్రనాథ ఠాకూర్ మహాశయుని యాంగ్ల వివరణమే యీ క్రిందిది. * ఈ వివరణము పై యాంగ్లపద్యమునకు భాష్య మనఁగియున్నది.

* 'Goethe' the master poet of Europe, has summed up his criticism of Sakuntala in a single quatrain ; he has not taken the poem to pieces. This seems to be a small thing like the flame of a candle, but it lights up the whole drama in an Instant, and reveals its inner nature.

In Goethe's words, Sakuntala blends together the young years blossoms and the fruits of maturity ; it combines heaven and earth in one.

We are apt to pass over this eulogy lightly as a mere poetical out burst. We are apt to consider that it only means in

Contd

effect that Goethe regarded Sakuntala as fine poetry. But it is not really so. His stanza breathes not the exaggeration or rapture but the deliberate judgment of a true critic. There is a special point in his words. Goethe says expressly that Sakuntala contains the history of a development — the development of flower into fruit, of earth into heaven, of matter into spirit.

In truth there are two unions in Sakuntala and the molif of the play is the progress from the earlier union, of the first Act, with its earthly unstable beauty and romance, to the higher union in the heavenly hermitage of eternal bliss described in the last Act.

This drama was meant not for dealing with a paricular passion, not for developing a particular character, but for transmiting the whole subject from one world to another-to elevate love from the sphere of physical beauty to the eternal heaven of moral beauty.

"......In the first Act the poet has not concealed the gross earthliness of the fall of Sakuntala; he has clearly shown, in the conduct of the hero and heroine alike, howmuch desire contributed to that fall. He has fully painted all the blandishments, playfulness and fluttering of the intoxicating sense of youth, the struggle betwenn deep bashfulness and strong self expression.

This is a proof of the simplicity of Sakuntala. Dushyantas conquest of Sakuntala has been very naturally drawn. With equal ease has the poet shown the deeper purity of her character in spite of her fall-her unimpaired innate chastity. This is other proof of her simplicity.

The flower of the forest needs no servant to brush the dust off her petals. She stands bare, dust settles on her, but in spite of it, she easily retains her own beautiful cleanliness. Dust did settle on Sakuntala. But she was not even conscions of it like the simple wild deer; like the mountain spring, she stood forth qure in spite of mud.

ఇట్లే శకుంతలకు పతి నిరాకరణరూపమైన భౌతికపతనము క్రమపరిణతితో నాధ్యాత్మికోన్నతిగ పరిణామముఁ జెందినవిధమే పై రవీంద్రుని యాంగ్లవాక్యముల లోని విషయము.

"యూరప్" ఖండ మహాకవియైన "గొథే" * శాకుంతల నాటకమును గూర్చిన తన విమర్శను ఒక్క చిన్న పద్యములో అఖండముగ నిట్లు సంగ్రహించెను. పై పద్యము దీపకళికవలె మనకుం జిన్నదిగ కనుపించుచున్నను, (ఇది) శాకుంతల నాటకమునంతటను నొక్క క్షణములోఁ బ్రకాశింపఁజేసి, దాని యంతరార్థము నొక్క సారిగఁ బ్రస్ఫుటము సేయును.

"గథే" మహాశయుఁ డనినట్లు నవయౌవన వికాస విలసితము లగు పుష్పములు తమ పరిణామరూపములైన ఫలములతోఁ జెందిన సరస సమ్మేళనమే "శాకుంతల నాటకము" మఱియు నీ నాటకము స్వర్మ్యాభలోకముల నొక్కచోట నతి సహజముగఁ గలుపఁగల్గిన పరంధామము.

ఈ నాటకము దివ్య కవితా సౌందర్య సందేశ సంభరితమని యెంచి "గొథే" ఆనంద పారవశ్యముతోఁ జేసిన కేవల తత్కవితావేశమె అనుకొని మనము పై ప్రశంసా పద్యమును జులకనగ భావింప వచ్చును. కాని మన భావన వాస్తవికము కాదు. ఎందుకనిన, పై యాంగ్ల పద్యము "గొథే" మహాకవి కేవల ఆనంద పారవశ్యముతోఁ జెప్పినదికాదు. ఇఁక ఆ పద్యము కాళిదాస కవీంద్రుని కవితా తత్త్వ నిర్ణాయకమైన ఒకసాహిత్యవిమర్శకాగ్రేసరునియొక్క నిష్పాక్షికమైన, నిస్సంకోచమైన, న్యాయసమ్మతమగు తీర్పు.

కనుకనే "గథే" యొక్క పై సుభాషితములలోఁ బ్రత్యేకమగు నంశము (పరమార్థము లేక సత్యము) అంతర్లీనమై యున్నది. అదే మనఁగా పుష్పము ఫలముగను, భూతలము స్వర్గముగను, భౌతికము

* "గొథే" ఇతఁడు జర్మన్ మహాకవి. నాటకకర్త, శాస్త్రవేత్త, సారస్వత విమర్శకుడు, సర్వతోముఖ ప్రతిభకలవాఁడు, ప్రభుత్వోద్యోగి. ఇతఁడు వెలుతురు, వృక్ష, జంతుజీవనములనుగూర్చి పరిశోధన గావించెను. భావకవి. ఇతడి కాలము క్రీ. శ. 1749 నుంచి 1892. ఈయన రచనలనేకములు ఐరోపియన్ భాషలలోనికి బరివర్తనములైనవి.

ఆధ్యాత్మికముగను పరిణామము చెందుట - వీని క్రమ పరిణామ చరిత్రయే 'శాకుంతల నాటక'మని 'గొథే' తన పద్యములో నొక్కి వక్కాణించినాడు.

వాస్తవమున కీ నాటకములోఁ జక్కని రెండు కలయికలు కలవు. మొదటి యంకములోని నాయికానాయకుల కలయిక భౌతికమై, అస్థిరమైన సౌందర్యముతోను, శృంగారముతోను గూడి యున్నది. ఇఁకఁ జివరియంకములోని కలయిక శాశ్వతానందదాయకమగు మారీచ మహర్షి దివ్యాశ్రమములో జరుగుటచే ఆధ్యాత్మికానంద దాయకమై యున్నది ఇట్లీ నాయికానాయకుల మొదటి సమావేశనము చివరి నైతిక సమ్మేళనముగా నెట్లు పరిణతమైనదో అట్టి పరిణామక్రమమును జూపుటయే యీ నాటక లక్ష్యము.

ఒక ప్రత్యేక భావప్రబోధమునకుఁ గాని లేక, ఒక ప్రత్యేక పాత్రచిత్రణమునకుఁ గాని యీ శాకుంతల నాటక (రచన) ముద్దేశింపఁ బడలేదు. ఇఁక ఈ నాటక కథావిషయ మంతటిని ఒక ప్రపంచము నుండి మఱియొక ప్రపంచములోనికిఁ బరివర్తనము సేయుటకును, భౌతిక సౌందర్య పరిమితమగు ప్రేమనుండి నైష్ఠిక సౌందర్య సంయుతమై, శాశ్వతానందదాయకమైన దివ్యప్రణయస్వర్గమునకు భారతీయ దంపతుల నుద్ధరింపఁ జేయుటకును ఈ నాటక ముద్దేశింపఁబడినది..."

శాకుంతలమునుగూర్చి వ్రాసిన శ్రీ రవీంద్ర కవీంద్రునియొక్క పై యాశయములలోని పరమార్థమును శాకుంతలోదాహరణములతో నిఁక నిరూపించి చూపెదను. పార్వతీ సౌందర్యమునువలె శకుంతలా సౌందర్యమునుగూడ "పూర్వోత్తర" రూపముగ విభాగించి చూచిననే యిచ్చటి విశిష్టత విశదమగును. కనుక ముందుగ శకుంతలా భౌతిక సౌందర్య వైభవము నవలోకించుదము.

ఈ నాటకములోని నాందీ ప్రారంభవాక్యమే శకుంతలా సౌందర్య సర్వస్వమునకు నాంది యగుచున్నది.

"యాసృష్టిస్స్రష్టురాద్యా..." యా=ఏ శకుంతల; స్రష్టుః=
=(కాళిదాసకవి) బ్రహ్మయొక్క; ఆద్యాసృష్టిః=మొదటిసృష్టియో;
అనఁగా "కాళిదాసకవిబ్రహ్మయొక్క సుందరవస్తు సృష్టిలో శకుంత
లయే యుత్తమోత్తమమగు మొట్టమొదటి సుందరవస్తుసృష్టి" యని
యిట ధ్వనించుచున్నది. ఈ ధ్వన్యర్థమే యిట వివరింపఁబడుచున్నది.

దుష్యంతుఁడు కణ్వాశ్రమముం జేరి పాదపాంతర్హితుఁడై
యచ్చటిపడుచుల విస్రంభాలాపములు వీనులవిందుగ వినుచుండఁగా
నాయిక,

"అనసూయే! అదయపినద్ధేన అనేన స్తనవల్కలేన
ప్రియంవదయా బలవన్నియంత్రితాస్మి శిథిలయతావదేనం."

అని ప్రతి క్షణమునను సంవర్ధమానమగుచున్న తన యౌవనసంరం
భంబును అప్రయత్నంబుగనే యచ్చటి విశాంపతికి నామె వినిపింపఁ
జేయును.

ఇందుల కామెప్రియసఖి ప్రియంవద:- సఖి శకుంతలే !
అత్ర తావత్పయోధరవిస్తారయితృక మాత్మనో యౌవన ముపాల
భస్వ కిం మా ముపాలభసే ?"

ఇట్లు ముగ్ధమోహనములైన యాముదితల మోహనాలాప
ములను వీనులవిందుగ విన్న విశాంపతి యా నాయికా యౌవనవిలాస
వైభవములను జూచి చూచి తనలో "ఈ శకుంతల ధరించిన వల్క
లము (నారచీర) ఈమె శరీరమునకుఁ దగనిదే. ఇట్టి యీ వల్కలము
కూడ నీ సహజ సౌందర్య శోభితకు అలంకారశోభనే యాపాదించు
చున్నది. ఎట్లనఁగా—

"పద్మమునకుఁ జుట్టువాఁటియున్న నాచు, ఆ పద్మమునకు ఒక
క్రొత్తయందము నాపాదించినట్లును, చంద్రునిలోని మలినకళంకము
కూడ ఆ చంద్రునికి కాంతి లక్ష్మినే ప్రసాదించియున్నట్లును, ఈ

శకుంతలకు అననురూపమైన యీ వల్కలముకూడ అధిక సౌందర్యమునే గల్గించుచున్నది. స్వతః మధురమైన యాకృతిగలవారు ఎంతటి తక్కువ వస్త్రమును ధరించినను, ఆ వస్త్రము వారికి సమధిక సౌందర్యమునే సమకూర్చుచుండును." స్త్రీలు తాము అలంకారములు ధరించనప్పుడు కూడ ఎవరి యాకృతి రమణీయముగా నుండునో అట్టి "యాకృతి" "మధురాకృతి" అనఁబడును. నిరలంకారలై వృక్షసేచనముఁ గావింపుచున్న మునికన్యకలను జూచి రాజు తనలో "అహో! మధురమాసాందర్శన" మ్మనుచు, వారి యపురూపపు టందమున కచ్చెరువందును.

ఇట్టి రూప "మాధుర్యము"నే యీ కవి, తన మాళవికాగ్నిమిత్ర నాటకములో మాళవికనుగూర్చి రాజుచే "అహో! సర్వావస్థాసు చారుతా శోభాంతరం పుష్యతి"అనిపించును. ఇట "సర్వావస్థాసు..." అనఁగా అలంకారములు లేనప్పుడును అని భావము. ఇట్లు "మాధుర్య" లక్షణములతోఁగూడిన శకుంతలా సౌందర్యము, స్వర్గాలంకారమైన యూర్వశీ సౌందర్యమునుగూడ "త్రోసి రాజు" అనుచున్న దిట అవధరింపుఁడు.

"ఆభరణస్యాఽభరణ ప్రసాధనవిధేః ప్రసాధనవిశేషః।
ఉపమానస్యాపి సఖే ప్రత్యుపమానం వపుస్తస్యాః॥"

(విక్రమోర్వశీయనాటకము 2-3)

అగ్నిమిత్రుఁడు విదూషకునకు ఊర్వశీ సౌందర్యము నిట్లు తెలుపుచున్నాఁడు.

"మిత్రమా! ఊర్వశియొక్క యుజ్జ్వలరూపము ఆభరణవస్తువులన్నిటికిని ఉత్తమాభరణము. ఇట్లే యామె రూపము అలంకరణ విశేషములకెల్ల నూతనాలంకరణము. వేయేల? వయస్యా! ఈ యూర్వశియొక్క యనుత్తమరూపము ఉపమానవస్తువులకే (చంద్రారవిందాదులకే) ఏకైకమైన యుత్తమోపమానము" ఇట్లూర్వశీ

రూపము ఆభరణములకే యాభరణము కాఁగల్గుచుండఁగా శకుంతలా రూపము ఆభరణములుకాని (తక్కువైన) వస్తువులనుగూడ సంతరింపఁ జేయుచు, అట్లందగించుచున్న యా (తక్కువ) వస్తువులచేఁ దిరిగి యా శకుంతలారూప మందగింపఁజేయబడుచుండుట, యిట గమనింపఁ దగిన విశేషము. * ఈమె కాళిదాసకవిబ్రహ్మయొక్క సుందర వస్తు సృష్టిలో నాద్యమైన సుందరవస్తువుగదా ! ఇట్టి రూపసౌకుమార్యము నీ సౌందర్య తత్త్వవేత్త "కుసుమ మివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధం" అని పుష్పసౌకుమార్యముతోఁ బోల్చినాఁడు. పై భావము లోని పరమార్థమును జూడఁగొన్న "గోథే" మహాకవి, శకుంతలను గూర్చి మొదట "Young years blossoms...." అనుట ప్రత్య క్షర సత్యము.

ఇఁక నీ శకుంతలా రూపతత్త్వము తనకు గోచరించినరీతిని దుష్యంతుఁడు విదూషకునితో నిట్లు ముచ్చటించుచున్నాఁడు.

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా రూపోచ్చయేన విధినా మనసా కృతాను । స్త్రీ రత్నసృష్టి రపరాప్రతిభాతి సామే ధా తుర్విభుత్వ మనుచింత్య వపుశ్చతస్యాః॥" (శాకుంతలే అంకః 2 శ్లో.9) "బ్రహ్మయొక్క స్త్రీలోకసౌందర్యసృష్టిసామర్థ్యమును ఈ శకుంతలా సౌందర్యసృష్టిసామర్థ్యమును దులనాత్మకరీతిగఁ జూచుచున్న నాకు (దుష్యంతునకు) మిత్రమా ! నా చూచిన శకుంతల ఇంకొక నూతన బ్రహ్మయొక్క లోకోత్తర స్త్రీరత్న సృష్టివలె భాసించుచున్నది. ఎందుకనఁగా ఆమెను సృజించిన బ్రహ్మ ఆమెరూపమును ముందుగాఁ జిత్తరువులో దిద్దితీర్చి, యా చిత్రగత చిత్రణము తనకు నచ్చినపిమ్మ టనే యా రూపవతికిఁ బ్రాణసంయోగము చేసియుండవలెను. లేని చంద్రుఁడు, పద్మము మున్నగు నుపమానవస్తువులందలి కేసల కాంతి

* సౌందర్యము వస్త్వాశ్రితమైనదేకాని, ఆత్మాశ్రితము, అలంకారాశ్రితము కాదని "మొదట నా పేర్కొన్నవిషయ మిట విస్పష్టమైనది."

ద్రవ్యమును (ఆ నూతనబ్రహ్మ) ఒక్కటఁ జేర్చి, ఆ సుకుమార ద్రవ్యమును జేత ముట్టక, ఒక్క యా కాంతి ద్రవ్యసాధనముచేతనే (ఇది ఉపాదానకారణము) తన మనస్సుచే (ఇది నిమిత్తకారణము) నామెను సృజించి యుండవలెను.

పై శకుంతలా సృష్టిరీతి పురాణబ్రహ్మయొక్క సృష్టిరీతికంటె విలక్షణమైయున్నది. కనుక ఈ సృష్టి, పురాణ (ప్రాత) సృష్టికాక, మఱియొక నూతనబ్రహ్మయొక్క సృష్టియై యుండవలెను. "అని విదూషకా! నాకుఁ దోఁచుచున్నది." ఇట్లు బ్రహ్మకు లభ్యముకాని యద్భుత సుందరవస్తు సృష్టి స్వాతంత్ర్యము మనకవిబ్రహ్మకు లభ్యమైన కారణముచేతనే అభిజ్ఞులు "అపారమైన కావ్య ప్రపంచమునకు కవియే ఏకైకబ్రహ్మ యగుచున్నాఁడ"నియు నీ కవిబ్రహ్మ తన కావ్య ప్రపంచమును దనకుఁ దోఁచినరీతిగ మార్చివేయఁగలఁడనియు* నిశ్చయించినారు. పురాణబ్రహ్మ యథాపూర్వముగ శకుంతలను పాంచభౌతికరూపముతో సుఖదుఃఖ సమ్మిశ్రితముగ సృజించెను. కనుక బ్రహ్మసృష్టి యగు శకుంతలకు "కారణగుణ న్యాయము"చే ♦ పాంచభౌతికధర్మములైన దుఃఖములు తప్పవు. కాని కాళిదాసకవిబ్రహ్మచే సృష్టమైన శకుంతలకు అట్టి పాంచభౌతికము (దుఃఖము) లేదు. కనుకనే కాళిదాస శకుంతలారూపము అనశ్వరమై, కేవల కాంతిద్రవ్యమయ శరీరముతో శాకుంతల కవితాంబరమున ధ్రువతారయై వెలుంగుచునే యున్నది. మఱియు నూర్వశీ రంభాదుల దివ్యరూపము పురాణబ్రహ్మయొక్క సుందరవస్తుసృష్టికిఁ బరమావధియై యుండఁగా నిప్పటి శకుంతలా రూపసృష్టి పై రంభాదుల రూపసృష్టిని ద్రోసిరా జనుచున్నది గాన, "రంభాదులను సృజించిన బ్రహ్మకంటె నీ శకుంతలను సృజించిన

---

* "అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః। యథాఽస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే॥

♦ "కారణగుణాః కార్యే సంక్రామంతి" (తర్కపరిభాష)

బ్రహ్మ మఱియొక నూతన (కాళిదాసకవి) బ్రహ్మ కావలసియుండ వలెను." అను దుష్యంతుని యూహా యుక్తియుక్తము, శాస్త్రసమ్మతముకూడ నై యున్నది. పార్వతీ రూపసృష్టికంటె నీ కవి శకుంతలా రూపసృష్టిలో సంపూర్ణముగ సిద్ధహస్తుం డైనాం డనుటకు ఇట ఇతని 'మానస' సృష్టియే నిదర్శనము. కనుకనే ఈ కవిబ్రహ్మ "అపరాస్త్రీ రత్నసృష్టి..." అని బ్రహ్మనే యతిక్రమించంగల్గెను.

ఈ కవిబ్రహ్మయొక్క యీ వినూత్నసృష్టిని విలోకించియే కాబోలు శ్రీ బాణభట్టకవి తన "కాదంబరి"లో బ్రహ్మయొక్క మతంగకన్యా రూపసృష్టిని భంగ్యంతరముగా నిట్లు భావించినాండు.

"మన్యేచమాతంగజాతి స్పర్శదోషభయాత్ అస్పృశతా ఇయ ముత్పాదితాప్రజాపతినా అన్యథా కథ మియ మక్లిష్టతా లావణ్యస్యః నహికరతలస్పర్శక్లేశితానా మీదృశీ భవతి కాంతిః॥" (కాదంబరి)

అంత్యజాతియగు మాతంగజాతి కన్యను జేతముట్టినచో పాపము కల్గును" అను సంశయముతో బ్రహ్మ, ఆ మాతంగకన్యను జేత ముట్టకయే నిర్మించియుండును (చేతితోం జేయనిది) మనోభావనచేతనే చేయంబడవలయునుగదా ! అని తలంచెదను (బాణకవి). చేతితోంజేసిన వస్తువుల కింతటి సౌకుమార్యమును, నైగనిగ్యమును (నిగనిగ) కాంతి మత్వము అను నివి యెట్లు చేకూరంగలవు ? కనుక నీ మతంగకన్య బ్రహ్మయొక్క మానస సృష్టియై యుండవలెను." ఇట్లు బాణభట్టు "మనసా" అను కాళిదాసు ప్రయోగమును జెప్పకయే దాని భావమును భంగ్యంతరముగాం బ్రకాశింపంజేసి "కవి భావనా ప్రభావము" నిట మెఱయించినాండు. బాణభట్టుయొక్క పై "అక్లిష్టత" కూడ కాళిదాసుయొక్క "అక్లిష్ట బాలతరుపల్లవలోభనీయం" అను దాని నుండి గృహీతము కానోపును. ప్రస్తుతమున శకుంతలా రూపము నింతగా వర్ణించియుం దనివినొందక రాజు తద్రూపవిషయకమైన రహస్యము నిట్లు విదూషకునితో ముచ్చటించుచున్నాండు.

"ఇదంచమేమనసివర్తతే." (ఇదికూడ నా మనసులోనిమాట)

"అనాఘ్రాతంపుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధంరత్నం మధునవ మనాస్వాదితరసం
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః॥"
(అంకం 2-10)

"శకుంతలారూపః మింతవఱకు నేయొక్కనిచేతను నాఘ్రాణింపఁబడని పుష్పము. ఇట్లే తద్రూపము ఏయొక్కనిచేతి గోరును దాఁకని చిగురుటాకు 2. తద్రూపము ఇంతవఱకు రంధ్రము చేయఁబడని రత్నము. 3. (వావిరిపుట్టురత్నము) ఇట్లే యది చవిచూడఁబడని తేనియ. 4. అఖండపుణ్యముల ఫలము. 5. ఇట్టి నిరుపమ, నిర్దుష్ట రూపమును అనుభవించుటకు బ్రహ్మ ఏ పుణ్యాత్ముని సృజించి యుంచెనో ? మిత్రమా ! నాకుఁ (రాజునకు) దెలియదు."

ఇదంతయు దుష్యంతుని మనసులోని మాటయేకదా ! నాయిక యొక్క రూపపుష్పము నూతనముగ వికసించి విలసిల్లుచున్నది గాన, ఈ నవకుసుమము నాఘ్రాణించు నభిలాష నాయకుని మనసులో గూఢముగ నున్నట్లిట సూచితమగుచున్నది. ఇట్లే యీమెరూపము, నఖక్షతములులేని నవకిసలయము కనుక, నిట్టి కిసాలముపై నఖక్షతములు సేయు కోరిక లీతనిలో నీరికలెత్తుచున్న వనవలెను. ఈరీతినే ఈ నవ్యరమణీయ రత్నమును ముందుగాఁ దానే స్వీకరింపవలయు నను నాస ఈ యవనీపతికి ఆ జన్మసిద్ధమైనదే యనవలెను. "రత్నహారీతు పార్థివః" అని అభిజ్ఞు లనుచుందురుగదా ! ఇదేవిధముగ క్రొంగ్రొత్త తేనియను ముందుగఁ జవిచూడవలెనను నాస లీ భూపతిలో దాగుడుమూత లాడుచున్నవనియు, నింతటి పుణ్యాలపంట ఏ పుణ్యాత్మునకుఁ దక్కునో ? యని యీతని వేదన మధికమగుచున్నదనియు నీ శ్లోకమున సూచితములగుచున్నవి. ఇట్టీ శ్లోకమును భావించిన కొలఁది శృంగార

భావములు మొలకలెత్తుటే కాక యిద్దానినుండి యు
కూడ నుదయించుచున్నవి. నవవికసితమైన యీామె
తన వినూత్న సరస సౌరభములతో నాగంతుకులకు నిట ఆమెతల
సంగవలసియున్నది. ఐనను నీ పుష్పము ఇంతదనుక ఏ యొక్కనిచేతను
నాఘ్రాణితము కాలేదు. వికసితపుష్ప మిట్లొరులచేఁ దెలియఁబడ
కుండుటకు ఇట ఏదోయొక బలవత్తర కారణ ముండియుండవలెను. అట్టి
కారణ మరయఁగా నాకవగతమైన కారణ మిది. మధుకరాంగనలకు
పూచిన సంపెంగపొలుపు అంటరానిదై భోగబాహ్య మగుచుండును.
ఇట్లే ఇట శకుంతలా రూప పుష్పములోని పొలుపుకూడ, అన్యపురుష
దృష్టి మధుకరాంగనలకు అంటరానిదై భోగబాహ్య మగుటలో
వింత యుండదు. పై నా భావమునకు మా కాళిదాసమహాకవి చూపిన
యుపపత్తిఁ జూడుడు.

"శమప్రధానేషు తపోధనేషు గూఢంహిదాహాత్మకమస్తి తేజః।
స్పర్శానుకూలా ఇవ సూర్యకాంతా స్తదన్య తేజోఽభి
భవాద్వమంతి॥" (శాకుం 2-7)

'అన్య తేజమునుండి పరాభవము కల్గినపుడే సూర్యకాంతపుమణులు
మండినట్లు శాంతిప్రధానులైన తాపసజనులు పరాభవప్రాప్తి సమయ
ముననే తమ శాపరూపమైన దాహకశక్తిని గనఁబఱచుదురు. (శకుంతల
నెట్లైనఁ జేఁజిక్కించుకొను మన్న విదూషకునితో రాజు చెప్పిన సమా
ధాన సందర్భములోని దిది). కనుక భారతీయ సతీమతల్లుల రూపపుష్ప
ములు వారి పతులకు దక్క, పరులదృష్టి భృంగాంగనలకు అంట
రానివే యగుచున్నవని యిట స్పష్టమైనది. ఇట ఇంకొక విశేష
మేమనగా పుష్పము చేతఁ దాకనంతవఱకె దాని వినూత్న వికాస
ములు నిత్యనూతనములై, వస్తునిష్ఠములై విరాజిల్లును. ఈ విశిష్ట
విషయమునే "కీట్సు" అను నాంగ్లేయకవి యిట్లు తెలిపినాడు. (ఒక
చిత్రములోఁ బ్రియురాలి చెంతనిలిచియున్న ప్రియుఁ డామెను దాఁకక నే

యీామెవైపు వలపులం జూపుచు నట్లే నిలిచి యుండుట యిట సందర్భము).

"Bold lover, never, never canst thou kiss
Thovlgh winming near the goal yet, do not grvieve.
She cannot fade, though thou hast not thy bliss. For ever wilt thou love, and she be fair."

"ప్రియుడు ప్రేయసికి అత్యంత సన్నిహితుఁడై ప్రేమోద్రేకమును జూపగల్గినను, అతఁడు ప్రియురాలిని ముద్దిడలేడు. అంతమాత్రమున నతఁడు ఖిన్నుఁడుకారాదు. మర్త్యస్పర్శ లేనంతవఱకు సౌందర్యము క్షీణించదు. శృంగారానుభూతితో సౌందర్యము వస్తునిష్ఠత్వమును విడిచి, పరిచ్ఛిన్నము, భౌతికము కాగలదు. కావున (సౌందర్యవతిని ముట్టక) ఆ స్థితిలోనే అతఁ డున్నచో శాశ్వతముగా నామెను ప్రేమించగలఁడు. శాశ్వతముగా నామె సుందరముగా నుండగలదు."
(చూ. శ్రీ. పో. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సౌందర్యమీమాంస)

ఈ "కీట్సు"నకుఁ బదునెన్మిదివందల వత్సరములకుఁ బూర్వకాలములో నున్న మన కాళిదాస కవీంద్రుఁడు పై యాంగ్లకవి భావమును దన శాకుంతలములో—

"....ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః కథమప్యున్నమితం
న చుంబితంతు" (చూ. అంకము 8 శ్లో 26)

సహజ సౌందర్య సజ్జితయగు శకుంతలా ముఖమును కాళిదాసు నాయకునిచేఁ బైకెత్తించియు, నద్దానిని రాజుచేఁ జుంబనము చేయించక తత్సౌందర్యమును వస్తు నిష్ఠముగను, శాశ్వతముగను సంరక్షించి, కీట్సునకీ సౌందర్య తత్త్వవేత్త మార్గదర్శకుఁ డయ్యెను. మఱియు మన కవి యీా నూత్నసౌందర్య దృశ్యమును దన దృశ్యకావ్యచిత్రమునఁ జిత్రించి, తత్సౌందర్య కుసుమము, యుగాంతముల వఱకును వాడకుండునట్లును, ఇప్పుడు పాంచభౌతిక శకుంతల లేకున్నను నామె తన శాకుంతలములోఁ జిత్రింపఁబడి సజీవయై, నిత్యనూతనమగు దివ్య

సౌందర్యముతో దీపించుచున్నట్లును, అట్టి సౌందర్యవతిని దుష్యం తుఁడు శాశ్వతముగఁ బరమాదరముతోఁ బ్రేమించుచు నామెను జుంబించక, తత్సౌందర్యమును వస్తునిష్ఠముగనే కాపాడినట్లును, నిత్య ముగఁ జిత్రించి చూపినాఁడు. ఇట్లు చిత్రగత, లేక కావ్యగత శకుంత లాది పాత్రలు సజీవవ్యక్తుల లేక రూపములకంటె నిత్యములై నిత్యా నంద దాయకము లగుచున్నట్లు కీట్సు ఇట్లు తెలిపినాఁడు :

"Heard melodies are sweet, unheard are sweeter"

గాయకుల గానములు వినినంతవఱకె (పాడినంతవఱకె) మధు రములగుచుండగా, చిత్రచిత్రితములైన గాయకుల గానదృశ్యములు చిత్ర మున్నంతవఱకును వీనులవిందుగ వినుపించుచునే యున్నట్లు మధురతరము లగుచుండును.

"కీట్సు" యొక్క పై భావమునకుఁగూడ మూలము భారతీయ కవుల భావమే అనుట కీ క్రింది శ్లోకమే నిదర్శనము

"ఆదిరాజ యశోబింబమాదర్శం ప్రాప్యవాఙ్మయం ।
తేషా మసన్నిధానేపి నస్వయం పశ్య నశ్యతి॥"

శ్రీరామచంద్రుఁడు మొదలగు మహారాజుల "కీర్తి" బింబము (సంస్కృత) వాఙ్మయము అను నద్దములోఁ బ్రతిఫలించి నేఁడా రాజులు ఎదుట లేకున్నను, దత్కీర్తి బింబము మాత్రము తద్వాఙ్మ యాదర్శములో నిత్యసన్నిహితమై ప్రకాశించుచునే యున్నది. మహా కవులచేఁ దమ కావ్యాదర్శములో వర్ణితమైన (ప్రతిఫలింపఁజేయఁ బడిన) ఉత్తమనాయకుల యుదారచరిత మను బింబము, భౌతికవస్తు బింబమువలెఁ దాత్కాలికముగాఁ గాక నిత్యమై యందుఁ బ్రకాశించు చునే యుండును. అని భావము.

ఇఁక "అనాఘ్రాతం పుష్పం..." అను శ్లోకములోని పుష్ప, కిసలయ, రత్న, మధు, పుణ్యఫలములు క్రమముగ, సురభిళ, సుకు మార, సుదీప్త, సుమధుర, సుకీర్తమైనవై శకుంతలారూపముకంటె

సభిన్నములై యున్నవి. ఇట్టి విశిష్ట వస్తుపంచక సాన్నిధ్యముచే నాయకునిలో నాశాఽనురాగముల నినుమడింపఁజేసి యీ కవి యామె లాభమునకై నాయకునిఁ బూర్తిగఁ బ్రేరేచినాఁడు. కాని శకుంతల "అఖండ పుణ్యఫలము" కలవానికే లభ్యము కాఁగలదుకదా! దీనితో రేని చిత్తమింకను ఆమెకై యుత్తలపడినది. అతని యాస లింకను అంబర మంటినవి. దీనితో రాజు చిత్తములో రాజసము రగుల్కొన్నది. "రాజు రత్నహారికదా!" కనుక నిఁక నెట్లైనను ఈ స్త్రీరత్నమును సంపాదించుటే యాతని ముఖ్యకర్తవ్యమై యున్నది. వెంటనే రాజు విదూషకునిఁ గారణాంతర కల్పనముచేఁ బంపించివేసినాఁడు. ఇట్టి రాజసమే శకుంతలనుగూడ ఆవరించి, ఆమెను పతిధ్యానైక పరాయణగను, విషయలంపటగను దయూషచేసినది. ఆమె యిప్పటి యౌవనోద్దామత, ఆమె శాంతచిత్తమును గల్లోలితమొనర్చి విషయవాగురలో నామెను జిక్కింపఁజేసినది అహా! యౌవనజృంభణశక్తి యెంతటి వారినైనను జీకాకు పఱచునుగదా!

"అంచితమందాక్షంబులు । సంచితదరహాసకాంతి
సౌభాగ్యంబుల్ ।
వంచితసుజ్ఞానధనా । భ్యంచితములు విషమదములు
యౌవనభరముల్"

ఇట్లు మన సౌందర్య తత్త్వవేత్త, శకుంతలయొక్క భౌతిక సౌందర్య సర్వస్వము నొక్కుమ్మడిగ నొలికించి, ఇట్టి యస్థిర సౌందర్యతారళ్యముచేఁ గల్గిన యామె భావచాంచల్యాఽహంకారాఽశాంత్యాదులను భావి దూర్వాసశాపమునకు మూలకములుగఁ జిత్రించి, యుద్దీపన విభావ భావితులైన యీ నూత్ననాయికా నాయకులను ఒక్కసారి కలిపి చూపినాఁడు. ఈయుపరిణామదశలోనున్న వీరి యీ కలయిక కేవల కామోత్వ ప్రధానమైనది. "యోహ్యేక సక్తస్స జనో జఘన్యః" అను సూక్తి ననుసరించి కేవల "కామ" పురుషార్థసేవనము మన

సీత శ్రీరామచంద్రుని గృహలక్ష్మి. ఒక్క గృహలక్ష్మియే కాదు. ఆమె నేత్రముల కమృతదీపలక్ష్మి; ఆనందలక్ష్మి; రాముని కులాభ్యుదయలక్ష్మి; భారతీయ వనితా పాతివ్రత్యకీర్తిలక్ష్మి; ఇట్టి తన యర్ధాంగలక్ష్మి సంబంధములగు భేదములన్నియుఁ దనకు (రామునకు) ఆనందజనకములేగాని ఒక్క యామె విరహము మాత్ర మిప్పుడు దుర్భరమగుచున్నది. ఇట్లే దుష్యంతునకు శకుంతలా విరహము కూడ దుర్భరమై యామెయందు రాజునకుఁ బూజ్యభావ మతిశయింపఁ జేయుచున్నది. ఇప్పట్టున నామె తిరిగి తనకు దర్శన మిచ్చినచో నీతని శుష్కజీవితవృక్ష మొక్కుమ్మడిగఁ జిగుళ్ళుదొడిగి కుసుమితమై స్తబకితమై ఫలించును.

కేవల భౌతిక భోగతృప్తిలోనే యొక్కడును భార్యను నిత్యముగ ప్రేమించలేడు. ఇంక నామెయందలి ఆధ్యాత్మికప్రేమముచేఁ బతి ఆమెను నిత్యముగఁ బ్రేమింపఁగల్గుచున్నాఁడు. ఇది నిజమే. ఇదివఱ కీమెయం దతనికిఁగల భౌతిక చాంచల్యప్రేమ యిప్పుడు స్థిరమై యాధ్యాత్మిక ప్రేమగను నిదియే విశ్వప్రేమగను బరిణమించినదిగదా! భారతీయుల యాదర్శదాంపత్యమునకు శారదామణిని ప్రణయదేవతగఁ బూజించిన రామకృష్ణపరమహంసయొక్క యాదర్శదివ్యప్రేమయే యిట ప్రబల ప్రమాణము. ఇతఁడు తనభార్యను భార్యగా బ్రేమించ లేదు. ప్రణయ దేవతగ నారాధించినాడు.

ఇట్లు మన మహాకవి పశ్చాత్తాప తపస్సన్నివేశములతో నాయికా నాయకుల కామవృత్తిని మథించి వీరిరువురకుఁ జిత్త శుద్ధిని సమకూర్చి వీరిని పవిత్ర ప్రణయ ప్రకాశిత ప్రవిమలమూర్తులుగ రూపొందించినాఁడు. ఇటుపైని వీరిప్రేమ వెనుకటివలె వికార విషాదములను జనింపఁజేయునదికాక నిర్మలమై, సర్వసంఘ పరివ్యాప్తమై, భారతీయ దాంపత్య ప్రభావమును బ్రకాశింపఁజేయఁజాలి

చేయఁబడినది. ఇహలౌకికవిషయములతో నాముష్మికవిషయములు మిళితములై యుండుట ఈకవి కవితలోని ప్రత్యేకలక్షణము.

పై విధముగ మనకవి, శకుంతలా భౌతిక సౌందర్యసర్వస్వముతో నాయకుని భౌతికవాంఛల రేకెత్తించి, తపోవనమున కకారణబంధువైన శకుంతలను దుష్యంతుని– అంతఃపుర స్త్రీరత్నసంయుక్తుని– ప్రేమ వాగురలో నొక్కమాఱుగఁ జిక్కినట్లు చేసినాఁడు. శాఠ్యమెఱుఁగని శకుంతల సులభముగ రాజునకుఁ జిక్కినది. ఇప్పు డీమె తన తొల్లిటి శాంతిపదమునుండి పతితయైనట్లుకూడ నామెకుఁ దెలియదు. కనుకనే యిప్పటి యీామె పరిస్థితిని వర్ణించుచు రవీంద్ర కవీంద్రుఁడు "ఆరణ్యక పుష్పముపై 'దుమ్ము' పడినను అది, ఆ పుష్పసౌందర్యమునకుఁ ప్రతిబంధకముకాలేదు" అని నుడివినాఁడు * కనుకనే యీా పుష్పదళముల నైసర్గికశోభ, మాలిన్యయుతమైనపుడుకూడ చెక్కుచెదరక అట్లే (యథాపూర్వముగ) నిలిచియున్నది.

నైర్మల్యముతో నిత్యప్రకాశమానమైన యిట్టి స్వాభావిక సౌందర్యవిశేషమును దుష్యంత ముఖమున మనకవి మొదట యిట్లు పలికించినాఁడు.

> "శుద్ధాంత దుర్లభ మిదంవపు రాశ్రమవాసినో యదిజనస్య।
> దూరీకృతాః ఖలుగుణై రుద్యానలతా వనలతాభిః"॥
>
> (అంకము 1)

ఈ యాశ్రమవాసినులయందు నైజముగ భాసించుచున్న రూపవైభవము, అంతఃపుర స్త్రీలకుఁగూడ అలభ్యమే యైనచో, నీ తపోవన లతలు తమ స్వాభావిక సుగుణగణముచే, నుద్యానవన లతలను వెనుకకు నెట్టుచున్నవి. ఇట్టి సుగుణములచేతనే ఆశ్రమ కురంగము వలె భయసందేహము లెఱుఁగని శకుంతల సులభముగనే రాజునకుఁ

* "Dust settles on the flower of the forest. But in spite of it she easily retains her own beautiful cleanliness"

జిక్కినది. శ్రీ రవీంద్ర కవీంద్రుం డనినట్లు "సులభముగ సంప్రాప్తమైనది సులభముగనే సురిగిపోవును." కనుక ఇట శకుంతలా దుష్యంతుల భౌతిక - అస్థిర - శారీరక సంసర్గమును శాశ్వతానంద దాయకమగు నైతిక (మానసిక) సమ్మేళనముగా దిద్ది తీర్చవలసిన బాధ్యత యింక మన మహాకవిపై నున్నది.

శకుంతల దుష్యంత పరిణీతయైనపిమ్మట తన ప్రేమసామ్రాజ్యమునకు ఒక్క దుష్యంత సార్వభౌముునే సార్వభౌమునిగఁ జేసికొన్నది. ఇప్పు డామె హృదయమున ఒక్క "దుష్యంతునకు" వినా మఱియే యొక్కరికిని - చెలికత్తెలకు గాని, తుదకుఁ బ్రాణాధికమైన "వనజ్యోత్స్న"కుఁ గాని * చోటు లేదు. సంకుచిత హృదయములలో "విశ్వప్రేమము"నకు విశిష్టస్థానము లభించదుగదా! నాల్గుగోజులలోఁ దన యంతఃపురమునకుఁ దీసికొని వెళ్ళెదనని నమ్మించి వెళ్ళిన నాథునివద్దనుండి యెట్టివార్తయు రాదయ్యె. కనుక అనన్యమానసయై శకుంతల పతిధ్యాన ముద్రిత చిత్తయై యున్నది. ఇట్టి సమయమున సులభకోపనుఁడైన దూర్వాసమహర్షి వచ్చి, తదేకచిత్తయై యున్న యామెకు దుర్భరశాపమిచ్చి వెడలినాఁడు. ఇట్టి శాపవార్తనుగూడ నామె వినలేదయ్యె. ఈ కవి తన రఘువంశ కావ్యమునఁ జెప్పినట్లు "ప్రతిబధ్నాతిహి శ్రేయః పూజ్యపూజావ్యతిక్రమః" పూజ్యులను బూజింపకుండుట తమ భావి శ్రేయస్సునకుఁ బ్రతిబంధకమే యగును. కనుక నీమె దుర్వాసముని విషయమునఁ జేసిన పూజావ్యతిక్రమము, ఈమె భావిశ్రేయమునకు విఘ్నముగ మాఱినది. ఇట్టి సంఘటన మిట మన కవీంద్రునిచే బుద్ధిపూర్వకముగనే కల్పించబడినది. ఇట్టి విషమసంఘటనమునే మన మహాకవి యిట కల్పించకున్నచో, శకుంతలయొక్క పూర్వ శాంతినికేతన జీవిత గౌరవమంతయుఁ నింకొక

---

* "అనసూయా:— త్వయాకృతనామధేయా వనజ్యోత్స్నేతి విస్మృతాసి
శకుంతలా:— తథా యది ఆత్మానమపి విస్మరిష్యామి. (అంకము 1)

లాగునఁ బరిణమించి, శకుంతలను "భరతమాత" అను ప్రపంచ ప్రశస్తినుండి దూరము చేసియుండెడిది.

ఒకవేళ మనకవి కరుణించి యీ నాయికా నాయకులను దూర్వాస శాపహతినుండి కాపాడి పండువంటి కాపురములో వెంటనే ప్రవేశపెట్టినాఁ డనుకొనుఁడు. అప్పుడు శకుంతల తన పొంగారు నిండు జవ్వనములో రాజాంతఃపురమున రాజ్ఞీపీఠ మధివసించి, నిరాఘాట మైన తన యాజ్ఞను జలాయించుచు నామె తన భావిజీవితమును బూర్తిగ రాజసమునకే యంకితము చేసియుండెడిది. యౌవనము, ధనసంపత్తి, ప్రభుత్వము, అవివేకిత్వము అను నీ దుష్టచతుష్టయములో నేయొక్కటి యున్నను అనర్థమున కది దారిచూపుచుండగా నీ నాల్గును నొక్కచో * గూడియున్నచో నచ్చట అనర్థ పరంపరలు దమంత దాము వలచివచ్చునుగదా! ఇంతియేకాక శకుంతల, పతిగృహమున వెంటనే కాపురముసేయ సమకట్టినచో భారతీయ పవిత్ర ప్రణయ ప్రాభవములోని గురుత్వ, మహత్త్వ, పటుత్వ సంపదలు మన కింతగాఁ దెలిసియుండెడివికావు కనుకనే మన సౌందర్యవిదగ్రణి (కాళిదాసు) క్రొంగ్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చిన యా సౌందర్యరాశి శకుంత లకు రాజగృహమునఁ గాని, తుదకు పతి చిత్తమునఁ గాని (శాప సాధనముచే) రవంతయైనను స్థానము దొరకనీయలేదు. ఇఁక నీమెకుఁ గణ్వాశ్రమములోఁగూడ స్థానములేదు. భారతీయ వనితామ తల్లులకుఁ బతిగృహమున దాస్యమైనను గౌరవప్రదమైనదే. కనుకఁ బతినిరా కృతయైన యిప్పటి శకుంతల యగతికయై "భగవతివసుధే! దేహిమే వివరమ్మ"ని దుఃఖించుచు నంతర్ధానమందినది. (ఇది పూర్వభాగము)

ఐహికాఽఽముష్మికములేగాక, సౌందర్యముకూడ శక్తిమంతమై, చరితార్థతనందుటకు "తపస్సు" ప్రథమసాధనమైనట్లు మనము గిరిజా

---

* "యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా।
ఏకైకమప్యనర్థాయ కిము యత్రచతుష్టయం" (హితోపదేశసూక్తి)

సౌందర్య వర్ణనాభాగమునఁ దెలిసికొనియుంటిమి. ఈ తపస్సునకుఁ బవిత్ర వాతావరణ మత్యవసరమైనది. కనుక గౌరికి గౌరీశంకరశిఖరము వలె నీమెకు మన కవిమహర్షి కింపురుషశ్రేష్ఠమైన మారీచమహర్షి యొక్క దివ్యాశ్రమము తపశ్చరణానుకూలముగఁ జేసినాఁడు అట ఆమెచేఁ గఠినాఽతికఠినమైన తపస్సుఁ జేయించి తన్ముఖమున నామె సౌందర్యాఽహంకారకిల్బిష మంతటిని క్షాళితముఁజేసి, యామె నొక వినిర్మలసౌందర్య విరాజిత విశ్వప్రేమమూర్తిగఁ బరిణమింపఁజేసి నాఁడు. అచ్చట దుష్యంతుని చిత్తములో నభిజ్ఞానాంగుళీయక దర్శనముతోఁ బరితాపాఽగ్నిని బ్రజ్వరిల్లఁజేసినాఁడు. ధర్మరక్షణార్థమై ధర్మాసన మధిష్ఠించిన తాను (దుష్యంతుఁడు) ఒక పూతచరిత్రయెడ - ఒక యమాయికయెడఁ గావించిన దారుణకృత్యముఁ దలంచిన కొలందియు నది వానియెడందను గార్చిచ్చువలెఁ గాల్చివేయుచున్నది. తన గృహమునకు వచ్చిన తన గృహలక్ష్మిని, తన కులాఽభ్యుదయ లక్ష్మిని నీదాన నని వచ్చిన తన జీవితానందాభ్యుదయలక్ష్మిని, నిరాకరించి పొమ్మన్న తన (రాజు) యప్పటి యా మోహప్రాబల్యము, ఆ యజ్ఞత, ఆ స్మృతి తిరోధానము తలంచిన కొలందియుఁ దనలో (దుష్యంతునిలో) దుఃఖతరంగము లతివేలములై పొంగి పొరలు చున్నవి. ఇట్టి పశ్చాత్తాపముచే రాజు—

"సంరోపితేప్యాత్మని ధర్మపత్నీ త్యక్తా మయా నామ కులప్రతిష్ఠా।
కల్పిష్యమాణా మహతేఫలాయ వసుంధరాకాల ఇవోప్తబీజా॥"

(6-24)

"సకాలములో విత్తనములు చల్లుటచే గొప్ప పంటను బ్రసాదింప నున్న తన పంటపొలమును దనచేతులార విడిచిపుచ్చిన తెలివితేని రైతువలె నేను (రాజు) యుక్తకాలములో * బీజాఽవాపనము

* పతియే భార్యగర్భమునఁ బ్రవేశించును. "పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భోభూత్వే హజాయతే" (మనుస్మృతి)

(రేతస్సు నుంచుట) చేసిన కతన మహాఫలమును (సత్పుత్రుని) ప్రసాదించుటకు సిద్ధముగనున్న నా గృహాలక్ష్మిని చేతులారంగ విడిచి పుచ్చితిని" పై యుపమానముచే 'వసుంధరా' శబ్దము 'క్షేత్ర' వాచకమై "క్షేత్రం కళత్రే కేదారే" అని తనభార్యనే సూచించు చున్నది. భార్యావాచకమైన యీ "వసుంధర" "మహాఫలప్రదాత్రి" ఔరా! ఎంతటి స్వారస్యము! ఇంతటి మంచిపంట పొలమును దన చేతులార విడిచినరైతు యెంతటి యవివేకి? కాని ప్రబలమైన కారణాంతరముచేఁ దన పంటపొలమునే యీ రైతు తన కాలఁ దన్నినాఁడు. తిరిగి స్మృతిగలిగి, తన యవివేకిత్వము తనకే తెలియఁగల సుసమయము ప్రాప్తమైనది. ఐననేమి? "గతజల సేతుబంధనమే" ఇట్టి విచిత్ర సన్నివేశముగల పై యుపమానబలముచే రాజునకుఁ బ్రాప్తించవలసిన రెండు ప్రధాన ప్రయోజనము లిట (శకుంతలా త్యాగముచే) భగ్నములైనవి. "సిద్ధమన్నం ఫలంపక్వం నారీ ప్రథమ యౌవనం। సువాసితంచ తాంబూలం సద్యోగృహ్ణాతిబుద్ధిమాన్" అను సూక్తిచే శకుంతలా త్యాగకారణముగ రాజునకు ఐహిక భోగరాహిత్యమే కాక, "పున్నామ్నోనరకాత్త్రాయత ఇతి పుత్రః" అనునట్లు పుత్రోత్పత్తికి ఆదికారణమైన యామెను విడనాడుటచే, వంశవిచ్ఛేదము అను రెండవ మహాఽనర్థముగూడఁ గలిగినది. అపుత్రకుఁడైన సార్థవాహావృత్తాంత కల్పనచే నీకవి, రాజును మూర్ఛాపరవశునిఁ జేసి యతడి రాజస నిరాసమునకుఁ దగినంత ప్రాయశ్చిత్తముతో రాజునకు "చిత్తశుద్ధి" చేకూర్చినాడు. భారతీయ పవిత్ర ప్రణయానుభవమున కికఁ దచ్చిత్తము పాత్రమైనది. ఈ శుభసమయములో శకుంతల విశ్వప్రేమ విరాజిత విశుద్ధగాత్రి – ఎంత దుర్లభవస్తువో! ఎంతటి యారాధ్య మూర్తియో, తన (రాజు) యైహికాముష్మిక సుఖంబుల కెంతటి మూలకందమో దుష్యంతున కిప్పుడ యవగతమైనది. అట గిరిజ తపశ్చరణానంతరమున శివున కెంతటి సత్యసౌందర్య

రూపిణియైనదో, యిట దుష్యంతునకు శకుంతల ఇప్పట్టున నంత సత్య సౌందర్యరూపిణిగ భాసించుచున్నది. ఇప్పు డామెయొక్క సత్య నిత్య నిరవద్య నీరంధ్ర నిస్తుల సౌందర్యమును జిత్తరువున రాజు చిత్రింపలేకున్నాఁడు. "యద్యత్సాధు న చిత్రేస్యా త్క్రియతే తత్తద న్యథా। తథాపితస్యా లావణ్యం రేఖయా కించిదన్వితం"(అంకము 6 శ్లో 13) రమ్యముకాని భాగమును దిద్దితీర్చి మనోహరముగఁ జేయు టకుఁ జిత్రము ముఖ్య సాధనము. అట్టి చిత్రములోఁగూడ నిప్పటి శకుంతలా సౌందర్య సర్వస్వములో రేఖామాత్రమే చిత్రించుటకు రాజునకు సాధ్యమగుచున్నది. * ఆహా! మనకవి యెంతటి సౌందర్య తత్త్వవేత్తయో కదా! ఈ దివ్య సౌందర్య వైభవము "యతోవాచో నివర్తంతే" అను నుపనిషత్సూక్తిని దలపించుచున్నది. ఇప్పు డీమె రాజుయొక్క ప్రవిమల ప్రణయ స్వారాజ్యమునకు ఏకైక రాజ్ఞియైనది. ఇక రాజున కేకైకధ్యేయ మీమెయే. ఇఁక నీమె తనకు లభించు టెట్లు! కనుక నీమెకై విలపనమే రాజున కిఁక శరణ్యము. శ్రీరామ చంద్రుఁడుకూడ నిందుచూలాలైన సీతాదేవిని లోకారాధనమునకై ♦ అరణ్యములపాలుచేసి యామె ప్రణయమును దలంచుకొని యిట్లే విల పించినాఁడు.

"ఇయం గేహే లక్ష్మీః ఇయ మమృతవర్తి ర్నయనయోః।
అసావస్యాస్పర్శః వపుషి బహుళ శ్చందనరసః।
అయం కంఠే బాహుః శిశిర మసృణో మౌక్తికరసః।
కి మస్యానప్రేయో యది పున రసహ్యోన విరహః॥

ఉ. రా. చ. నాటకము.

---

* "ఈకవీశ్వరుని శకుంతలా పాత్రచిత్రణము, చిత్తరువులో నుత్తమ జిత్రకా రులుగూడ చిత్రించలేనంతటి యద్భుత చిత్రణము కలది" అని యిట ధ్వనించు చున్నది.

♦ "స్నేహందయాంచ సౌఖ్యంచ యదివా జానకీమపి। ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మేవ్యథా" (ఉ. రా. చ. నాటకము.)

సీత శ్రీరామచంద్రుని గృహలక్ష్మి. ఒక్క గృహలక్ష్మియే కాదు. ఆమె నేత్రములకమృతదీపలక్ష్మి; ఆనందలక్ష్మి; రాముని కులాభ్యుదయలక్ష్మి; భారతీయ వనితా పాతివ్రత్యకీర్తిలక్ష్మి; ఇట్టి తన యర్ధాంగలక్ష్మి సంబంధములగు చెయిదములన్నియుఁ దనకు (రామునకు) ఆనందజనకములేగాని ఒక్క యామె విరహము మాత్ర మిపుడు దుర్భరమగుచున్నది. ఇట్లే దుష్యంతునకు శకుంతలా విరహము కూడ దుర్భరమై యామెయందు రాజునకుఁ బూజ్యభావ మతిశయింపఁ జేయుచున్నది. ఇప్పట్టున నామె తిరిగి తనకు దర్శన మిచ్చినచో నీతని శుష్కజీవితవృక్ష మొక్కమ్మడిగఁ జిగుళ్ళుదొడిగి కుసుమితమై స్తబకితమై ఫలించును.

కేవల భౌతిక భోగదృష్టితోనే యొక్కడును భార్యను నిత్యముగ ప్రేమించలేడు. ఇఁక నామెయందలి ఆధ్యాత్మిక ప్రేమముచేఁ బతి ఆమెను నిత్యముగఁ బ్రేమింపఁగల్గుచున్నాఁడు. ఇది నిజమే. ఇదివఱ కామెయం దతనికిఁగల భౌతిక చాంచల్యప్రేమ యిపుడు స్థిరమై యాధ్యాత్మిక ప్రేమగను నదియే విశ్వప్రేమగను బరిణమించినదిగదా! భారతీయుల యాదర్శదాంపత్యమునకు శారదామణిని ప్రణయదేవతగఁ బూజించిన రామకృష్ణపరమహంసయొక్క యాదర్శదివ్యప్రేమయే యిట ప్రబల ప్రమాణము. ఇతఁడు తనభార్యను భార్యగా బ్రేమించ లేదు. ప్రణయ దేవతగ నారాధించినాడు.

ఇట్లు మన మహాకవి పశ్చాత్తాప తపస్సన్నివేశములతో నాయికా నాయకుల కామవృత్తిని మథించి వీరిరువురకుఁ జిత్త శుద్ధిఁ సమకూర్చి వీరిని బవిత్ర ప్రణయ ప్రకాశిత ప్రవిమలమూర్తులుగ రూపొందించినాఁడు. ఇటుపైని వీరిప్రేమ వెనుకటివలె వికార ప్రమాదములను జనింపఁజేయునదికాక నిర్మలమై, సర్వసంఘ పరివ్యాప్తమై, భారతీయ దాంపత్య ప్రభావమును బ్రకాశింపఁజేయఁజాలి

యున్నది. దుష్యంతునిదృష్టి కిపుడు శకుంతల మహిమాన్వితమగు నొక దివ్యప్రేమజ్యోతి, జీవనజ్యోతి, ప్రణయదేవత.

ఇప్పటికి మన కవీంద్రుని యభిలషితమంతయు ఫలించినది. కనుక నిటుపైని నీ ప్రణయమూర్తులను ఒకయింటివారినిగఁ జేయ వలసియున్నది. ఇందుకనియే నాయకునకు దేవేంద్ర సహాయార్థమై నాకలోకప్రయాణము కల్పితమైనది. ఈ స్వర్లోకయాత్రతో మర్త్య త్వమునకు అమర్త్యత్వము, భౌతికమునకు ఆధ్యాత్మికత్వము ప్రాప్త మైనవి. చూచుచుండగనే భూలోక మొక్కసారిగ స్వర్గలోకముగ పరిణతమైనది. ఇంద్ర సమ్మానముచే నాయకునిలో దివ్యత్వము దీపించినది. ఇక దివ్యప్రణయలాభప్రాప్తి కావలసియున్నది. కనుకనే స్వర్గమునుండి వచ్చునపుడు మారీచమహర్షిని దర్శించు కోరిక రాజు నకుఁ గలిగినది. ఈ కోరిక రాజునకుఁ బుత్త్రసందర్శన జనిత సమ్మో దమునకు, శకుంతలా పునస్సమాగమరూప మహాఽభ్యుదయమునకును మూలమైనది. * మహాత్ముల సందర్శనభాగ్యము మానవజీవితమునకు మహాఽభ్యుదయ సంపాదనాసమర్థమైనదికదా! ఈ దివ్యాశ్రమములో నైదేండ్ల బాలుఁడొకఁడు తల్లి పొదుగులోనున్న సింహశిశువును బలాత్కారముగ లాగి దానితో నాడుకొనుచు దుష్యంతునకు గన్నుల పండువుగఁ గానుపించినాఁడు. ఈ సన్నివేశముతో రాజు చిత్తములోని భౌతికసందేహ తరంగములు ఒక్కసారిగ నుచ్చలితములైనవి. తుదకా దౌష్యంతి దుష్యంతునకు ఆత్మజ్ఞానము (తాను ఆత్మస్వరూపమే అను జ్ఞానము; లేక "ఆత్మావై పుత్రనామాసి" అని ఈ బాలుఁడు తన స్వరూపమే అను నిశ్చయజ్ఞానము) కలిగించి, వానికి మానసానందము నంతయు నొక్కసారిగఁ గలుగఁజేయును. ఆత్మజ్ఞానలాభముఁ గొన్న

---

* "ఈ సన్నివేశకల్పనముచే మన మహాకవి" "ధర్మప్రజాసంపత్త్యర్థగ్ స్త్రియ ముద్వహే" అని ఆదిలో వరుఁడు చేసిన వ్యాఖ్యానమును సార్థకముచేసిన గృహ్యసూత్ర ప్రకారముగ భారతీయ దివ్య సంప్రదాయము నిటుల బోధించినాఁడు.

వానికి బ్రహ్మానందము సులభమేకదా! ఇంక రాజు, ముక్తుఁ డైహిక బంధవిముక్తుఁడైనట్లు పితౄణవిముక్తితో ఋణవిముక్తిని బడయును. ఈ విముక్తితో నీ రాజునకు జీవన్ముక్తునకు మోక్షలక్ష్మి ప్రాప్తివలె వెన్వెంటనే శకుంతలా సమాగమరూప మహాభ్యుదయము చేకూరినది. * ఇప్పటి శకుంతలా రూప మిదిగో.

"వసనే పరిధూసరేపసానా నియమక్షామముఖీ ధృతైకవేణీ।
అతినిష్కరుణస్య శుద్ధ శీలా మమ దీర్ఘం విరహవ్రతం
బిభర్తి॥" (7-21)

ధూళిధూసరితములైన వస్త్రములను ధరించి, కఠిన తపోనియమములతోఁ గృశించిన ముఖముకలదై ఒకేజడను ధరించి విశుద్ధశీలయై యీమె, యతికఠినాత్ముఁడనైన నా విరహవ్రతము నిట్లు సాగించుచున్నది. స్త్రీలకు "విశుద్ధశీలము" సత్యసౌందర్య సంపాదకమైనట్లు "తథాహి తే శీల ముదారదర్శనే! తపస్వినామప్యుపదేశతాంగతం" అని కుమారసంభవసూక్తి వ్యక్తముచేసి నట్లిచ్చటగూడ "శుద్ధశీలా" అను విశేషణము శకుంతలా సౌందర్యములో సత్య, నిత్య, నిరవద్య, నీరంధ్ర, నిస్తుల, సౌందర్యమును దోపింపఁజేయుచునే యున్నది. ఇట్టిదియు నిత్యోత్కర్షణోల్లసితమైనదై, "ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా" అను [illegible] లక్షితమై ప్రియుని నేత్రచకోరము
కనుక నిప్పటి శకుంతలలో నీతని
మైన - పవిత్ర తేజస్సందీప్తమైన-

---

మునందు సింహశాబకములు మానవులతో
సంశ్లిష్టములై యున్నవి. మన్మథుఁడా
ంచుటచేతనే యీ కవి యాతనిపై వజ్ర
మయమైన గృహముతో పవిత్ర తపోవన
ప సంబంధమును హఠాదాక్రమణమునుండి
ః ప్రతిష్ఠిత మొనర్చినాడు,

దివ్యసౌందర్య మగపడుచున్నది. కనుక సాదర భక్తి భావములతోఁ గూడిన పవిత్ర ప్రణయభావ మీామెయెడఁ జూపుచు రాజు ఆ పతి వ్రతతో "ప్రియే క్రౌర్యమపి మే త్వయి ప్రయుక్త మనుకూలపరిణామం సంవృత్తం" "ప్రాణేశ్వరీ! నేను ముందుగ నీవిషయములోఁ జూపిన నా క్రౌర్యభావ మిపుడు అనుకూలమైన పరిణామము కలదైనది" అని పలుకును. ఇప్పటిశకుంతల మనభాగ్యముచే భరతమాత యైనది. ఈమెలోని యిప్పటి "ప్రేమ" వాత్సల్యరూపమై సర్వ జీవకోటి యందును సమానమై, శాశ్వతసౌజన్యముతో శోభిల్లుచున్నది. తనను విడనాడిన పతియెడ ఈ "భరతమాత" యొక్క యిప్పటి ప్రవర్తనము "భారతీయస్త్రీలము" అనుకొనువారికి సర్వదా, సర్వథా అనుకర ణీయము ఆదర్శప్రాయముకూడ నైయున్నది. ఈమె నైష్ఠికసౌందర్య మిపుడు 'సత్య'మై లోక "శివం"కరమై నిత్యమై తేజరిల్లుచున్నది.
గోథే' మహాశయుఁ డనినట్లు నవ వికాస విలసితములగు వాసంత పుష్పములు క్రమముగ తమపరిణామరూపములైన ఫలముల మధురిమ లతోఁజెందిన సరససమ్మేళనమువంటిదే శకుంతలా దుష్యంతుల కీ సుముహూర్తసమయమున జరిగిన నైతికసమ్మేళనము. ఈ సమ్మేళనము ఈ దివ్యభూమిలో దివ్యప్రణయస్వర్గ మైనది. ఇఁక వీరి యీా పవిత్ర ప్రణయము ఎప్పటికిని జలించనిది; కృశించనిది; పీడనిది. ఇఁక పై పవిత్రపరిణామముతోఁ భూతలముకూడ కాళిదాస కమనీయ కవితా ప్రభావ గౌరవముచే నతిసహజముగనే స్వర్గముగఁ బరిణమించినది. వాసంతపుష్పములే ఒక్కసారిగ ఒక్కచోటనే ఫలము లైనవి.

"The earth and Heaven itself in one sole ...name combine" అన్న గోథే కవీంద్రుని పద్యభావ మిట సార్థకమైనది.

ఇంతవరకుఁ గల నా భావములను వివరించుచున్నట్లున్న శ్రీ రవీంద్రకవీంద్రుని భావరత్నములఁ గొన్నిటి నిటఁ బొందుపఱచెదను.

The poet has shown here, as in Kumarasambhava, that the beauty that goes hand in hand with

moral law is eternal, that the calm, controlled, and beneficent form of love is its best form, that beauty is truly charming under restraint and decays quickly when it gets wild and unfettered.

He teaches us that the love of man and woman s not beautiful, not lasting, not fruitful, so long as it is self- centred, so long as it does not beget goodness, so long as it does not diffuse itself into society over son and daughter, guests and neighbours.

The beauty that he adores is lit up by grace, modesty, and goodness, in its intensity; it is true to one forever; in its range it embraces the whole Universe; it is fulfilled by renunciation, gratified by sorrow, and rendered eternal by religion. In the midst of this beauty, the impetuous unruly love of man and woman has restrained itself and attained to a profound peace, like a wild torrent merged in the ocean of goodness. Therefore such love is higher and more wonderful than wild and untrained passion.

రవీంద్రునిపై యాంగ్లమాతృక కిది శ్రీ బొ. పురుషోత్తము M. A. గారి యాంధ్రానువాదము. (చూ. కాళిదాసకవిత) "ధర్మమున కవిరుద్ధముగా ప్రేమభావముతో నడచు సౌందర్యము శాశ్వతమైనది... ... నైష్ఠికసౌందర్యమే శుభప్రదమై నిత్యోత్కర్షణోల్లసితమైనది. నియమరహితము, నసంస్కృతము నగు సౌందర్యము క్షణభంగురము. కవి యిట్టి పవిత్రభావములను కుమారసంభవమునందువలె నిందును (శాకుంతలమున) కాంతాసమ్మితముగా నుపదేశించెను... ...దంపతుల ప్రేమ స్వార్థపూరితమైనచో నిట్టిసత్ఫలితముల నొసంగదనియు, వాత్సల్య

రూపమున సంఘమునందుఁ బరివ్యాప్తము కానంతవఱకును దాని కెట్టి సౌందర్యముగాని, శాశ్వతత్వముగాని, చరితార్థతగాని లేదనియు నీకాళిదాసమహాకవి ముక్తకంఠమున నుద్ఘోషించెను ... కాని కాళిదాసుని సౌందర్యజగత్తు జీవకళతోఁ గలకలలాడునది; సౌజన్యముతో శోభిల్లునది; సాధుత్వమును సవదరించుకొన్నది; సువిశాల విశ్వమును సురుచిర ప్రేమభావముతో నాలింగన మొనర్చుకొన్నది. కాళిదాస ప్రతిపాదిత సౌందర్యము త్యాగముచే సిద్ధించును. దుఃఖముచే నూతనత్వమును బొందును. తపస్సుచే దివ్యత్వము నార్జించును. ఇట్టి దివ్యసౌందర్యార్ణవమునందు నియమరహితములైన కామోద్రిక్తతా ప్రవాహములు అనేకములు సంగమించి (భారతీయ) ప్రణయభావసిద్ధితోఁ బరిపూర్ణతను అనుభవించును. సకల ప్రపంచమును అట్టి దివ్యసౌందర్యధామముగాఁ బరివర్తింపబడవలయు ననియే శ్రీ కాళిదాసకవీంద్రుని యాశయము."

పై రవీంద్ర కవీంద్రుని యాశయములకు మన మహాకవి శాకుంతలనాటకము పూర్తిగఁ బాత్రమైయున్నట్లు పై విషయములను బట్టి తెలిసికొంటిమి. ఇట్టీ భారతీయుల పవిత్ర ప్రణయప్రాభవమును దన మహాకావ్యముల ముఖమునఁ బ్రపంచమునకుఁ జాటి, భారతజాతిని తరతరాలవఱకుఁ బటిష్ఠముగను, మహిమాన్వితముగను దిద్దితీర్చి, ప్రపంచములో మనకొక ప్రత్యేకస్థానమును బ్రసాదింపఁజేసిన కాళిదాస మహాకవికి నిజముగ మనమందఱము ఋణపడియుంటిమి. మఱియు స్వార్థసంకుచిత ప్రేమను విశ్వమానవ ప్రేమగాఁ బరిణమింపఁజేసి, భూమండలమంతయు నేకకుటుంబముగ * నాదరభావముతోఁ జూడఁ గల్గిన - ప్రకృతియంతటిలోఁ దన ప్రేమామృతము నొలికించి, స్థావర జంగమరూపప్రపంచ మంతటిని సమానగౌరవముతో, సమానప్రేమ తోఁ జూడగల్గినజాతీయమహాకవి కాళిదాసమహాకవి. ఇట్టి జాతీయ

* "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం."

మహాకవియొక్క కావ్యసందేశమూలముననే భారతజాతియంతయు విశ్వమానవప్రేమతో విశ్వజనీనమై విశ్వమంతటిలో విశిష్టస్థానము నార్జించుకొనఁగల్గినది. కనుక మన జాతీయమహాకవి కవితను వివేచనా దృష్టితో నధ్యయనముచేసి, యాతని కావ్యములలోని "విశ్వప్రేమ"తో విశ్వమునకు - ముఖ్యముగ చైనావంటి దురహంకారపూరిత దుష్టసంఘములకు వెలుఁగుబాటను జూపుట విజ్ఞుల కర్తవ్యమై యున్నది.

"సర్వస్య సద్భావనాఽస్తు - విశ్వస్య కళ్యాణమస్తు.



ఓమ్

# కాళిదాస హృదయము



## కాళిదాసు - ప్రకృతి సహజీవనము

"ప్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్"

మహాకవులు ప్రకృతిలోని రహస్యములను సుమధుర వాగ్గుంభనములతో వివరించి విస్పష్టము సేయుచుందురు. ఇట్టి మహాకవులలో కాళిదాసు * కనిష్ఠకయందు లెక్కింపఁదగినవాఁడు. ప్రస్తుతములో నీ మహాకవి కావ్యపాత్రలకుఁ గల "ప్రకృతిసహజీవనము" ఎట్టిదో ఇంచుక కనుఁగొందము.

ఈశ్వరుఁడు తపస్సు చేసికొనుచుండఁగా మదన ప్రేరణముచే వసంతుఁడు వచ్చి స్థాణ్వాశ్రమములో నకాలమున విజృంభించును. ఇట్టి వసంత విజృంభణమును వర్ణించుచు గాళిదాసు తన కుమార సంభవములో

"లగ్నద్విరేఫాంజన భక్తి చిత్రం,
ముఖే మధుశ్రీ స్తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణ కోమలేన,
చూత ప్రవాళోష్ఠ మలంచకార" (3 సర్గ 20 శ్లో.)

"వసంతశోభ యనునదే యిట నొకలక్ష్మి. ఆ శోభా ప్రారంభ మనునదే యా శోభాలక్ష్మియొక్క ముఖము. ఆ శోభలో నొకభాగమైన తుమ్మెదల బారులే యా స్త్రీముఖమునంజలి కాటుకరచనలు. తిలకమను పుష్పమే యామెకుఁ దిలకము. బాలసూర్యుని రక్తిమయే ఆమెకు లాక్షారాగము. మామిడిచిగురే తదధరోష్ఠము. అనఁగా

* "పురాకవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా||"

వసంతలక్ష్మి, తన ముఖమునందు తుమ్మెదబారు లనెడు కాటుక ధరించి, తిలకపుష్పమనెడు తిలకమును దిద్దుకొని, బాలార్క-రాగ మనెడు లాక్షారాగముతో మామిడి చిగు రనెడు తన యధరోష్ఠమును అలంకరించు కొనెను. చూచితిరా! కాళిదాస కావ్యలక్ష్మి ప్రకృత్యలంకరణములతోఁ దన శరీరమును నలంకరించుకొని సాక్షాల్లక్ష్మివలె కలకలలాడుచు నెంతగాఁ బ్రకాశించుచున్నదో! ఇట కాళిదాస కావ్యలక్ష్మికిఁ బ్రకృతిలక్ష్మితో నభేదము వర్ణితమైనది. దీనిచే మానవ శరీరమునకుఁ బ్రకృత్యలంకరణమే సహజాద్భుతాలంకరణ మనియుఁ బ్రకృతితో నైక్యముగ జీవించుటయె జీవితమునకు సహజానంద మనియు నిట ధ్వనించుచున్నది. ఇట్టి "ప్రకృతి సహజీవన" విధానమును కాళిదాసు తన కావ్యములలో సమయము దొరికినప్పుడెల్ల జారవిడువలేదు.

పార్వతీకన్యక వాసంతపుష్పములతో నలంకృతయై యీశుని యిరవుఁ జేరుచున్న సందర్భములో మనకవి తన కుమారసంభవమున

"అశోకనిర్భర్త్సితపద్మరాగ మాకృష్టహేమద్యుతి కర్ణికారం।
ముక్తాకలాపీకృతసింధువారం వసంతపుష్పాభరణం వహంతీ॥"
(సర్గ 3 శ్లో 53)

నగరాజపుత్రి మణిమయ భూషణములకుఁ బదులు వసంతకాలిక పుష్పముల నలంకరించుకొన్నది. అట్టి పుష్పములలో గొన్ని యామెకుఁ బద్మరాగమణిమయాభరణములై మించియున్నవి. ఇట్లే యామె యలంకరించుకొన్న కొండగోగుపువ్వు లామెకు సువర్ణాభరణముల స్థానము నాక్రమించుకొన్నవి. ఇట్లే యామె సింగారించుకొన్న సింధువారపుష్పములు మౌక్తికాభరణములను బోలియున్నవి. ఇట్లామె యలంకరించుకొన్న యప్పటి యకాల వాసంత పుష్పాభరణములు, మణ్యాభరణములై చెన్నొందుచున్నవి. కాఁగా, ఆ పువుబోఁడి పువ్వులతోఁ బూవై తావితోఁ దావియై యిట్లామె, ప్రకృతిజీవితముతోఁ

దనజీవితమును మేళవింపఁజేసి తన జీవితమును మధురమయము గావించి నట్లిట మనకవి చూపినాఁడు.

ఇట్లే యీశ్వరసేవకై నగరాజపుత్రి వచ్చుచున్నప్పటి యొయ్యారములు వర్ణించుచు మనకవి

"ఆవర్జితా కించిదివ స్తనాభ్యాం, వాసోవసానా తరుణార్కరాగం।
పర్యాప్తపుష్ప స్తబకావనమ్రా, సంచారిణీ పల్లవినీ లతేవ॥"
(3-54)

"లేతసూర్యుని రక్తిమవంటి రాగము కల చీరెను గిరిజ ధరించి స్తన భారముచే నీషన్నమితయై వచ్చుచున్నది. ఇట్లు వచ్చుచున్న యా గిరిజాకన్యక యెట్లుండె ననఁ గావలసినన్ని వన్నెలతో వఱలుచు చాలినన్ని పూగుత్తుల బరువుతోఁ గొంచెమువంగి, చిగురుటాకుల సోయగములతో శోభాయమానమై, నడచివచ్చుచున్న లతాకుమారి వలె నున్నది." ఇచ్చటి యుపమాలబలముచే నగరాజపుత్రి ప్రకృతి శోభారూపిణియై శరీరముదాల్చి నడచివచ్చుచున్న సాక్షాత్ప్రకృతి లక్ష్మియో యన్నట్లుండలేదా? "మానవజీవితము, ప్రకృతితోఁ గలిసిమెలసి ప్రకృతి ప్రేమభావముతో నున్ననాఁడే యట్టివారి జీవితము మధురమయమై సోయగములకు నెలవై మహితానంద నిలయమగును" అని మహాకవి యిట నిరుపమానమగు నుపమానబలముచే సూక్ష్మముగ సూచించుచున్నాడని భావించెదను. తరువాతి శ్లోకములలో సైతము ఈ గిరిజ ధరించిన వాసంత పుష్పములు ఈమె సహజసౌందర్యమును సందీపింపఁజేయఁగా నప్పటి యీమె సౌందర్యము రతిదేవికిఁ గూడ సిగ్గును గల్గించుచున్నదఁట. * ఇదంతయు గిరిజాకన్యకయొక్క ప్రకృతిసహజీవన ప్రభావ భాసితమేకదా!

ఇట్లే తపశ్చరణములోనున్న పార్వతి యంగములయందు విలాసములు కానరాకున్నవనియు నవి వీరుధము (లత) లందే వీక్షింపఁబడు

* ఇంకను చూ. సర్గ. 6 శ్లో 37 నుంచి 47; సర్గ 7- 8, 11, 13, 16, 26, 73, సర్గ. 8- 30 నుంచి 47, 74 మొ॥

చున్నవనియు భావించి మన మహాకవి యిట్లు నుడివెను. "గిరిజ తాను నియమములలో నున్నంతవఱకుఁ దనకు విలాసగ్రహణము యుక్తము కాదని తపశ్చరణకాలములో దన యాంగిక విలాసములను జిన్ని లతలందును, విలాసవీక్షితము (చూపు) లను ఆఁడులేళ్ల దృష్టులయందును దాచుకొన్నదివలె నుండెను." (చూ. సర్గ5 శ్లో13). దీనినిబట్టి ప్రకృతి సహజీవనమే మానవజాతికి సహజసందీప్తములైన చక్కని విలాసములను బ్రసాదించునని ప్రస్ఫుటమగుచున్నది. మఱియు నీ దృశ్య మాన ప్రకృతియందు మన మహాకవికిఁగల పుత్రప్రేమను పార్వతీ ముఖమున నతఁ డిట్లు ప్రకటించినాఁడు.

"అతంద్రితా సా స్వయమేవ వృక్షకాన్
ఘటస్తనప్రస్రవణై ర్వ్యవర్ధయత్ ।
గుహోఽపి యేషాం ప్రథమాప్త జన్మనాం
న పుత్రవాత్సల్య మపాకరిష్యతి॥" (5-14)

"గిరిరాజపుత్రి తన పాలిండ్లను బోలిన నీటికడవలతోఁ దత్తపోవనము లందలి చిన్న వృక్షములకు, బయస్సులను బోలిన పయములను (నీటిని) బోసి పుత్రప్రేమతో నా వృక్షములను దన చేతులారం బెంచెను. కనుకనే కుమారస్వామి పుట్టినపిమ్మటకూడ మొదట పుత్ర ప్రేమతో బెంచిన యా వృక్షములయెడ నామెకుఁ బుత్రప్రేమ పోలేదు". ఇట్లు స్థావరములయందేకాక జంగమములయందును (లేళ్ళు) మొ॥ ఈమెచూపిన వాత్సల్యభావ మపూర్వమైనది. (చూ. 5-15)

ఇట్లు చరాచర ప్రకృతియందు పార్వతికిఁగల 'సహజీవనము' మున్ముందు విశ్వప్రేమగా వికసించి పరిమళించును. మఱియు హిమవద్వర్ణనములో కాళిదాసుని ప్రకృతి వర్ణనాపాటవముకూడ మానవ జీవితమునకుఁ బ్రకృతి సహకార మెంత యవసరమో చక్కఁగఁ దోపించుచున్నది.

ఈ హిమవంతుని విశిష్టతను రాయబారులై వచ్చిన సప్తర్షులచే మన మహాకవి యిట్లు పలికించును. 'ఓ రాజా! పర్వత రూపములో నున్న నీ స్వరూప కాఠిన్యమంతయు నీ స్థావర (పర్వత) రూపములలో సమర్పితమై యున్నది. సత్పురుషారాధకమైన నీ జంగమరూపము మాయెదుట భక్తినమ్రమై నిలిచియున్నది. దీనిచే ప్రకృతిరూపములలో నైక్యమగుట మానవుని సంపూర్ణజీవికకుఁ బ్రతీకమని తెలియుచున్నది.

ఇట్లు ప్రకృతితో "సహజీవన" విధానమును దెలిపెడు పద్యములు కాళిదాసీయములు కోకొల్లలై కొమరు మిగులుచున్నవి. వీనిలో మచ్చునకొక శ్లోకార్థము.

"పార్వతీ పాణిగ్రహణానంతరమున ఆమెతోఁ గూడియున్న యీశ్వరుఁడు శరత్కాల లక్షణములతోఁ గూడియున్న లోకమువలె యుండెను." కనుక శరత్కాల లక్షణములు లోకమునందును గన్పట్టవలెను. చూడుఁడు. గిరిజ యధికమైన ముఖచంద్రకాంతికలది. శరత్కాలముకూడ నిర్మలమైన చంద్రకాంతి కల్గియుండును. ఇట్టి చంద్ర కాంతి సంబంధముచే కలువలు చక్కగ వికసించును. గిరిజాముఖ చంద్రకాంతి సంసర్గముచే నీశ్వరుని నేత్రములనెడు కలువలు సంతోషముచేఁ జక్కగ వికసించినవి. ఇఁక శరత్కాలములో జలములు బురదలేక నిర్మలములై యుండును. ఇట్లే యీశ్వరుని చిత్తము అనెడు జలములు గిరిజ అను శరత్కాల సంబంధముచే నిర్మలములై యున్నవి. కనుక శరత్కాలములో, లోకము తల్లక్షణలక్షితమైనట్లు గిరిజాశరత్సంబంధముచే నీశ్వరలోకము తల్లక్షణలక్షితమై యుండెను." (7-74)

"తయాప్రవృద్ధానన చంద్రకాంత్యాప్రఫుల్లచక్షుః కుముదః కుమార్యాః ప్రసన్నత చేతస్సలిలశ్శివోభూ। త్సంసృజ్యమానశ్శరదేవ లోకః" (చూ. కుం. సం. స. 74 శ్లో)

ఇట నిర్మల ప్రకృతికల శరత్కాలముతో సహజీవనము కల్గుటచేతనే యీ వినూత్న దంపతులకుఁగూడ "నేత్రవికసనచేతః

ప్రసాదాది సుమధుర శరత్కాల గుణములు కల్గి వారి జీవితము మాధుర్యమయమై మహానందనీయమై పరిఢవిల్లినది. దీనికి సహజీవనమే మూలమనుట మఱవరానిది కదా!

ఇంక మేఘసందేశములోని సహజీవనము వీనులవిందుగా విందము. మధ్యేమార్గములో మేఘునకు రేవానదీజలసేవన మత్యవసరమని యక్షుండు మేఘునకుఁ దెలిపెడు సందర్భములో

"తస్యాస్తిక్తై ర్వనగజమదై ర్వాసితం వాంతవృష్టి। ర్జంబూకుంజప్రతిహతరయం తోయ మాదాయగచ్ఛేః। అంతస్సారంఘన ! తులయితుం నానిలశ్శక్ష్యతిత్వాం। రిక్తస్సర్వోభవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ॥"

(మేఘసందేశము సర్గ 1 శ్లో 20) ఓ మేఘుఁడా! నీవు వర్షించినపిమ్మట తిరిగి నీవు గురుత్వము (బరువు) పొందుటకై దారిలోని రేవానదీజలములను ద్రావుము. ఆ జలములు వన్యపుటేనుఁగుల మదజలములతోఁ గలియుటచేఁ గొంచెము వెగటుచెంది యుండును. అట్టి తిక్తజలములను సేవించిన నిన్నుఁ వాతము (గాలి) కంపింపఁ జేయజాలదు. లోపల సారములేనివాఁడు చులకనైనవాఁడై లఘుత్వమును బొందును. కనుక పూర్ణత్వము గురుత్వమును గల్గించును" ఇట "ప్రకృతితో సహజీవనము మానవునకు ముఖ్యాతి ముఖ్యము"ను విషయము త్రిభంగులుగా జెప్పఁబడినది. చూడుఁడు.

ఒకటి: మేఘుఁడు వర్షించినపిమ్మట చులకనై గాలిదెబ్బకె గురగొట్టఁబడును గాన ఇట్టి గాలిదెబ్బ లేకుండుటకై లోపట నీరుండకుండవలెను.

రెండు: పుణ్యజీవనుఁడు ప్రకృతిసిద్ధములైన పవిత్ర నదీజలములను సేవించి ప్రకృతి ప్రియుఁడై ప్రకృతి సహజీవనభాగ్యముతో ధన్యజీవి యగుచుండును.

మూఁడు : వాంతి చేసికొన్నవాఁడు (వాంతవృష్టిః) వాంతి వెళ్ళినపిమ్మట తప్పక కషాయము సేవించవలెను. (తిక్తైర్వాసితంతోయ మాదాయ). ఇట్టివానిని అనిలః=వాతరోగము పీడింపదు. * (తుల యితుం నశ్యతి) స్వతః శరీరబలములేనివాఁడు రోగమునకు చులకన యగును. అనఁగాఁ బిండశక్తి లేనివాఁడు సులభముగా రోగగ్రస్తుఁ డగును.'' కనుక మానవునకుఁ బ్రకృతి సహజీవనము ఆరోగ్యభాగ్య ప్రదమై వానికి సర్వాభ్యుదయ సంపాదక మగును. ఇది లేనివాఁడు సులభముగ దుఃఖభాగియై యిహపరసుఖములకు దూరుఁ డగును. ఈ శ్లోకార్థము మన మహాకవికి గల ప్రకృతి సహజీవన ప్రియత్వమును ముక్తకంఠముగ చాటుటలేదా? ఇఁక "ప్రకృతితోఁ గలిసి మెలఁగిన వానికి ఐహికభోగానుభవము మనఃప్రమోదము నిత్యసన్నిహితము" అను విషయమును సూచించుచు మన మహాకవి యక్షునిముఖమున ని ట్లనిపించును.

"నీచై రాఖ్యం గిరి మధివసే స్తత్ర విశ్రామ హేతోః ।
త్వత్సంపర్కా త్పులకిత మివ ప్రౌఢ పుష్పైః కదంబైః ॥
యః పణ్యస్త్రీరతి పరిమళోద్గారిభి ర్నాగరాణాం ।
ఉద్దామాని ప్రథయతి శిలా వేశ్మభి ర్యౌవనాని॥"

(మేఘసందేశము సర్గ. 1 శ్లో 26)

ఓ మేఘుఁడా ! నీవు మార్గాయాసమును నివారించుకొనుటను మార్గ ములో 'నీచైః' అను గిరిని అధిష్ఠింపుము. ఆ గిరి నీ సంపర్కవిశేషము చేత పులకాంకురములు కలదయ్యెనా ? అనునట్లు వికసించిన చక్కని కదంబ పుష్పములు కల్గియుండును. అప్పర్వతపు చఱియల యందు

* ఇందుకు వాహటుడు తన వైద్యగ్రంథములో "...లఘుతిక్తైః కషాయావా యోనిసర్గాత్కఫాపహః । కృతశుద్ధేః క్రమాత్పీతపేయాదేః పథ్యభోజినః । వాతాదిభి ర్నబాధాస్యా దింద్రియైరివయోగినః ।" "ఇంద్రియ నియమముచే యోగులకు ఇంద్రియ జన్యమగు బాధలేనట్లు పథ్యముగా నున్నవానికి వాతరోగాదిబాధ కలుగదు."

ప్రౌఢనిర్భర యౌవనపరీపాక ప్రాభవముగల భోగస్త్రీలు తమ కనుకూలురైన ప్రియులతోఁగూడి - సుఖములఁ దేలి మునుఁగుచుండగా వారు వసించిన శిలాగృహములు వాసితములై యవి యచ్చటి నాగరకులయొక్క యుద్దామమగు యౌవన ప్రభావములను వ్యక్తముసేయుచుండును. అట్టి శిలాగృహములతో నొప్పుచున్న నీచైః పర్వతము నో మేఘుఁడా! సేవించి వెడలుము" ఇట యువతుల భోగభాగ్యమునకు భాజనమై, ప్రకృతిదృశ్య ప్రకాశితమైన యీ పర్వతముయొక్క సేవనము లేనివానికి ఇట్టి భాగ్యములను జూచు భాగ్య మబ్బునా? ఇట్టి పర్వతములపై సంచరణభాగ్యము లేని యువతీయువకుల కట్టి యతేచ్ఛ భోగానుభవప్రాప్తి యెట్లు చేకూఱఁగలదు? ఇట్టి యైహిక భోగానుభవ భాగ్యముఁ బడయఁగోరువారు ప్రకృతిదృశ్యభాజనములైన యిట్టి పర్వతప్రాంతి దేశములను, సరిత్తటసైకత భూములను, ఉపవన భూములను "విహారయాత్ర" యను మిషచే సేవించుచుందురు కదా! కాఁగా మానుషానందప్రాప్తికి, మాధుర్యమయ జీవితయాత్రా సిద్ధికి నిట్టి ప్రకృతి సహజీవన విధానము పరమసాధన మగుచుండు నను విషయము పై గిరివర్ణనముచే సూచింపఁబడుటలేదా?

ఇట్టిదే మఱియొక సన్నివేశము అలకాపట్టణవర్ణనా సందర్భమున మన మహాకవి

> "అక్ష య్యాంతర్భవననిధయః ప్రత్యహం రక్తకంఠై
> రుద్గాయద్భి ర్ధనపతియశః కిన్నరై ర్యత్ర సార్ధం।
> వైభ్రాజాఖ్యం విబుధవనితా వార ముఖ్యాసహాయాః
> బద్ధాలాపా బహిరుపవనం కామినో నిర్విశంతి" (2-10)

"తమ యిండ్లలో నిధులు కల్గియున్న యలకాపట్టణస్థ కాముకజనము అప్సరస్త్రీలనెడు వారస్త్రీలతో సరససల్లాపములు సేయుచుందురు. మఱియు కమ్మని కంఠమాధుర్యములతో కుబేరకీర్తిని కీర్తించెడు

కిన్నర స్త్రీలతోఁగూడి (యా కాముకులు) వైభ్రాజము * అనెడు నుద్యానవనములో సుఖభోగము లనుభవించు చుందురు."

ఇట కామిజనమునకు కిన్నర స్త్రీలతోడి భోగానుభవ ప్రాప్తికి తదానందానుభవసిద్ధికి ఆటపట్టయిన దీ యుద్యానవనస్థ ప్రకృతియే కదా! ఇట్టి ప్రకృతితో కామిజనమునకు సహజీవనము లేనినాఁడు వారికిఁ కిన్నర స్త్రీలతోఁ ప్రాప్తించిన ఆనందము కళావిహీనమై యుండెడిదికదా! ఇట్లే మిగిలిన కాళిదాసీయములు మల్లికాపుష్పముల వలె నెచ్చటఁబట్టి చూచిన నచ్చటే ప్రకృతి సహజీవన రూప సౌరభములను వెదజల్లుచు, మహితభావ మకరందములతో బాఠకుల కామెత (విందు) లొసంగుచుందును.

ఇఁక రఘువంశ కావ్యోద్యానమును దర్శించుదము. దిలీప మహారాజు భార్యాసమేతుఁడై కులగురువగు వసిష్ఠుని యాశ్రమము నకుఁ బోవుచు వనములో

"సరసీ ష్వరవిందానాం వీచి విక్షోభశీతలం।
ఆమోద ముపజిఘ్రంతౌ స్వనిశ్వాసానుకారిణం॥"
(చూ. రఘు. సర్గ 1, శ్లో 43)

"దిలీపదంపతులు వనములోని సరస్సులయందలి పద్మపరిమళములను - వీచికా సంపర్కముచేఁ జల్లనై దమ నిట్టూర్పువాయువుల ననుకరించు చున్న వానిని - బీల్చుకొనుచు బయనించుచున్నారు." ఇట నీ దంపతుల ప్రకృతి సహజీవనము, సర్వభూతములయందును ఆత్మావలోకన భాగ్యము అనునివి వీరి జీవితములకు దివ్యత్వ మొసంగఁజాలి యున్నవి. బహిః ప్రకృతితో వీరి ప్రకృతి సమ్మేళన మందినది.

"హైయంగవీనమాదాయ ఘోషవృద్ధా నుపస్థితాన్।
నామధేయానిపృచ్ఛంతౌ వన్యానాం మార్గశాఖినాం॥" (1-45)

---

* "విభ్రాజము" అనెడు నేనుఁగుచే రక్షితమైన దగుటచే నీ యుద్యానమున కీ పేరు సార్థకము. (చూ. శంభురహస్యమ్.)

"ఈ దిలీపదంపతులు, అప్పుడే వెన్నకాచిన ఘృతమును అమ్మఁ దెచ్చుచున్న మునలిగొల్లలను దమ మార్గములోనున్న వృక్షముల నామధేయములను ఆప్యాయముగ నడిగి తెలిసికొనుచుఁ బయనించు చున్నారు." ఇచ్చట స్థావర జంగమరూప ప్రకృతితో నీ సార్వభౌముని సహజీవన విధానము మేళనమంది, సర్వభూతమయుఁడైన విష్ణువు యొక్క యంశ సంజాతత్వమును బ్రకటించుచున్నది. ఇప్పటి శుష్క హృదయులైన కొందఱకు ఈపాటి చెట్లయొక్క యోగక్షేమప్పృచ్ఛ మూర్ఖ పరిపాకమైన ట్లనిపించుఁగాక.

ప్రపంచగత వస్తువు లన్నిటిలోఁ బరమేశ్వర కళను బ్రత్యక్షీక రించుకొనఁజాలిన దిలీపమహారాజువంటి కరుణామూర్తులకు, - జీవ కోటితో సమ సుఖ దుఃఖభాగులైన యిట్టి పురుషోత్తములకు, జీవకోటి యొక్క యోగక్షేమప్పృచ్ఛ నిసర్గసిద్ధమే కదా! ఇట దిలీపుఁడు వృక్ష ములలోఁ బరమేశ్వర కళను జూడఁగల్గిన మహనీయుఁడు కనుకనే తన మార్గములోని చెట్లలోఁ గూడ దత్కళను జూచి వాని యోగక్షేమ మారయగల్గి వాటిలోఁ దన ప్రేమామృతము నొలికింపఁ గల్గినాఁడు. ఇట్టి ప్రకృతి ప్రణయిత్వమే యీ మహారాజు సంతానమైన రఘు మహారాజులోఁగూడ బ్రతిఫలించి పాదుకొన్నది. పరికింపుఁడు. గురు దక్షిణార్థియై తన సన్నిధికి వచ్చిన వరతంతు శిష్యునిగూర్చి రఘు మహారాజు కుశలప్రశ్న చేయు సందర్భమున మన మహాకవి తన రఘువంశములో

"ఆధార బంధప్రముఖైః ప్రయత్నై
స్సంవర్ధితానాం సుతనిర్విశేషం
కచ్చిన్న వాయ్వాదిరుపప్లవోవ
శ్రమచ్ఛిదా మాశ్రమపాదపానాం॥" (సర్గ 5 శ్లో 6)

ఓ కౌత్సమహర్షీ! మీ తపోవనములోని వృక్షములకు సుడిగాలి మున్నగు వానివలన నుపద్రవములు కల్గుటలేదుకదా! మీరా వృక్ష

ములకుఁ గుదుళ్ళలో నీరుపోయుట మొదలగు ప్రయత్నములతో వానిని బుత్రులవలెఁ బెంచితిరి. అవి సంతతము మీ శ్రమను బాపు చుండునవి. అట్టి మీ యాశ్రమ వృక్షములు కుశలమేకదా!" ఇట రఘు మహారాజునకు వనపాదపములయెడఁ గల నిస్స్వార్థప్రేమ యతనిలోఁ గల "వసుధైవ కుటుంబక"మ్మను విశ్వప్రేమకు నిదర్శనమై ప్రకృతితో మానవజీవితమున కుండవలసిన "సహజీవన" సిద్ధాంతమును సిద్ధాంతీకరించుచున్నది.

ఇఁక కాళిదాసు తన శాకుంతల నాటకములో జూపిన సహజీవనమును సంగ్రహముగ సమీక్షించుదము. దుష్యంతుఁడు కణ్వాశ్రమములోఁ బ్రవేశించినపుడు శకుంతల చెలికత్తెలు వినోదసంభాషణము సేయుచున్న సందర్భము. చెలి శకుంతలతో *

"సఖి। శకుంతలే! త్వత్తోపి తాతకాశ్యపశ్య ఆశ్రమవృక్షః ప్రియతర ఇతితర్కయామి యన్నవమాలికా పేశలాత్వ మప్యేతేషా మాలవాల సేచనే నియుక్తా"

శకుంతలా – "సఖి! నకేవలం తాతనియోగః అస్తిమమాపి ఖలు సోదరస్నేహపతేషు" (తండ్రి యాజ్ఞయేకాక, నాకును స్వతః ఈ వృక్షములయెడ సోదరప్రేమ కలదు.) ఇట్లు ఈ భావి భరతమాత యొక్క భావములో నిట్టి సహజ ప్రకృతి ప్రేమ, బాల్యముననే పాదుకొని పిమ్మట అదే విశ్వప్రేమగాఁ బరిణమించినది. మన భరతమాతయొక్క యీ ప్రకృతి ప్రేమను కణ్వర్షి ముఖమున మన కాళిదాసర్షి యిట్లు పలికించును.

---

* చెలి ఓ శకుంతలా! తండ్రియైన కాశ్యపునకు ఈ యాశ్రమవృక్షము నీకన్న నెక్కుడు ప్రియమైనదని తలంచెదను. ఎందుకనియా? నవమాలికా పుష్ప సుకుమార సదృశ సుకుమారగాత్రివైన నిన్ను కూడ (తాత) ఈ వృక్షసేచనము అను కఠినకార్యమందు నియోగించినాఁడు,

"పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాఽస్వపీతేషుయా
నాదత్తేప్రియమండనాపి భవతాం స్నేహేన యాపల్లవం।
ఆద్యేవః కుసుమప్రసూతి సమయే యస్యాభవ త్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతాం॥"
(అంకము 4 శ్లో 9)

శకుంతలను అత్తవారింటికిఁ బంపుచు కణ్వుఁడు, శకుంతలకు సెల వొసంగుఁడని ఆశ్రమ వృక్షములతో నిట్లనుచున్నాఁడు. తపోవనమున శకుంతలకు బంధువులైన యాశ్రమ వృక్షములారా! మీకు ముందుగా జలము లిడనిదే ఏ శకుంతల తాను ముందుగా జలములను ద్రావఁ దలఁచదో, పువ్వు లన్న మురిసిపోవునే శకుంతల మీయందుగల మైత్రిచే మీ చిగురుటాకు నైనఁ ద్రుంపలేదో, మీకు పువ్వు పుట్టఁ గనే ఏ శకుంతల ఉత్సవము జరిపినదో, అట్టి మీ యాప్తబంధువు, ఆ శకుంతల నేఁ డత్తవారింటికి వెళ్ళుచున్నది. మీ రామెకు సెల వొసంగుఁడు."

కాళిదాసుని ధర్మమాయని యీ భరతమాత యొక్క "విశ్వ ప్రేమ" విశ్వవ్యాప్తమై విరాజిల్లినది. ఇట్టి ప్రేమకు మూలము ఈమె యొక్క "ప్రకృతి జీవన"మే యని ప్రస్ఫుటమైనది కదా! మన భారతమాత (శకుంతల) యొక్క పుత్రులలో ధన్యాత్ములైన వారి యందే తల్లి గుణము భాసించుచుండును. ఇందులకు

"ధన్యా పితృముఖీ కన్యా ధన్యో మాతృముఖః పుమాన్॥"
అను సూక్తియే నిదర్శనము

ఓమ్

# కాళిదాస హృదయము



## ఋతుసంహారము - కవితాసామగ్రి

### ప్రకృతివర్ణనాచణత్వము

"చరాచరప్రకృతి" కవిత్వజీవితమునకు, మానవజీవితమునకు వలె మంగళాలంకారమగుచు, తజ్జీవిత వికాసమునకు విశిష్టకారణ మగుచున్నది. ఇట్టి "ప్రకృతి"ని ప్రాచ్యపాశ్చాత్య కవు లెందరో ఎన్నోరీతులుగ వర్ణించినట్లు తచ్చరిత్రలు చాటుచున్నవి. కాని యీ "ప్రకృతి"కి సుందరము ఆరాధనీయము నగు నొక ప్రత్యేకస్థానమును ప్రసాదించిన మహాకవులలో కాళిదాసమహాకవి, కనిష్ఠికపై లెక్కింపఁ దగియుండెను. ఇతఁడు తన కుమార సంభవాది * కావ్యములలో "ప్రకృతి"ని తన దివ్యకవితా కళాప్రభావముతో సుసూక్ష్మముగ సమీక్షించి, మానవ జీవితములో నీ ప్రకృతిని ఒక ముఖ్యాంగముగ దిద్దితీర్చినాడు. ఇతని కావ్యములలోని "ప్రకృతి"తో మానవ ప్రకృతికి బలిష్ఠము ఘనిష్ఠము నగు ప్రత్యేక సంబంధము సమ్మిళితమై సంశోభితమగుచుండును. ఇట్టి "ప్రకృతి - ప్రణయిత్వము"నకు నీ కవియొక్క తొలికావ్య మనఁదగిన "ఋతుసంహారము"నాంది యనఁదగియున్నది ఇందలి కవితాసామగ్రి, మున్ముందు సునిశితమై చక్కని పరిణతితో వాసియు వన్నెయు గాంచినట్లు కూడ నీ తొలికావ్యము మనకు విస్పష్టము సేయుచుండును.

ఈ చిన్ని కావ్యములో గ్రీష్మాది వసంతాంతములైన ఋతువు లాఱును వర్ణితములైనవి. ఆయా ఋతువులలో చరాచరప్రకృతి యెట్లు

---

* అస్తి కశ్చి ద్వాగ్విశేషః। అను రాకుమారియొక్క మాటను ఆధారముగాఁ గొని "అస్త్యుత్తరస్యాందిశి..."అని కాళిదాసు కుమారసంభవములో "లఘుత్రయి"ని ప్రారంభించెనందురు.

శోభించుచుండునో, జీవకోటి, తత్తదృతు ప్రభావమునుబట్టి అప్పట్టున నెట్టి విభిన్నదశలకు లోనగుచుండునో, ప్రకృతితో మానవుల కెట్టి మధుర సంబంధము కలదో ఈ విషయము లిందు దర్పణములోవలె మన యువక కాళిదాసుచే యథాతథముగఁ జూపఁబడినవి. గ్రీష్మర్తు వర్ణనముతోఁ బ్రారంభమైన యీ కావ్యాదిశ్లోకమును గాంచుడు.

"ప్రచండసూర్యః స్పృహణీయ చంద్రమాః
సదా ఽవగాహక్షత వారి సంచయః ।
దినాంతరమ్యోఽ భ్యుపశాంత మన్మథో
నిదాఘకాలోఽయ ముపాగతః ప్రియే॥ (1 - 1)

గ్రీష్మకాల ప్రకృతి ఉన్నదున్నట్లు ఇట వర్ణితమైనది. ఒక ప్రియుఁడు తన ప్రియురాలితో "ఏవం విధమైన గ్రీష్మకాలము వచ్చినది" అని తెలుపుచున్నాడు. ఇదే గ్రీష్మర్తు వర్ణనము శాకుంతల రచనము నాటికి సంపూర్ణమగు కవితాశిల్పముతో నిగ్గుదేరి, ఎంతగ ముగ్ధ మోహన మధురభావ భాసితమై పరిమళించుచున్నదో పరికింపుడు.

పై శ్లోకములోని "దినాంతరమ్యః"అను చిన్ని దళమును గొని మన కవికులగురువు శాకుంతల ప్రస్తావనలో "ఏ ఋతువును గూర్చి గానము చేయుదును?" అన్న నటీ ప్రశ్నమునకు సమాధానముగా సూత్రధారముఖమున నిట్లు పలికించును.

సూత్రధారః:— నన్విమమేవ నాఽతి చిరప్రవృత్తం ఉపభోగక్షమం గ్రీష్మర్తు మధికృత్య గీయతాం తావత్.

సంప్రతిహి :—

"సుభగసలిలావగాహాః
పాటల సంసర్గ సురభి వనవాతాః ।
ప్రచ్ఛాయసులభనిద్రాః
దివసాః పరిణామ రమణీయాః॥"

ఋతుసంహారములోని గ్రీష్మమునకు జలము లింకిపోగా శాకుంతలము లోని గ్రీష్మమునకు జలము లింకిపోవకుండుటేగాక, ప్రాణికోటికి స్నాన లాభముచే "హాయి" నిచ్చుచున్నవి. అచ్చటి గ్రీష్మపు దెబ్బకు మన్మథుఁడు కూడ శక్తిరహితుఁడుకాగా నిచ్చటి గ్రీష్మములోని వన పవనములు పాటల కుసుమ సంసర్గముచేఁ బరిమళభరితములై, మనో ద్దీపనకరములై భాసించుచున్నవి. ఇట్లిచ్చటి గ్రీష్మ వాసరములు నాఽతిచిర ప్రవృత్తము లగుటచే నుపభోగక్షమము లగుచు, జక్కని పరిణామముచే రమణీయములై, పఠితలకు సర్వేంద్రియసంతర్పణము గావించుచున్నవి.

ఇచ్చటి "పరిణామ రమణీయాః" అను పదము, "కాళిదాస కవితాకళ ఉత్తమ పరిణతితో నందరకును మనోహర మగుటకు ఈ 'శాకుంతలము' నిదర్శనము" అను విషయమును ధ్వనింపఁజేయు చున్నది. ఇట్లీ కవీశుని కవితా ప్రతిభ కుమారసంభవాదులలో మిసిమి దేరి కమనీయతఁ గాంచుటకు వలయు కవితా సామగ్రి యంతయు నీ తొలి కావ్యమునఁ బాదుకొనియున్న ట్లిచ్చటి ప్రతియొక శ్లోకము తెలుపుచున్నది. ఇందుల కొండు రెం డుదాహృతులు.

"నితాంతలాక్షారస రాగరంజితైః
నితంబినీనాం చరణై స్సనూపురైః।
పదేపదే హంసరుతాఽనుకారిభిః
జనస్య చిత్తం క్రియతే సమన్మథం॥" (ఋతుసంహారము 1-5)

"యువతులు తమ పాదములను లత్తుకరసముచే రంజితములు గావించి నడచుచు అందియల రవళితో హంసకూజితముల ననుకరింపగా ప్రియుల మానసములు మదన పరవశము లగుచున్నవి."

ఇట "హంస రుతాఽనుకారిభి స్సనూపురై శ్చరణైః" అను పదముల భావము కుమారసంభవములో నెంతటి శిల్పచాతుర్యముతోఁ జిత్రితమైనదో కనుఁడు.

"సా రాజహంసై రివ సన్నతాంగీ
గతేషు లీలాంచితవిక్రమేషు ।
వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధైః
ఆదిత్సుభి ర్నూపురశింజితాని॥ (సర్గ 1-34)

స్త్రీల యందియల రవళి హంసకూజితమువలె నున్నట్లు వర్ణించుట కవి సమయము. ప్రస్తుతమున "హంసలు, గిరిజామంజీరముల యందలి "మంజు శింజితము"అను కళను నేర్వఁదలచినవి, ఒకరినుండి ఒక కళను నేర్వఁదలఁచినవాడు గురువునకు ముందుగ నేదేని "దక్షిణ" నొసంగవలెను. అట్టి దక్షిణ నొసంగలేనిచోఁ దనవద్దగల విద్యనైన గురువున కర్పించవలెను. * ఈ సంప్రదాయమును బట్టి హంసలు గిరిజనుండి

* "గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా ।
అథవా విద్యయా విద్యా చతుర్థో నో పలభ్యతే॥"

తన్మంజీర రవళిని అభ్యసింపఁగోరి అవి గురుదక్షిణగ ముందు ఆమెకు దమ "విలాస గమనములు" అను విద్యను నేర్పినట్లుండెను. ఇట్లు కానిచో నీ గిరిజకు ఇట్టి "హంసగమనములు ఎట్లబ్బెను ?" ఇట్లు భావిలో కవి ప్రతిభా భాసితములై కవితాశిల్ప చిత్రితములైన మనోహర భావములకు బీజరూపము లీ కావ్యమున వలసినన్ని వరలు చున్నవి.

ఉదా:—వసంతర్తు వర్ణన సందర్భమున ఋతుసంహారములో

"పుంస్కోకిలః చూతరసాసవేన
మత్తః ప్రియాం చుంబతి రాగహృష్టః ।
కూజద్విరేఫో ఽప్యయ మంబుజస్థః
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటు॥" (6-14)

"పురుషకోకిలపక్షి, చూతరసమనెడు మద్యపానముచే మత్తిలి, అను రాగముతోఁ బ్రియురాలిని ముద్దిడుకొనుచున్నది. ఇట్లే పద్మమం దున్న తుమ్మెద, తన మధురకూజితములనెడు నర్మోక్తులతోఁ దన

ప్రియురాలిని యలరించుచున్నది. ఇదే వసంతర్తు వర్ణనము కుమార సంభవములో నెంత యద్భుతముగ, నెంత విశ్వమోహనముగ విలసి ల్లెనో విలోకింపుడు.

"చూతాంకురాస్వాద కషాయకంఠః
పుంస్కోకిలో య న్మధురం చుకూజ।
మనస్వినీ మానవిఘాతదక్షం
తదేవ జాతం వచనం స్మరస్య॥" (3.32)

తొలిరచనములో 6–14 వ శ్లోకములో మొదటి రెండు పాదములలోని భావము, ఇచ్చటి వసంత విజృంభణములో నాల్గుపాదములలో విరిసి, వికసించి, సర్వసమ్మోహనముగ రంజిల్లినది. అట పుంస్కోకిలయొక్క కైపువలని ఫలము, ఒక్క తన ప్రియురాలివఱకే పరిమితము కాగా; నిచ్చటి వసంతములోని పుంస్కోకిలయొక్క, చూతాంకురాస్వాద కషాయ కమనీయ కంఠకూజితము, యావన్మహిళాప్రపంచమునకుం దన్మానవిఘాతదక్షమైన మదనుని యాజ్ఞావచనమై చిత్తచోరకముగ వినిపించుచున్నది ఇట్లు ఇట ఉద్దీపన విభావవర్ణనముచే తత్ఫల రూపమైన మన్మథవచనము శ్రవణగోచరమగుచు, తద్విభావ వర్ణనముయొక్క యౌద్ధత్యము ధ్వనితమగుచున్నది. ఇంక ఋతుసంహార పద్యము (6–14) లో మూడు నాల్గు చరణములలోని భావము కుమార సంభవములో నిట్లు రసగుళికగా మారినది.

"మధుద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః।...." (3-36)

అట భ్రమరప్రియుఁడు ఒక్క తన కూజితములచేతనే ప్రియురాలిని సంతోషపెట్టుచున్నాఁడు. కనుక నట వారి పరస్పరప్రీతి మాటలవఱకే పరిమితము. కాని యిచ్చటి భ్రమరప్రియుఁడు వసంతర్తు విజృంభ ణముచే రసపరవశతఁ జెంది, రసానుభూతిలాభమునకై తన ప్రియు

రాలితోఁ గలిసి కుసుమైకపాత్రలో సర్వేంద్రియసంతర్పణముగ మకరందమును ఆరగించుచున్నాడు. ఈ వర్ణనముతో రసానుభూతి లాభము ఒక్క భ్రమరదంపతులకే కాక, పఠితృదంపతులకుఁ గూడ తద్రసానందాఽనుభవము సులభప్రాప్య మగుచున్నది.

"........సద్యః పర నిర్వృతయే........"

అన్న సత్కావ్య ప్రయోజన మిట్టిపట్టులందే పఠితృ లోకమునకుఁ బ్రాప్తమగుచున్నది.

ఇట్లు పశుపక్ష్యాదుల భావములనుగూడ పై విధముగ రసపర వశతఁ గావించిన యిచ్చటి వసంతవిజృంభణమునకు మహర్షుల మానసములే మోహముఁ జెందినవి. * ఇట్టి తరుణమున మానవుల మానసముల గతి చెప్పవలెనా ? ఇట్టి సర్వసమ్మోహనకర వసంతప్రకృతివర్ణనమునకు వలయు కవితాసామగ్రి యీ కవీశునకు ఋతుసంహారములోని 6-14 శ్లోకములో పాదుకొని యున్నదనుటలో సందేహము లేదు. ఇట్టి భావములను, శయ్యారీతులను బ్రకటించు శ్లోకములు ఈ చిన్ని కావ్యములో నంతటను గనుపించుచునే యుండును.

"జ్వలతి పవనవృద్ధః పర్వతానాం దరీషు।........
గ్లపయతి మృగవర్గం ప్రాంతలగ్నో దవాగ్నిః॥ (1-26)

ఈ శ్లోకములోని శైలీరీతి శాకుంతలము నాటికిఁ జక్కని పరిణతిఁ గాంచి క్రమకవితాసామగ్రితో నిట్లు సొంపెక్కినది.

"తీవ్రాఘాత ప్రతిహత తరుస్కంధలగ్నైకదంతః।
ధర్మారణ్యం ప్రవిశతి గజఃస్యందనాఽలోకభీతః॥" (1-31)

ఇఁక శ్రీమద్వాల్మీకి రామాయణములో ప్రస్రవణ పర్వతవర్ణన చేయుచు నాదికవి వర్షర్తువును గూర్చి

---

* "ప్రయత్నసంస్తంభిత విక్రియాణాం కథంచిదీశా మనసాం బభూవుః" (కు. సం. 3-34)

"........గిరిశృంగ మిదం రమ్యం........
మయూరరవనాదితం। మాలతీకుందగుల్మైశ్చ సింధువార
కురంటకైః। కదంబార్జునసర్జైశ్చ పుష్పితై రుపశోభితం"

పై రామాయణ వర్ణనమును మనమున నిడికొని కాళిదాసు తన తొలి కావ్యములో వర్షర్తువులోని పర్వతములను వర్ణించుచు

"సితోత్పలాభాంబుద చుంబితోపలాః
సమాచితాః ప్రస్రవణై స్సమంతతః।
ప్రవృత్తనృత్యై శ్శిఖిభి స్సమాకులాః
సముత్సుకత్వం జనయంతి భూధరాః॥" (ఋతుసం. 2-16)

"కదంబసర్జార్జున కేతకీవనం
వికంపయం స్తత్కుసుమాధివాసితః।
ససీకరాంభోధరసంగశీతలః
సమీరణః కం న కరోతి సోత్సుకం॥" (ఋతుసం. 2-17)

"మాలాః కదంబ నవకేసర కేతకీభిః
ఆయోజితాః శిరసి బిభ్రతియోషితోఽద్య........"
(ఋతుసం. 2-20)

ఇట్లు రామాయణ వర్ణనమునకు శైలిలోను, * భావములోను దుల్యములగు రచనము లీ చిన్ని కావ్యములో నింక నెన్నో యున్నవి. (చూ. ఋతుసం. 2 సర్గలో 23, 24 శ్లో) శరత్కాలములో నదిని వర్ణించు పట్టున వాల్మీకిమహర్షి కిష్కింధా కాండమున (27 సర్గ)

"వాసీరై స్తిమిశై శ్చైవ వకుశైః కేతకై ర్ధవైః।
వసనాఽభరణోపేతా ప్రమదే వా భ్యలంకృతా।........

* శైలిలో రామాయణం కిష్కింధాకాండ 28 సర్గ శ్లో 21. ఇదే శైలి ఋతుసంహారములో సర్గ 4 శ్లో 8, 9 లలోను గలవు.

పులినై రతిరమ్యైశ్చ హంససారససేవితైః ।
ప్రహసంతీవ భాత్యేషా నారీ సర్వవిభూషితా ।
రమణీయా నదీ సౌమ్య మునిసంఘై ర్నిషేవితా॥"

తన కవితకు మార్గదర్శకమైన పై రామాయణ కవితయందుగల భక్త్యా దరముచేతనే కాళిదాసు తన యీ ప్రకృతివర్ణన కావ్యములో, శరత్కాలమును వర్ణించుచు

"కాశాంశుకా వికచపద్మమనోజ్ఞవక్త్రా
సోన్మాద హంసరవనూపురనాదరమ్యా ।
ఆపక్వశాలిరుచిరా తనుగాత్రయష్టిః
ప్రాప్తా శర న్నవవధూ రివ రూపరమ్యా॥" (3-1)

"చంచన్మనోజ్ఞ శఫరీ రశనా కలాపాః
పర్యాప్త సంస్థిత సితాండజపంక్తిహారాః ।
నద్యో విశాలపులినాంత నితంబ బింబాః
మందం ప్రయాంతి సమదాః ప్రమదా ఇవాఽద్య॥" (3-3)

"చక్కని రూపముతో నొక నూత్న యువతివలె శరత్కాలము వచ్చినది." కనుక నిందలి విశేషణములన్నియు శరద్యువతులకు సరిపోవును చూడుడు. "శరల్లక్ష్మి, రెల్లుపువ్వులనెడు చక్కని తెలుపుచీరెను ధరించినది. వికసించిన పద్మములనెడు మనోహరమైన ముఖము కలది. మదించిన హంసలయొక్క కూజితములనెడు అందెలరవళితో రమణీయమైనది. ముగ్గబారిన శాలిధాన్యసంపదతోఁ జూడముచ్చట గొలుపునది. ఇట్టి శరదృతువు రమణీయరూప రమ్యయగు రమణివలెనే తెంచినది." (3-1) ఈ శరత్కాలములో నదులు (వరదలు తగ్గుటచే) మత్తలైన స్త్రీలవలె మందగతులతో వయ్యారముగ నడచుచున్నవి. ఇందలి విశేషణములు కూడ వాహినీ వనితలకుఁ దుల్యములు. నదులు కూడ తమ కటిభాగమున, స్త్రీలవలె మెఱసెడు

మత్స్యము లనెడి మొలనూలు కలవి. ఇవి తమ తటములందు బారులు కట్టియున్న తెల్లని పక్షు లనెడి ముత్యాలహారములు కలవి. విశాలము లగు నిసుకతిన్నెలనెడు పెద్ద పిరుందులు కలవి. కనుక నిట్టి నదులు కూడ వర్ణిత స్త్రీలవలె మందముగ నడచుట సహజమే కదా!

ఈ నదీవర్ణనమునకు రామాయణములోని నదీవర్ణనమందలి

"వసనాభరణోపేతా ప్రమదేవా భ్యలంకృతా........"

మున్నగు వాక్యములు మూలములని భావించవచ్చును. పై "వసన" శబ్దార్థము ఋతుసంహారములో, నిదేసందర్భమున "కాశాంశుకా" అను వాక్యములోఁ గలదు. (చూ. 3-1) ఇక ఋతుసంహారములో నీ యాద్య శ్లోకభావము, కవితాప్రతిభతోఁ బ్రకాశించుచు కుమార సంభవములో నెంతటి ప్రౌఢమై రాణించుచున్నదో తిలకించుడు.

"తయా ప్రవృద్ధాననచంద్రకాంత్యా
ప్రఫుల్లచక్షుఃకుముదః కుమార్యాః ।
ప్రసన్నచేతస్సలిల శ్శివోఽభూత్
సంసృజ్యమాన శ్శరదేవలోకః॥ (కు. సం. 7-74)

పరమేశ్వరుఁడు మధుపర్కములను ధరించిన పిమ్మట పార్వతీదేవియున్న పెండ్లిపీటమీఁదఁ గూర్చుండును. ఇట్లు పార్వతీదేవితోఁగూడిన పరమేశ్వరుఁడెట్లుండెనో యీ శ్లోకమున మన మహాకవి చూపినాడు. కనుల పండువుగఁ గాంచుడు. "ఇప్పటి యీశ్వరుఁడు గిరిజతోఁగూడి, శరత్కాల లక్షణములతోఁగూడిన లోకమువలె నుండె" నని పై శ్లోక భావము. గిరిజకూడ శరత్కాలమువలె నధికమైన ముఖ చంద్రకాంతి కలది. ఈ చంద్రకాంతి సంబంధముచే నీశ్వరనేత్ర కువలయములు వికసించినవి. ఇక శరత్కాలములో జలములు * తేరుకొనును.

---

* శరత్కాలములో అగస్త్యోదయముకాగానే యుదకములు తేరుకొనునని కాళిదాస సూక్తి "ప్రససాదోదయాదంభః కుంభయోనే ర్మహౌజసః" (చూ. రఘువంశము 4-21)

ఇట్లే శరత్కాలమువంటి గిరిజయొక్క సంసర్గముచే నీశ్వరుని మానస జలములు ప్రసన్నములయ్యెను. ఈ విధముగా శరత్కాల సంపర్కముచే లోకము, శరల్లక్షణములు కలిగియున్నట్లు శరలక్ష్మి వంటి గిరిజయొక్క సంపర్కముచే ఈశ్వరుఁడను లోకము శరల్లక్షణ ములు కలిగియుండెను. ఔరా! ఎంతటి స్వారస్యముతో కూడిన దీ భావసంపద! గిరిజ ప్రకృతి స్వరూపిణి. కనుక శరత్కాల ప్రకృతి, ఈ ప్రకృతిరూపిణికంటె వేరుకాదు. ఈ పరమార్థము ప్రకటించుటకే కాళిదాసు గిరిజను శరత్కాలముతో రూపించినాడు. ఇట్లే పరమేశ్వ రుడు విశ్వేశ్వరుడు; విశ్వభర్త; లోకేశ్వరుఁడు. కనుక పరమేశ్వరుఁడు లోకస్వరూపుఁడు. కాన "ఈశ్వరలోకము" అని యీ కవీశుఁడు ఈశుని రూపించినాఁడు.

"కాలో హి జగదీశ్వరః"

అను సూక్తినిబట్టి ఈశ్వరుఁడే కాలపురుషుఁడు. ఇట్టి కాలము కాల లక్షణములతోఁ గూడి సంపూర్ణత్వమును బడసినది. దీనితో ప్రకృతి పురుషులు ఏకమైనారు. ఇటుపైని జరుగవలసినది సృష్టి. ఇట్టి కమ నీయసృష్టికి, ఆదికవి వాల్మీకిమహర్షి పిమ్మట, ఈ మహర్షి యడుగు జాడలలో గమించిన కాళిదాసే వలంతి. ఇట్టి ప్రకృతి దేవతారాధన ముతో కవికి నాముష్మికసిద్ధి కూడ చేకూరుచున్నది. ఐహికముగా మానవజీవితము ప్రకృతిజీవితముతో నైక్యముచెందినపుడే మానవ జీవితమునకు సంపూర్ణత్వము సిద్ధించునని "కాళిదాస హృదయము." ఈ యుదాహరణము చూడుడు.

"ప్రభిన్నవైడూర్యనిభై స్తృణాంకురైః
సమాచితా ప్రోత్థితకందలీదలైః।
విభాతి శుక్లేతరరత్నభూషితా
వరాంగనేవ క్షితి రింద్రగోపకైః॥" (ఋతుసం. 2-5)

"వర్షాకాలములోని భూమి, బాలతృణాంకురములతో నలంకృతమై, వైడూర్యాది వివిధ రత్నములతో నలంకృతయైన వేశ్యాకాంతవలె నుండెను" అనఁగా వివిధ కాంతులతో నొక్కొక్కతరి నొక్కొక్క తీరుగా విరాజిల్లుచుండెను. ఇట తెలియఁదగిన విశేషము లివి. "వైడూర్య" శబ్దమునకు "వైదూర్య" అని రూపాంతరము కలదు. అనఁగా విదూర దేశమునందుఁ బుట్టిన రత్నము వైదూర్యము. ఇదే వైడూర్యము. "విదూర దేశమునందుఁ బుట్టిన రత్నము" అని శబ్ద రత్నాకరము" తెలుపుచున్నది. పై తొలి కావ్యశ్లోకములో "ప్రభిన్న వైడూర్య నిభైః......" అని "ప్రభిన్న" విశేషణము ప్రయుక్తమైనది. దీనికి "మొలచిన" అను నర్థము చెప్పవచ్చును. ఈ విషయమే కుమారసంభవములో నెంతచక్కఁగ చిత్రితమైనదో! చిత్తగించుడు.

> "తయా దుహిత్రా సుతరాం సవిత్రీ
> స్ఫురత్ప్రభామండలయా చకాశే।
> విదూరభూమి ర్నవమేఘశబ్దా।
> దుద్భిన్నయా రత్నశలాకయేవ॥" (కు. సం. సర్గ 1 శ్లో 24)

"పుట్టిగదిలో కాంతిమండలముతో దీపించెడు పుత్రికతోఁ గూడిన మేనక, క్రొత్తదైన మేఘధ్వనిచే భూమినుండి పుట్టుకొనివచ్చిన రత్నపుమొలకచేఁ బ్రకాశించెడు విదూరపర్వతప్రాంత భూమివలెఁ బ్రకాశించెను" ఈ వైడూర్యోత్పత్తికి నిదర్శన మిట్లున్నది.

> "అవిదూరే విదూరస్య గిరే రుత్తుంగరోధసః।
> కాకతాలీయ సీమాంతే మణీనా మాకరోభవేత్॥" (బుద్ధోక్తి)

ఇట్లు తొలికావ్యములోని కేవల "ప్రభిన్న" శబ్దము మలికావ్యములో నింత నిగ్గుదేరి కావ్యకళతో కమనీయముగఁ బ్రకాశించినది. అట నింత నిగ్గుదేరి కావ్యకళతో కమనీయముగఁ బ్రకాశించినది. అట భూమాతయొక్క కేవల బాహ్యరూపమే కవికిఁ గోచరమైనది. అదే

భావమిట అమూల్యముగఁ బరిణమించినది. విదూరభూమి, వైడూర్య మణిపుట్టినపుడే విశిష్టరీతితో విరాజిల్లును. అప్పుడే ఆ భూమికి 'జననీ' పదము సార్థకమగును. అపుడమి కపుడే "రతనాలబొజ్జ" అను ప్రపంచ ప్రశస్తి ఫలవంతమగును. ఈ భూమివలె మేనకయు నీ పుత్రికారత్నము యొక్క యుదయముచే "సవిత్రీ" శబ్దభాజనయై విలక్షణశోభతో విరాజిల్లెను. ఇఁక ప్రకృతిరూపములైన సర్వోషధులయొక్క యుత్పత్తి కిని తల్లియగు భూమాత, ఈ యుపమానముచే ప్రపంచ జనులకు సంసేవ్య అగును. ఇట్లే ప్రకృతిరూపిణియగు పార్వతికి తల్లియగు మేనక కూడ అంతటి ప్రపంచాదరమునకుఁ బాత్రయగుచున్నదని యిచ్చటి యుపమానము ధ్వనింపఁజేయుచున్నది.

ఇట్లీ తొలికావ్యము శైలిలోను, భావపరిణతియందును "ఇది కాళిదాసుయొక్క తొలికావ్యము" అను విషయమును బ్రకటించు చుండెను. "ఈ కావ్య మీ కవిది కాదు" అనుకొనువారి కీ తొలికృతిలో ప్రతియొక శ్లోకము "ఈకావ్య మీతనిదే" యని చక్కఁగ సాక్ష్య మిచ్చుచుండెను.

సామాన్యదృష్టికి నీరసముగాఁ దోచు సామాన్య విషయములు సైతము కవితాకళచే చెలువముతో సొంపెక్కి, చవులు గొల్పుచుం డును. ఇదే కవితాతత్త్వము ; ఇదే కవితయందలి తీయందనము. ఇట్టి తీయందనమును మిటారించు మెత్తందనమే కవితాకళ కొక యందము. గడ్డిపఱకలుసైతము కవితామణి దర్పణమునఁ బ్రతిబింబించి వింత రుచు లొలికించుచు లోకహితబోధనములో ప్రపంచమునకే ప్రతినిధు లుగఁ బ్రకాశించును. ఇట్టి పట్టులందే కావ్యము కాంతాసమ్మితమై యుత్తమోపదేశముతో లోకకల్యాణకారక మగును. కాళిదాసకావ్య ములన్నియు నిట్టివే యనుట ఇట ముఖ్యవిషయము.

ఇఁక ఋతుసంహారములోని ఋతువర్ణనలందు గల కొన్ని శ్లోక ముల భావమును జూపి యీ విషయమునుండి విరమించెదను.

# గ్రీష్మర్తు వర్ణనము (ప్రథమసర్గ)

ఓ ప్రియా! ఇదిగో గ్రీష్మకాలము వచ్చినది. ఈ కాలము ప్రచండ సూర్యుఁడు, కోరఁదగినచంద్రుఁడు గలది. ఈ కాలమున అందరును సర్వదా స్నానములు చేయుటచే నంతటను దఱఁగిన జలములు కలది. ఇప్పటి ప్రకృతి, సంధ్యాకాలములందు రమ్యమైనది. శాంతించిన మన్మథుఁడు కలది. (1-1)

"ఓ ప్రియా! * ఈ గ్రీష్మర్తువులో మండుటెండల కాకచేఁ దపింపఁబడిన భూమినుండి దుమారములతోఁ గూడిన సుడిగాలులు మండలాకారముగ లేచి వ్యాపించుచున్నవి. ఇట్టి భూమి, ప్రియా విరహసంతప్త హృదయులగు పథికులకుఁ జూచుటకునైన శక్యము కాకున్నది. (1-10)

## గ్రీష్మర్తువులోని మృగములు – జంతువులు

"ఈ గ్రీష్మకాలములో వనములలోని లేళ్ళు మండుటెండలచేఁ దపింపఁబడి, అధికమైన దాహముచే నెండిన దౌడలుకలవై, తమకు కొలదిదూరములో నగపడుచున్న నల్లని కొండనుజూచి "అదియే నీరు" అనుకొని యింకొక వనములోనికిఁ బరుగిడుచున్నవి." (1-11)

"విలాసవతులు మోహజనకములగు తమ విలాసలచేతనుఁ, చిర్నగవులచేతను, కొంటెచూపులచేతను విరాళిగొన్న పథికజనుల హృదయములందు, చంద్రాలంకృతలైన సంధ్యాకాంతులవలె మన్మథో ద్దీపనమును గల్గించుచుండిరి." (1-12)

"ఈ కాలములో సూర్యకిరణములచేఁ దపింపఁబడినసర్పము, మార్గమందు కాలినదుమ్ముచే మిక్కిలి కాలుచున్న పొట్టకలదై, వంచిన

* ఈ కావ్యములో ఈ సంబోధనమంతటను అనువర్తించుకొనఁ దగినది.

తలయు, వక్రగమనము కలదై మాటిమాటికి నోగర్చుచు నెట్లో వెళ్ళి, నెమిలిపింఛము క్రిందికి జేరుకొనుచున్నది." (1-13)

"సింహము, గొప్పదాహముచే క్షీణించిన పరాక్రమముకలదై, యెక్కువగ నోగర్చుచు, దూరముగచాపిన నోరుకలదై నాలుక నాడించుచు, జూలు కంపింపఁజేయుచు, దన సమీపముననున్న నేనుంగులనుసైతము చంపనుంకించుటలేదు". (1-14)

"ఇట్టి గ్రీష్మమునకుఁ బాల్పడిన యేనుంగులు గాలిపుదెబ్బకు లోనై, పిపాసతో నీటిని వెదకుచు ప్రక్కనున్న సింహములకుఁ గూడ నివి భయఁపడుటలేదు." (1-15)

"నిప్పువంటి సూర్యకిరణములచే వాడిన బాహ్యాంభ్యంతరములు కల నెమిళ్ళు, తమ పింఛములలో తలలు దాచికొనియున్న సర్పములను సైతము చంప నుంకించుటలేదు." (1-16)

"వరాహగణము ఇప్పటి యెండకు గ్రాగి ఎండిన సరస్సులను దమ పెద్దముట్టెలతో త్రవ్వుచుండగా, "నవి భూమిమీద నుండజాలక పాతాళమునకు బోవుటకో" యనునట్లు వాని యా త్రవ్వక మగపడు చుండెను." (1-17)

"మండుటెండలకు ఉడికిన సరస్సులలోని బురదనీటినుండి కప్పలు ఎగిరివచ్చి, దప్పిగొన్న సర్పముయొక్క పడగగొడుగు నీడకు వచ్చియున్నవి." (1-18)

"మహిషము లీగ్రీష్మముచే పిపాసాపీడితములై చాపిన తమ నోటినుండి తెల్లని నురగలను గ్రక్కుచు, నెఱ్ఱని నాలుకలను చాపి, నీటికై తలలెత్తుకొని, కొండగుహలనుండి పైకి వచ్చుచున్నవి."(1-21)

"ఆకులన్నియు రాలిన చెట్లపై పక్షిగణము నిద్రించుచున్నది. కపికులము పొదరిండ్లకుఁ జేరుకున్నది. చమరీమృగములు నీటికై నలువైపులకుఁ దిరుగుచున్నవి. శరభమృగతతి తమ వక్రత మాని నూతినుండి నీటిని అందుకొనుచున్నది." (1-23)

## దావాగ్ని వర్ణనము

"వికసించిన కుసుమపువ్వు * వలెను చిందూరము వలెను అధికారుణ కాంతికల దావాఽగ్ని, ప్రబలమైన వనపవనవేగముచే వేగముకలదై, ప్రక్కనున్న వృక్షాలతాదుల నాలింగనము చేసికొనుట యందు తొందరకలదై అన్నివైపులనున్న భూములను తగులఁబెట్టు చున్నది." (1-24)

"వనములో నొకచోట పుట్టిన యగ్ని పర్వతగుహలనుండి వీచిన గాలికి ప్రవృద్ధమై మండుచున్నది. ఇట్టి దావాఽగ్ని, ఎండిన వెదురుపొదలను జేరి ఫెళఫెళధ్వనుల గావించుచు వెన్వెంటనే యెండిన గడ్డిబీడులను జేరి తగులఁబెట్టుచు, నా ప్రాంతములందున్న మృగముల నన్నిటిని నశింపఁ జేయుచున్నది." (1-25)

"ఈ దావాగ్ని బూరుగుచెట్ల వనముఁజేరి పెరిగి పెద్దదై అచ్చటి వృక్షముల తొర్రలలో జేరి మండుచు, బంగరుకాంతికలదై ప్రకాశించు చున్నది. ♦ ఇంకను నిది గాలికి వ్యాపించి ఎండుకొమ్మలనుండి పాకుచు వనమంతయుఁ దిరుగుచున్నది." (1-26)

"ఇట్టిదావాఽగ్నిచే తపింపబడిన గజ, గవయ, సింహాది మృగములు తమ పూర్వపు వైరమును విడిచి, మిత్రులవలె నొండొరులు గలిసినవై, కాలిన భూములను విడిచి నదీప్రాంతము జేరుచున్నవి." (1-27)

## వర్షర్తు వర్ణనము

"ఓ ప్రియురాలా! కాముజనులకుఁ బ్రియమైన వర్షాకాలము రాజలక్షణములతో కూడివచ్చినది. అదెట్లందువా? రాజువలె నిదియు నల్లని మేఘములనెడు మదించిన యేనుగులు కలది. మెఱుపులనెడు

* చూ. "నామలింగాను శాసనము" అను అమరకోశము.

♦ తొర్రలోమంటు మంట తెల్లగా నుండును. ఇది కాళిదాసుయొక్క ప్రకృతి పరిశీలనకు పరమ ప్రమాణము.

జండాలును, ఉరుములను భేరీధ్వనులును ప్రత్యేకమైన శోభయుం గలది. కనుక నీ వర్షాకాలము వచ్చుచున్నరాజువలె నున్నది.'' (2-1)

''మేఘములచేత ఆకాశ మన్నివైపులను ఆవృతమై యుండెను. ఆ మేఘములు కొన్నిచోట్ల నల్లకల్వరేకుల కాంతిని పోలియున్నవి. కొన్నిచోట్ల కాటుకరంగును, మరికొన్నిచోట్ల గర్భిణీ స్త్రీల స్తనా గ్రముల కాంతిని కల్గియున్నవి.'' (2-2)

''మేఘములు, మెఱుపు లను నారిత్రాడుకల యింద్రధనుస్సుల నుండి, వర్షధార లనెడు బాణవర్షముచే పథికుల మానసములను క్లేశ పఱచుచున్నవి.'' (2-4)

''ఈ వర్షాకాలములో భూమి, వైడూర్య మణులను బోలిన పచ్చగడ్డి మొలకలచేతను, అరటియాకుల కాంతులచేతను, ఆరుద్ర పుర్వులచేతను సంతటను వ్యాప్తమై, అన్నిరకముల రత్నములచేతను నలంకృతయైన వేశ్యా స్త్రీలవలె ప్రకాశించుచుండెను.'' (2-5)

''ఈ కాలములో నెమిలిగుంపులు మనోహర మేఘధ్వనుల కాశించుచు సంభ్రమములతో తమ పింఛములను విప్పి నృత్యములు సల్పుచున్నవి.'' * (2-6)

''ఇప్పటి నదులు, బురదనీటి ప్రవాహ వేగముచేత తమ నాశ్రయించిన తీరస్థ వృక్షములను గూలద్రోయుచు, జాతిమాత్ర విలాసలతో కూడిన దుష్టస్త్రీలవలె తొందరగా సముద్రుని గూర్చి పయనించు చున్నవి.'' (2-7)

''వింధ్య వనభూములు, చిగర్చిన చెట్లచేతను, లేళ్ళ నోటి నుండి జారు ఇంద్రనీలముల కాంతికల లేత పచ్చగడ్డి పరకలచేతను నలంకృతములై, చూపరుల చిత్తమును చూరగొనుచున్నవి.'' (2-8)

''ఈ సమయాన అభిసారికా స్త్రీలు, మేఘములచే నంధకార బంధురములైన రాత్రులందును మెఱుపుల కాంతిచే చూపబడిన

* మయూర వర్ణనము మన కవికి ఎక్కువ మక్కువ కలదు.

మార్గములు కలవారై, అనురాగముతోఁ బ్రియులఁగూర్చి వెళ్ళు చుండిరి." (2–10) *

"ప్రవాసముఁగొన్న పతులు కల స్త్రీలు సర్వాలంకారములను విడిచి, నిరాశలై యుండిరి." (2–12)

"అడవియేనుఁగులు క్రొత్త మేఘధ్వనులచే మదించి గర్జించు చున్నవి. కల్వాలవంటి వీని కపోలప్రదేశములందలి జలములకై తుమ్మెదలు మూఁగుచున్నవి."

"ఈ కాలములోఁ పర్వతపుచరియలు నల్లని మేఘములచే నావృతములై ప్రవాహములతోఁ గూడియుండి చూపరులకు ఔత్సుక్యము నుదయింపఁజేయుచున్నవి." (2–16)

ఇప్పటి గాలులు "కదంబసర్జ, అర్జున పుష్పములయొక్కయు, మొగలిపువ్వులయొక్కయు వనములమీదినుండి వీచుచు, మేఘజల బిందుసంగశీతలములై యుండెను. ఇట్టి పవనములు ఎవరికి "హాయి"ని కల్గింపవు ?" (2–17)

"ఇక్కాలమున మెఱుపుఁ దీగలచేతను ఇంద్రధనుస్సుచేతను నలంకృతములై, నీటిబరువుచే కొంచెము వంగిన మేఘములును, మణి మేఖలా కాంత్యుజ్వలలైన స్త్రీలును సమముగ ప్రవాసాఽగతులైన జనుల మానసములను నొక్కుమ్మడిగ హరించుచుండిరి." (2–19)

"కస్తూరి కలిపిన మంచిగంధమును దమమేనికిఁ బూసికొని, పూలమాలలతోఁ బరిమళించు కేశభరముకల యువతులు, సాయం సమయమున మేఘధ్వనిని వినినవెంటనే వారి మామలుండు నివాసము వీడి తమ శయనాఽగారములను జేరుకొనుచుండిరి." (2–20)

"వింధ్యపర్వతము, నవమేఘములకు ఆశ్రయమిచ్చినది. కనుక నీ యాశ్రయదాతకు ఆ మేఘములు, గ్రీష్మాఽతపాఽగ్ని జ్వాలలచేఁ గల్గిన సంతాపమును దమ వర్షోదకముచేఁ జల్లార్చి ప్రత్యుపకృతిగా

---

* "దుర్దినేష్వభిసారికాః" అని పైశ్లోకభావమే కుమారసంభవమున వర్ణితము.

వింధ్యను సంతోషపెట్టుచున్నట్లున్నవి.'' (2-27) *

## శరద్వర్ణనము

''ఈ శరత్కాలములో వికసించిన తెల్లుపూలచే భూభాగము తెల్లఁగఁ దేజరిల్లుచున్నది. ఇట్లే శరచ్చంద్రునిచే రాత్రులు, హంసలచేత జలములు, కలువలచేత సరస్సులు, పుష్పభారనమితములైన యేడాకుల యరటిచెట్లచే వనాంతములు, మాలతీపుష్పములచే ఉపవనములు తెల్లఁగఁ జేయఁబడినవి.'' (3-2)

''శరత్కాలమేఘములు వీరాభావముచే గాలి కిటునటు దిరుగుచు వెండి, సంకు, తామరతూండ్లవలెఁ దెల్లఁగ నుండగా, చామరములచే వీచబడుచున్న రాజువలె నుండెను.'' (2-4)

''ఈ శరత్కాలములో రజనీకాంత, నక్షత్రసముదాయమనెడు నక్షత్రహారమును ధరించి, మేఘాచ్ఛాదనలేని చంద్రుఁడను చక్కని ముఖముకలదై, వెన్నెలయను సన్నని తెల్లచీరెను సింగారించుకొని ప్రతిదినము బాలవలె వృద్ధినొందుచున్నది.'' (3-7)

ఇచ్చట ప్రకృతిజీవనముతో మానవదైవందిన జీవితమును మేళవించి, యేతన్ముఖమున నిద్దానిని మహితవికాసవంతముగ దిద్దితీర్చుటలో నిట్టి వర్ణనలు కాళిదాసకవికిఁ బరమోపకారకములై యీ కవీంద్రుని, ప్రకృత్యారాధకునిగాఁ బ్రకాశింపఁ జేసినవి. మఱియు

''ఇక్కాలమున నదులయందలి తరంగపంక్తులు కారండవపక్షుల ముఖములచే రెండుగా చేయఁబడినవి. నదులతీరప్రదేశములు కాదంబ, సారసపక్షిపంక్తులచే సమ్మర్దములై యున్నవి. ఇంకను పద్మపరాగములచే నెఱ్ఱవారియున్న యిట్టి నదు లంతటను హంసలకూజితములచే జనులకుఁ బ్రీతిపాత్రము లగుచున్నవి.'' (3-8)

---

* ''వింధ్యాద్రి'' మనకవి నాకర్షించినది. కనుక నిద్దాని వర్ణన, ఈ కవి కావ్యములలోఁ దఱచుగా స్థానము కల్పించుకొన్నది. ఈ వర్ణనలలోని కల్పనలు బీజభూతములై మున్ముందు వికసించి విరాజిల్లినవి.

"ఇక్కాలమున మధురనృత్యగీతములను మానిన మయూరములను మన్మథుఁడు విడిచి, మధురగీతములతో మదించిన హంసలను ఆశ్రయించెను. కదంబ, కుటజ, అర్జున, సర్జనీపవృక్షములను విడిచి పుష్పశోభ, ఏడాకులయరటి నాశ్రయించినది." (3-13)

* "ఈ సమయమున భూప్రదేశములు ధాన్యసంపదతో నావృతములై యందగించుచుండెను. బలిసిన గోకులముచేఁ బ్రకాశించుచుండెను. సారసపక్షిసంయుక్తమైన హంసనాదములచే బ్రతినాదితములగుచుండెను. ఇట్టి భూప్రదేశములు జనులకు ఉల్లాసము నుదయింపఁ జేయుచుండెను." (3-16)

"ఈ శరత్కాలములోని హంసలచే స్త్రీలయొక్క సుకుమార సులలితగమనములు జితములైనవి. ఇట్లే యిప్పటి వికసితపద్మములచే స్త్రీముఖచంద్రకాంతియు, నల్లకలువలచే స్త్రీల విలాస విరాజిత విలోకనములును, చిన్ని తరంగములచే స్త్రీల కనుబొమల విలాసములును జయింపబడినవి"

శరల్లక్ష్మిని, మదవతియగు కామినిగా మనకవి చిత్రించిన సందర్భములో

"ఈ శరత్కాలలక్ష్మి, వికసితకమలము లనెడు ♦ చక్కని ముఖముకలది. వికసించిన నల్లకల్వపూ లనెడు నిడుదకన్నులు కలది. క్రొంగ్రొత్తగ వికసించిన తెల్లుపూ లనెడు తెల్లని చీరెను ధరించినది. వికసితసితకుముదములనెడు చక్కని కాంతి కలది. కనుక కామినివలె నున్న యీ శరత్కామిని బాటసులకుఁ బ్రియపాత్రమగుఁగాక". దీనితో నీ శరద్వర్ణన ముగియును.

---

* ఈ పద్యశైలిని బోలిన శైలి యీ కవి కావ్యాంతరములలో వికసించి విరాజిల్లినది. ఈ శైలికి రామాయణము మూలము.

♦ "వెయ్యి రేకులు కలది "కమలము". చూ. అమరము. "సహస్రపత్రం కమలం శతపత్రం కుశేశయం".

## హేమంతవర్ణనము

"ఈ హేమంతము, పైకిలేచిన కోటాకులతో, వంగిన వెన్నులతో వరలుచున్న వరిచేలుకలది. వికసించిన లుద్దుగచెట్లును, ముగ్గిన ధాన్యము, లుప్తమైన పద్మశోభయు, వ్యాపించు మంచును గల హేమంతకాలము ప్రియా! వచ్చినది." (4-1)

"ఈ ఋతువులోఁ గొన్ని భూభాగములు, అధికమైన ధాన్య సంపదతో వ్యాప్తములై యున్నవి. మఱికొన్ని భూభాగములు ఆడలేళ్ళ గుంపులతో నలంకృతములై యున్నవి. ఇంకొక కొన్ని భూభాగములు మనోహరములగు క్రౌంచ ♦ పక్షుల ధ్వనులతోఁ ప్రతిధ్వనితములై యున్నవి. ఇట్టి వివిధ భూభాగములు చూపరుల చిత్తములను జూరగొనుచున్నవి. (4-8)

ఈ భావముకల మూలశ్లోకము వినుఁడు.

"ప్రభూతశాలిప్రసవై శ్చితాని
మృగాంగనాయూధవిభూషితాని।
మనోహరక్రౌంచనినాదితాని
సీమాంతరా ణ్యుత్సుకయంతి చేతః॥" (4-8)

ఇదే శైలి రఘువంశ మహాకావ్యములో నిట్లు వికసించినది.

"సపల్వలోత్తీర్ణవరాహయూథా
న్యావాసవృక్షోన్ముఖబర్హిణాని।
యయౌ మృగాధ్యాసితశాద్వలాని
శ్యామాయమానాని వనాని పశ్యన్॥" (2-17)

పై రఘువంశశైలికి రామాయణశైలి మూలము.

చూ. కిష్కింధాకాండ 28 సర్గ 21 శ్లో.

---

♦ కొంగలు.

"వర్షోదకాఽఽప్యాయితశాద్వలాని
ప్రవృత్తనృత్తోత్సవబర్హిణాని ।
వనాని నిర్వృష్టవలాహకాని....॥"

"ఇఁక ఈ హేమంతకాలములో సరస్సులు, వికసితనీలోత్పలముల చేతను, మదించిన హంసలచేతను, చల్లని ప్రశాంతజలములచేతను నలంకృతములై జనులచిత్తములను హరించుచున్నవి." (4-9)

ప్రధానముగా నీ చలికాలమున నింతులు బహుభంగుల నలంకృతలై భోగానుభవలాలసచిత్త లగుచున్న రీతిని మనకవి మనోహర భావములం బ్రదర్శించి యీ క్రింది ప్రాస్తావిక శ్లోకమును స్మరింపఁ జేసినాఁడు.

* "హసంతీం వా ♦ హసంతీం వా † హసంతీం వామలోచనాం ।
హేమంతే యే న సేవంతే తే నరా దైవవంచితాః॥"

శి శి ర ర్తు వ ర్ణ న ము

"ఈకాలమునఁ గిటికీలుమూసిన గదులును, అగ్నియు, సూర్య కిరణములును, యువతులును, దుప్పట్లును సేవ్యవస్తువు లగుచున్నవి. ( 5-1 )

ఇట్లీశిశిరముకూడ స్త్రీల యుపభోగలాలసత్వ వర్ణనముతో ముగియును.

ఋతురాజము — వసంతఋతువు

ఈ తొలికావ్యమున నీ ఋతురాజము తుదిని వర్ణితమైనది. కాని యీ ఋతువు మిగిలిన ఋతువులకే కాక, అఖిల చరాచరప్రకృతికిని ఆనందదాయకమై, "ఋతురాజము" అను నన్వర్థనామము నందు కొన్నది. ఈ మొదటికావ్యములోని యీ వసంతవర్ణనమందలి భావాం

* హసంతీ = సంపటి; ♦ హసంతీ = వెచ్చనిదుప్పటి; † హసంతీ = నవ్వు మన్న. దీని భావమే శిశిరర్తువర్ణనమున నీకవి తెలిపినాడు. చూ. ఋతుసం.

కురములే యీ కవీశ్వరుని "కుమారసంభవ" కావ్యములోని వసంత వర్ణనములో కుసుమించి, స్తబకించి, ఫలించినవి. కనుక యిందలి శైలియు, భావములును మున్ముందు వికసించి ఎట్లు విశ్వసమ్మోహన కరములై విరాజిల్లినవో యిట ఇంచుక వివరించెదను.

"ఓ ప్రియురాలా! వసంతుఁడు అను యోధుఁడు, వికసించిన మామిడిగున్నయొక్క చిగురుటాకు లనెడి వాడిబాణములను, తుమ్మెదల బారు లనెడు చక్కని వింటిత్రాటిని గ్రహించి సురతాఽసక్తులైన యువతీయువకుల హృదయములను ఇఁకను రేకెత్తించి రేపుటకు * వచ్చినాఁడు." (చూ. ఋతుసం. సర్గ 6-శ్లో 1)

పై శ్లోకభావము కుమారసంభవములో నెంతటి నైశిత్యము పొంది విశ్వసమ్మోహనకరమై విరాజిల్లినదో విలోకించుడు.

"సద్యః ప్రవాలోద్గమచారుపత్రే
నీతే సమాప్తిం నవచూతబాణే
నివేశయామాస మధు ర్ద్విరేఫాన్
నామాక్షరాణీవ మనోభవస్య॥" (మధువిభృంభణం)

"నూత్నచూతము" అనెడు మన్మథబాణము, చిగురుటాకులు అనెడు ఱెక్కలకూర్పుతోఁ దయారుకాగా వసంతసఖుఁడు, ఆ మదనబాణముపై మన్మథుని నామాఽక్షరములు వ్రాసినట్లు తుమ్మెదలను ప్రవేశపెట్టెను."

మనకవి స్థాణ్వాశ్రమములో నకాలములోఁ ప్రవేశపెట్టిన "ఆమని"యొక్క అద్భుతప్రభావమిది. ఇది యొక యపూర్వచిత్రణము.

"చూతము" మన్మథుని బాణమనుటకు నిదర్శనము —

---

* కామాసక్తిః భోగానుభవములచే, నాజ్యహోమముచే నగ్నివలె నధికమగును గాని శాంతించదు. చూ. గీత.

"న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయఏవా ఽభివర్ధతే॥"

"అరవిందమశోకంచ, చూతంచ, నవమల్లికా।
నీలోత్పలంచ పంచైతే పంచబాణస్య సాయకాః॥"

(అమరము)

లక్ష్యమును తొందరగాఁ జేరి యట గ్రుచ్చుకొనుటకు బాణమునకు, ఱెక్కలు ముఖ్యము. మన్మథుని సంబంధమైన బాణము ఏయొక్కని విషయములోను వ్యర్థముకాకుండుటకై "మన్మథ" నామాఽక్షర నిక్షేపణ మిట పరమప్రయోజనకారి యగును. ఇట్లిట చిగురుటాకులు, తుమ్మెదలు అను నివి యువకదంపతుల మనస్సును గిలిగింతలుపెట్టి మోహపెట్టుటలో వాడియగు సపత్రమన్మథబాణముగా పరిణమించుట, కాళిదాసునిభావము పదునెక్కి పరిణతమై ప్రతిభాభాసమానమగుట చేతనే యని స్పష్టమైనది. మేరుపర్వతమందున్న సామాన్యవస్తువు కూడ బంగారమువలె భాసించునుకదా ! ఇట్లే యింకను

"పుష్పించిన వృక్షములు, జలజయుతములగు జలములు, కామాఽసక్తలైన కాంతలు, పరిమళభరితములగు పవనములు, చక్కని సాయంసమయములు, రమణీయములై వరలుచున్న వాసరములు మొదలగునివన్నియు నో ప్రియా ! జీవలోకమునకు ఈ వసంతమునఁ బ్రియకరము లగుచున్నవి." (6-2)

" ఇక్కాలమున మదనుఁడు, పుష్పాఽసవపానాఽలసలగు స్త్రీల చంచలనేత్రములయందు జాంచల్యరూపుఁడై యుండెను ఇట్లే పూఁబోఁడుల బుగ్గలయందు పాండురవర్ణత్వరూపుఁడుగను, వారి చనుకట్లయందు కాఠిన్యరూపుఁడుగను, నడుములయందు నమ్రత్వ రూపుఁడుగను, వారి పిఱుదులయందు పీవరత్వరూపుఁడుగను, ఇట్లనం గుఁడు అంగనల యంగములయందు వివిధరూపములలో గానన గుచుండెను." (6-10)

"ఎట్టిటి చిగురుటాకుల జొంపములచేఁ గొంచెము వంగిన తియ్యమామిడిచెట్లు పూచి, గాలికిఁ గదల్పఁబడుచున్న తమ కొమ్మల

సోయగములతో కొమ్మల చిత్తములలోఁ గోరిక లీరికలెత్తించు చున్నవి.'' (6-15)

''చెట్ల మొదటినుండియుఁ జిగిర్చి, పవడఁపుకాంతిగల పుష్ప సముదాయముతో నందగించు అశోకవృక్షములు, యువతుల చిత్తము లను సశోకములుగఁ జేయుచున్నవి.'' (6-16)

''మోదుగవృక్షములు జ్వలించు నగ్నివలె నున్న యెఱ్ఱటి పూలతో గాలికిఁ గదలుచు, పూగుత్తుల బరువుచే వంగియుండెను. ఇట్టి మోదుగవృక్షములచే నావృతమగు వనభూమి, ఎఱ్ఱనిచీరె ధరించి యీ వసంతములో వేంచేసిన క్రొత్తకోడలివలె నుండెను.'' * (6-19)

''మత్తిలిన పుంస్కోకిలముల మధురకూజితములచేతను, మత్తు గొన్న తుమ్మెదల కలరవముచేతను, త్రపావినయ భావభరితలైన కులస్త్రీల చిత్తములు క్షణములో మోహపరవశమ్ము లగుచున్నవి.'' ( 6-21 )

''విలాసవతుల హాసములవలెఁ దెల్లనివైన మల్లికాపుష్పముల తోను పవనములు, ఉద్దీపనకరములై యుజ్జ్వలముగ భాసించుచుండెను. ఇట్టి యుపవనములు మోహరహితములగు మునుల మానసములనే మోహపెట్టుచుండగా రాగయుక్తములైన యువకుల మానసములను ముందుగనే పరవశము చేయుచున్నవి.'' (6-23)

ఇదేభావము కుమారసంభవములో ''అకాలములోగల్గిన ఆ మధువిజృంభణమునకు వికారయుతములైన తమచిత్తములను నిలబెట్టు కొనుటకు మునులు చాల ప్రయాసపడి తుద కెట్లో నిలబెట్టుకొనిరి'' అని మారినది. ఇక ఈ వసంతవర్ణనములోని శ్లోకభావములు, శైలి అను నివి యీ కవీశ్వరుని కుమారసంభవములో వికసించి, విశ్వస్తుత్య మైన విధమును విలోకింతుదము.

---

* ఈ భావము ఉద్దీపనవిభావవర్ణనమునకు ఎంతయుఁ బోషకమైనది. ఇచ్చటి రాగవర్ణనము అనురాగసంధుక్షణమునకు దోహదకారియగును.

"తామ్రప్రవాల స్తబకావనమ్రాః
చూతద్రుమాః పుష్పితచారుశాఖాః।
కుర్వంతి కామం పవనావధూతాః
పర్యుత్సుకం మానసమంగనానాం॥" (6 సర్గ. 15 శ్లో)

ఇట "చిగురుజొంపములు కల మావిమోకలు, తమ పుష్పితశాఖలతో స్త్రీల చిత్తములను వేడుకకలవిగఁ జేయుచున్నవి" అను నీభావము, ఈ శ్లోకశైలియు నీ కుమారసంభవ శ్లోకములో నెట్లు ప్రతిఫలించి, ప్రకాశించినదో పరికింపుడు.

"పర్యాప్తపుష్ప స్తబక స్తనాభ్యః
స్ఫురత్ప్రవాళోష్ఠ మనోహరాభ్యః
లతావధూభ్యః తరవోఽప్యవాపుః
వినమ్రశాఖా భుజబంధనాని॥" (3-39)

"చక్కఁగ వికసించిన పుష్పగుచ్ఛములనెడు పాలిండ్లచేతను, ఎఱ్ఱటి చిగుళ్ళు అనెడు ఓష్ఠములచేతను మనోహరలైన లతాకాంతలకు, వసంతవేళయందు తరువులు వంగిన తమ శాఖాబాహువులతో ఆలింగనము లొసంగినవి."

తొలికావ్యగతభావములో ఆ మవృక్షములు స్త్రీల చిత్తములను బర్యుత్సుకములుగ జేయునంతవఱకే సమర్థములైనవి. కాని యిట నాయికానాయక భావ మున్నను అస్పష్టమై ఆస్వాద్యము కాకున్నది. ఈ యస్పష్టభావము, కుమారసంభవ రచనా సమయము నకుఁ బరిణతమై, పదునెక్కి, కవిప్రతిభా ప్రభాసితమై, అనురాగ రంజిత హృదయులైన నాయికా నాయకుల కౌగిలింతలతో ఆస్వాద్యమై, పఠితల చిత్తములయందు ఆనందరసమును * ఊరించు చున్నది. ఈ వాసంతిక ప్రకృతిదృశ్య యవనికపై మనకవీంద్రుఁడు చూపిన యీ భావచిత్రణమునకు, ఈ యద్భుత సన్నివేశమునకుఁ

బశుపక్ష్యాదుల మానసములే పసుగులుతీయుచున్నవి. ఇంతకు ఇక్కడ నున్నవి ప్రత్యహము మనము చూచుచున్న చెట్లు, లతలు, అను సామాన్య వస్తువులు మాత్రమే. ఇట పూగుత్తులు కవి భావనా మహిమచే పాలిండ్లుగా మారినవి. ఇట్లే పల్లవములు ఓష్ఠములుగా మారినవి. స్త్రీత్వమునకు వలయు చిహ్నములు చేకూరినవి. వెంటనే లతలు లలనలుగా మారినవి. నాయకుని కౌగిళ్ళలోఁ బరవశతఁ జెంది యిట్లు నాయికుని చిత్తము చూరగొన్న యలిరుఁబోఁడి యందము "చారుత్వ" లక్షణ లక్షితమైయున్నట్లు మనకవీశుని సూక్తి యిట్లు సువ్యక్తము సేయుచున్నది.

"........ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా॥"

(కుమారసం. 5–1)

పై యాదర్శ దాంపత్య ధర్మమంతటిని కాంతాసమ్మితముగా కేవల స్థావరములైన తరువులద్వారా చరాచర ప్రపంచమునకుఁ జాటిన "కాళిదాస హృదయము" ఎంతటి విశ్వకల్యాణభావనతో; ఎంతటి కవితాప్రతిభతోఁ బ్రకాశించునదో కదా! ఇఁక ఒండు రెండు దాహృతులు.

"ఆదీప్తవహ్నిసదృశైః మరుతావధూతైః
సర్వత్ర కింశుకవనైః కుసుమావనమ్రైః।
సద్యో వసంతసమయే హి సమాచితేయం
రక్తాంశుకా నవవధూ రివ భాతి భూమిః॥ (6-19)

ఎట్టిటి పుష్పములుగల మోదుగవృక్షములతో వ్యాప్తమగు వన భూమి, ఎఱ్ఱటిచీరెతోవచ్చిన క్రొత్తకోడలివలె కొమరు మిగులు చుండెను. ఇదేభావము కు. సం. లో. నెంత మోహనముగఁ జిత్రిత మైనదో చిత్తగించుఁడు.

---

* "ఆనందజనకత్వమేవ కావ్యస్య ప్రయోజనం" (అలంకారశాస్త్రం)

"బాలేందువక్రా ణ్యవికాసభావాత్
బభుః పలాశా న్యతిలోహితాని।
సద్యో వసంతేన సమాగతానాం
నఖక్షతానీవ వనస్థలీనాం॥" (3-29)

ఈ వాసంతమున, విరియని మోదుగమొగ్గలు, మిక్కిలి యెఱ్ఱనివై, చంద్రరేఖవలె వంపుదిరిగి వసంతునితోఁ గలిసిన వనస్థలుల నఖక్షతములవలె ప్రకాశించినవి."

ఇట "వసంతకాలమురాగా మోదుగలు మొగ్గఁదొడిగినవి" అనునదే ఇట ముఖ్యవిషయము. ఇది సామాన్యవిషయమే. ఇదే సామాన్యవిషయము యీ కవీంద్రుని కవి ప్రతిభా మణిదర్పణమునఁ బ్రతిఫలించి, తన్మణి కాంతిరంజితమై, యపూర్వ కాంతులతో నలరారినది. చూడుఁడు.

"వసంత" శబ్దము పుంలింగము. "వనస్థలీ" శబ్దము స్త్రీలింగము. హఠాత్తుగవచ్చి "వసంతుఁడు" "వనస్థలి"తోఁ గలిసినాఁడు. ఆ వనస్థలిపై యెఱ్ఱటి, వంపుకల మోదుగమొగ్గలు లేచినవి. ఇవి, నాయకుని సంగమకాలమందుఁ గల్గిన నఖక్షతములు కాక మఱేమియగును? భళీ! కవీంద్రా! నీ కల్పనా ప్రభావముచే నీరసవస్తువుసైతము నిగనిగని కాంతులు గలిగి, జీవకళతో నుట్టిపడుచు, ప్రపంచమున, కదేదియో మహోపదేశముఁ గావించు చుండును.

"........యథా స్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే"

"కవిబ్రహ్మ, తన కవితాప్రపంచమును దనయిచ్ఛవచ్చినట్లు మార్చ గలఁడు" అనుసూక్తి కవీంద్రా! నీపట్ల యక్షరశః అన్వర్థమగునయ్యా! సద్యః అనుభూత యగు నాయికయందే నఖక్షతములు కనిపించుచు చూపరులగువారి భావములలో నెన్నియో తీయని తలంపులను రేకెత్తించుచుండును. ఇట్టి నాయికవలెఁ ప్రస్తుతమున, వసంత సంగ

సంజాత కింశుక ముకుళ ముగ్ధగాయత్రియగు వనస్థలియుఁ జూపరుల చిత్తములలో రసానుభూతిని గల్గించి వారిని ఆనందపరవశులఁ జేయుచున్నది. ఇట్టి మధురమధుర భావపరిణతికి మూలము ఋతుసంహార కావ్యరచన మనుట ఋతము.

ఇఁక కుమారసంభవమందలి వసంతవిజృంభణ సందర్భములోని కొన్ని శ్లోకభావములను జూపి, యీ విషయమునుండి విరమించెదను.

"ఈ యకాల వసంతలక్ష్మి, 'మూగిన తుమ్మెదలు' అనెడు కాటుకరచనలుగల తిలకపుష్పమనెడి తిలకమును "వసంతారంభమును" అనెడు తన ముఖమునందు దిద్దుకొని, బాలచంద్రునియొక్క యరుణ కాంతియనెడు లాక్షారసముతో 'మామిడిచిగుళ్ళు' అనెడు తన యధరోష్ఠమును అలంకరించుకొన్నది. (3-30)

"మామిడి చిగుళ్ళలోని కషాయరసాఽస్వాదనచేఁ గషాయమయ కంఠస్వరముకల పురుషకోవెలల కలకూజితములు, మానవతుల మానమును భంజిచుటకైన మన్మథుని యాజ్ఞావచనముగా నున్నవి." (3-32)

"మన్మథుఁడు, సంమోహనాఽస్త్ర సంయుతుఁడై, రతీసహితుఁడై స్థాణ్వాఽశ్రమమునకు వేంచేసినవెంటనే, యచ్చటఁగల పశుపక్షి మిథునములు రసవివశములై తమ శృంగారభావములను క్రియలలోఁ జూపసాగినవి."

"భ్రమరనాయకుఁడు దన ప్రియురాలితోఁగూడి "పుష్పము" అనెడు నేకపాత్రలో మకరందమును ఆస్వాదించెను. * "ఇట్లే కృష్ణసారము ♦ తనకొమ్ములతోఁ దనమృగిని స్పర్శసుఖ నిమీలితాక్షి యగునట్లు గోకెను." (3-36)

---

* పునస్సంధానమునకుముందు దంపతుల మేకపాత్రాఽశనము, వారి భావైక్యమునకు, రసైక్యమునకు "రససహానుభూతి"కిని ముఖ్యమైనది.

♦ నల్లయిఱ్ఱి.

"ఆడయేనుగు తన ప్రియునకుఁ బ్రేమము మీఱ, పద్మరేణు సుగంధిత మగు తన గండూషజలమును * ఒసంగెను. చక్రవాకపక్షి, తను సఖముకొఱికిన తామరదూడును ఇచ్చి, తన ప్రియురాలిని గౌరవించెను." (3-37)

"కింపురుషుఁడు, తన ప్రియురాలు గానముసేయుతఱిని శ్రమజల బిందువులచే నామె ముఖమునందలి మకరికాది పత్రరేఖలు కొంచెము చెరుగగా, మద్యపానముచే చలన్నేత్రి యగుచున్న అట్టి తన ప్రియా ముఖమును అతడు రసపరవశుఁడై గానమధ్యమునందే చుంబించెను." (3-38)

పై విధముగా "కింపురుషులు, మానవులు, పశుపక్ష్యాదులు తుదకు లతాపాదపములుకూడ నీ కవీంద్రుని వసంతవర్ణనా ప్రాభవము నకు ముగ్ధతఁజెంది ♦ రసపరవశత్వమ్మునో శృంగారభావములయం దోలలాడినవి" అనినపుడు ఈ కవీంద్రుని వర్ణనామహిమ ఊహించ వలసినదేకదా!

"కాళిదాసు" ప్రకృతికవి అనుటకీ నిదర్శనములు చాలవా?

---

* పుక్కిలించబట్టిన నీరు.

♦ "వృక్షాదులుకూడ సుఖదుఃఖాదులు కలవి" అనుటకు నిదర్శనము.

"అంతస్సంజ్ఞాభవం త్యేతే సుఖదుఃఖ సమన్వితాః" (చూ. మనుస్మృతి)

ఓమ్

# కాళిదాస హృదయము

## కాళిదాసు - హిమాలయప్రకృతి

కాళిదాసకవీంద్రుని కవిత మొట్టమొదట "ఋతుసంహార" రూపమైన "ప్రకృతివర్ణనము"తో ప్రారంభమైనది. ఈ వర్ణన కుమార సంభవాది మహాకావ్యములలో క్రమపరిణతిఁ జెంది, చక్కని సౌకుమార్యమును సంతరించుకొన్నది. "ప్రకృతి"తో "పురుషునికి" విడదీయరాని చక్కని, చిక్కని సంబంధవిశేషము ఈ కవీశుని కవితలో అడుగడుగునకుఁ గానుపించుచునే యుండును. ఈ విశిష్టవిషయమును శకుంతలా తపోవన జీవితవర్ణనము విస్పష్టము సేయఁగలదు.

ప్రస్తుతములో కుమారసంభవకావ్యాదిలోని హిమవద్వర్ణనము సర్వావసరవస్తుసంపత్సమృద్ధితో నైహికముగను, ఆధ్యాత్మికముగను, శక్తిమంతమై, సౌందర్యసంభరితమై శోభిల్లుచున్నది. ఈ కవీంద్రుని దృష్టి పాషాణములలోఁగూడ "పరమాత్మతత్వము"ను జూడగల్గినట్లు కుమారసంభవ కావ్యాదిలోని ఆద్యశ్లోకములో "దేవతాత్మా" అను విశేషణ మొక్కటే విశదము చేయఁగల్గియున్నది. ఈ శ్లోకములోని "పృథివ్యా ఇవ మానదండః" అన్న ఉపమానము సర్వసర్వంసహా దేవియొక్క సర్వవస్తుసంపద్వైభవవిస్తృతి నంతటిని ఒకేక్షణములో దాని పొడవుతోసహా కొలిచి దాని ఇయత్తాపరిమాణ మంతటిని నాల్గక్షరములలో (మానదండః) సంగ్రహించి మన కన్నులయెదుటఁ బెట్టుచున్నది. ఈ యుపమాన మిట కాళిదాసుయొక్క యుపమావ్యాప్తినికూడ కొలుచునట్లున్నది.

ఇట్లీ కవీశుని ప్రకృతివర్ణన స్వతస్సిద్ధముగనే దివ్యభావ (దేవతాత్మ) సంసర్గముచే శక్తివంత మగుటచేత, భౌతికముగాకూడ శక్తిమంతమై యపూర్వశోభతో నలరారుచున్నది. ఈ నా భావమును ఈ కావ్యాదిశ్లోకములే సమర్థించుచున్నవి. చూడుడు. రెండవ శ్లోకములో హిమాలయము "వత్స"గా వర్ణితమగుటలోని విశేషమేమనగా ఈ నగమందలి "సంజీవిని" మొదలగు నోషధులు, వివిధ

రత్నములు మున్నగు నమూల్య వస్తుసంపద యంతయుఁ గలిపి యీ కవిచే "గోక్షీరములు"గ వర్ణితమైనది. ఇట్టి క్షీరములు లోకానుభవ యోగ్యములు కావలె నన్నచో "వత్స" * (హిమనగము) అత్యవసరము 'వత్స' లేకున్నచో గోవు సులభముగ పాలివ్వదుకదా!

ఇట్లే నాల్గవ శ్లోకములో హిమనగ శిఖరములు సిందూరాది ధాతుసంసర్గముచే నెఱ్ఱగ నున్నవి. ఇట్టి శిఖరములవద్ద తిరుగుచున్న మేఘఖండములమధ్య ఈ యెఱుపు సంక్రమించి, సంధ్యేతరకాలములలోఁగూడ, సంధ్యాఽరుణకాంతులను జిమ్ముచున్నది. ఇట్టి సిందూరాఽరుణ్యము, అచ్చటి అప్సరస్త్రీలకు విలాసాఽలంకారములను సంపాదించుచున్నది.

అనగా సంధ్యాకాలమున మనకు ఈ భూమిపై కొన్నినిమేషములే కనుపించుచున్న, సంధ్యారుణకాంతి కమనీయప్రశాంతపవిత్ర సంధ్యాప్రకృతి, ఈ హైమవతశిఖరములందు నిత్యమై అచ్చటి యప్సరస్త్రీలతోఁబాటు మనకును నిత్యానందసంధాయక మగుచున్నది. ఇట్టి "అకాలసంధ్యాప్రకృతి" మన కవీంద్రుని యుపమానబలముచే ♦ తత్కావ్యగతి హిమనగర శిఖరములపై కాలత్రయమందును మార్పేమియులేక అట్లేనిలిచి, మన మానసక్షేత్రములనుగూడ నిత్యముగా సంధ్యారుణకాంతులతో రంజింపఁజేయుచున్నది. ఔరా! శిలామయమైన కేవల నగరశిఖముల కింతటి శోభను సంక్రమింపఁజేసి, అప్సరస్త్రీలకుగూడ భోగ్యభూములుగా వీటిని దిద్దితీర్చిన మన కవీంద్రుని ప్రకృతివర్ణనాప్రాభవ మింతింత యన దరమా!

ఇట్లే 5, 9 శ్లోకములలో గిరిరాజు, గజాంతైశ్వర్యసమృద్ధికలవాఁడనియు, మృగరాజుల కాటపట్టనియు, శాంతక్రూర మహామృగములకు ఆశయస్థానమనియు వర్ణించి మనకవి, ఈ నగరాజుయొక్క యైశ్వర్యమును రాజరాజత్వమును, అన్నిజీవులయెడలను తుల్యభావమును, దవ

* "యం సర్వశైలాః పరికల్ప్యవత్సం..." (చూ. కు. సం. 1-2)

♦ "...అకాలసంధ్యా మివ ధాతుమత్తాం॥" (చూ. కు. సం. 1-4)

శాంతోదారపవిత్రభావములను జక్కఁగ ధ్వనింపఁజేసినాడు. సర్వజీవులకు జీవప్రదమైన "సంజీవిని" యను నోషధిరాజ మిప్పర్వతముపైఁ బరిఢవిల్లుచుండుట, ఈ నగరాజుయొక్క ప్రత్యేకత యనవలెను. ఇఁక 7, 8 శ్లోకములలోని వర్ణనా ప్రభావముచే నీ నగరాజము, దివ్యాంగనలయొక్క యానంద విలాసవిలసితవిహారములకుఁ దగిన దివ్యప్రకృతితో దీపించుచున్నది.

ఈ నగమునఁ గల దరీగృహములలో రాత్రులందు భార్యామాత్రసహాయులై యున్న వనేచరులకు నచ్చటి తృణజ్యోతిస్సులు చమురుఖర్చులేని దీపములుగా నుపయోగించుట, ఈ నగరాజుయొక్క "పరోపకృతి"కి నిదర్శనము. ఇట్లే యింకొకచోట గల దరీగృహములలోని కింపురుషులు తమవనితలకు వస్త్రాపహారము సేయఁగా, లజ్జాపరవశలగు నా కింపురుషాంగనలకు దైవికముగావచ్చిన మేఘుఖండములు తద్ద్వారముల కడ్డువచ్చి, తెరలక్రింద వారి కుపయుక్తములగుచున్నవి. కాళిదాసుయొక్క యీవర్ణనముచే హిమవంతునియుదారగంభీరభావభరిత పరోపకారప్రవృత్తి ప్రకటిత మగుచున్నది. ఇక 12 వ శ్లోకములోని ప్రకృతి, ప్రబోధకరము. ఎట్లనఁగా ఈ నగరములోని చీకటిగుహలు నిత్యాంధకారబంధురములై భయంకరము లగుచుండును. ఇచ్చటి చీకట్లదొంతరలన్నియుఁ గలిసి, యొకక్షుద్రపురుషుఁ డయ్యెను.

ఈ పురుషునకు సూర్యుడు శత్రువు. కనుక పగటిభాగమున ఈ తమఃపురుషునకు సూర్యుడు కాలూనుటకుగూడ చోటు దొరకనిచ్చుటలేదు.

"తమ స్తపతి ఘర్మాంశౌ కథమావిర్భవిష్యతి॥"

ఇక ఈ తమఃపురుషుని, దనవానినిగాఁ జేరఁదీసి రక్షించువా రెవరు ఆలోచించగా నీతనికి శీతనగములోని గుహలు జ్ఞాపకమువచ్చినవి. ఇవి పగటిభాగమునఁగూడ సూర్యరశ్మి చొరఁబారక, సర్వకాలములందును మహాంధకారబంధురములై యుండును. ఇవి యిట్లెందుకున్నవందురా ? సూర్యునకుభయపడి వచ్చి శరణుజొచ్చిన యంధకారపురుషునకు ఈ

హిమవంతుఁడు ఆశ్రయమిచ్చి, గుహారూపమైన తనకడుపులోఁబెట్టికొని వానిని నిత్యముగా కాపాడినాడు. కనుక, నేటికిని హిమవంతములోని లోయలు నిత్యాంధకార బంధురములై యుండును. "ఉచ్చైశ్శిరస్కులు (పెద్దతలవారు) తన పర భేదము లేక, మంచివారినివలె క్షుద్ర పురుషులనుగూడ తనకడుపులోఁబెట్టి కాపాడుదురు కదా! * భళీ! కటికిచీకటి లోయలనుండి మనమహాకవి, యెంతటి యుజ్జ్వలభావము నుదయింపఁ జేసినాడు! కేవల పాషాణములనుండి యెంతటి ప్రబోధ కర విషయమును ప్రాదుర్భవింపఁజేసినాడు! కేవల మహాశిలాసంఘాతమునుండి ఎంతటి దయార్ద్రభావమును ఊరింపఁజేసినాడు! మన కవీశ్వరునిచేతిలోఁబడిన కర్కశప్రకృతి కూడ దయార్ద్రమై, మహోదారభావముతో బరిమళించి ప్రకాశించినది. ఇంతటి యుదారస్వభావము, శరణాగతరక్షణము, ఇట్టి యార్తత్రాణ పరాయణత్వము అను నీ సుగుణసందోహమును ఒక్క చీకటిలోయలనుండే ఉద్భవింపఁజేసిన "కాళిదాస హృదయము"ను ఏమని కొనియాడఁగలము! మన భారతీయులందఱును పై సుగుణసందోహమంతటిని ఈ హిమనగప్రకృతి నుండియే నేర్చియుండవచ్చును. ఈ "శరణాగతరక్షణవిద్య" మన దేశమున రాతిగుట్టలలోఁగూడ నెలకొనునట్లీ విద్యను పాషాణములకుఁగూడ నేర్పినగురువు మన కవికులగురువే" అన్నచో, నే సహృదయుఁడు "కాదు"నఁగలఁడు? ఈవిద్య యిప్పటికిని మనలో జీర్ణించి యున్నదనుటకు, పాకీయులయెడ మన భారతీయుల భవ్యప్రవర్తనమే తార్కాణము. ఈవిషయమునే దెలుపుచు కాళిదాసు మహాత్ములకు శత్రువుల దుండగీడుతనమే దుర్భరము కాని, వారి జీవితము కాదు—

"ప్రణిపాత ప్రతీకారః స్సంరంభో హి మహాత్మనాం"

అని ఉత్తమ భారతీయ ప్రభువుల యుజ్జ్వలశీలములను దెలిపినాడు. శ్రీరామచంద్రుని పరిపాలనమునుండియు నీ "శరణాగతరక్షణవిద్య"

---

* "......క్షుద్రేపినూనం శరణం ప్రపన్నే మమత్వ ముచ్చైశ్శిరసాం సతీవ॥" (కు. సం. సర్గ 1 శ్లో. 12)

అవిచ్ఛిన్నముగ మన భావవాహినిలో నంతర్వాహినియై యలరారు చునే యున్నది మనకుగల ప్రపంచ ప్రశస్తికి ఇదియు కారణము.

ఇట్లు మనకవీంద్రుని ప్రకృతివర్ణనా పాటవము, పాషాణమయు ప్రకృతిలోఁగూడ నింతటి యద్భుతోదార పవిత్రచరిత్రను ఉదయింపఁజేసి, యేతన్ముఖమునఁ బ్రపంచమునకు

"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్"

అను మహోపదేశమును అందించినది.

"ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్"

అను నార్యోక్తి యీ కాళిదాస నగరాజునకు అక్షరశః అన్వయించినది కదా! కాగా మన కాళిదాస కవితామృతము "వసుధైక కుటుంబక" భావమును బ్రపంచమునకే యుపదేశించి, తన్ముఖమున లోకమును బ్రబోధించినది. ఇట్లు, ఉత్తమోదార పవిత్రశీలములను లోకమునఁ బ్రతిష్ఠింపజేసిన ప్రతిష్ఠ, కాళిదాస కవిత్వములో నొక్కొక్క విశేష ణమునకుఁగూడఁ దక్కినది. దీనితో పాషాణముకూడ పవిత్ర భవ్య భావముతో పరిఢవిల్లి పరిమళించినది.

ఇక 13 వ శ్లోకములో "హిమనగముపైఁ దిరుగుచున్న చమరీ మృగములు, తమ తెల్లని తోకకుచ్చులను ఇటునటు నాడించుచు నగరాజుయొక్క 'రాజ' శబ్దమును సార్థకము సేయుచున్నవి." ఈ నగరాజు "దేవతాత్మ" కనుక నిట దివ్యోపచారములు (ఛత్రచామర ఆందోళికాదులు) అవసరమే కదా! మన కాళిదాస కావ్యగత మృగ ముల కున్నంత జ్ఞానము చైనీయుల కున్న యెడల వారు ఈ నగరాజుపై నింతటి యసభ్యప్రవర్తనము చూపకుండెడివారు. "ఉత్తమపురుష సేవాభాగ్యములచేతనే యిట మృగములకుఁగూడ నింతటి గౌరవ మబ్బినది. పూజ్యులను పూజింపనివారికి శ్రేయోవిఘాతము కల్గునని కాళిదాసు తనసూక్తిమౌక్తికములలో జేర్కొనినాడు.

"ప్రతిబధ్నాతిహి శ్రేయః పూజ్యపూజా వ్యతిక్రమః"

ఇంక నగరాజుయొక్క సర్వాధిక సమున్నతత్వమునుగూర్చి మనకవి—

శ్లో॥ సప్తర్షిహస్తావచితావశేషా
ణ్యధోవివస్వాన్ పరివర్తమానః ।
పద్మానియస్యాగ్రసరోరుహాణి
ప్రబోధయత్యూర్ధ్వముఖై ర్మయూఖైః ॥

(కూ. కు. సం. 1-17)

ఈ పర్వతోపరిభాగములపై గల పద్మసరస్సులలోని పద్మములను గొన్నిటిని దేవతార్చనకై యచ్చటి సప్తర్షిగణము కోయగా మిగిలి యున్న పద్మములను సూర్యుఁడు (ఆ సప్తర్షిమండలముకంటె దాను క్రింద దిరుగుచుండుటచే) తన యూర్ధ్వకిరణములతో వికసింపఁజేయు చున్నాడు. ఈ సప్తర్షిమండలము ధ్రువమండలముకన్న నెత్తుగ నున్నట్లు జ్యోతిశ్శాస్త్రము తెలుపును. ఇట్టి వర్ణనచే నీ నగశిఖరములు మేఘ, చంద్ర, సూర్య, ధ్రువమండలములను దాటి, వీటికంటె నున్నతములై యున్నవని దెలియుచున్నదికదా ! ఇట్టి యౌన్నత్యముచే నీ శిఖరములు సర్వదేశముల వారికేకాక సర్వ పవిత్రమండలములకును సాక్షిభూత ములైయున్నవి. కాగా ఉత్తమోత్తమశీలసంపన్నులలో నీ నగరా నుండియు ప్రపంచ జోక్కడే ప్రపంచములోకెల్ల పెద్దవా" డనియు, యుగాంతరముల ప్రజల ప్రవృత్తులను దిలకించుచున్న అందరియొక్క మంచిచెడ్డలను బాగుగ దెలిసినవాడనియు, గాన ప్రపంచచరిత్రలోని సత్యాసత్యములకు ఈ రా జోక్కడే సత్యమైన "సాక్షి" అనియు నిట్లె న్నియో భావసౌరభములను మన కవీశుడు తన యీ ప్రకృతివర్ణనచే ప్రకటించుచున్నాడు. కనుక నీ కవీశుని భావశిఖరములందలి ప్రశాంత ప్రకృష్టపవిత్రప్రకృతి, ప్రపంచమునకే ప్రకృతిపాఠము. ఈ పాఠము ప్రబోధకరమై అందఱకుఁ "గనువిప్పు" గావించుచుండుననుట సర్వాం గీణమైన సత్యవిషయము. కాగా నీ నగరాజప్రకృతి సర్వదేశీయులకు సర్వకాలములందును,సర్వావస్థలయందును సంసేవ్యమనుట సర్వాంగీ కృతమైన విషయము.

ఇంక యజ్ఞనిర్వహణమునకు ముఖ్యసాధనమైన "సోమ లతాదు"లకు ఇప్పర్వతరాజము నిలయ మగుటచేతను, సర్వధరిత్రిని మోయుటకు దగిన సారము కలదగుటచేతను బ్రహ్మ యీ నగరమునకు, యజ్ఞభాగ కల్పనాపూర్వకముగ "పర్వతరాజత్వము" ను గల్పించెను.

(చూ. కు. సం. స. 1-17)

ఇందులకు ప్రమాణముకూడ లేకపోలేదు.

"యజ్ఞాంగార్థం మయాసృష్టో హిమవా నచలేశ్వరః"

(విష్ణుపురాణము)

మఱియు నీ నగరాజప్రశస్తి యజుర్వేదములో 5వ కాండమునం గలదు. (చూ. కృష్ణ యజుర్వేదము 5 వ కాండ)

పై వచనమునుబట్టి యీ నగరాజము, లోకకల్యాణమున కెట్లు ముఖ్యసాధన మగుచున్నదో తిలకింపుడు. పవిత్రయజ్ఞక్రియను యథావిధిగ శిష్టు లాచరించుటచే మేఘోదయ మగును. ఈ మేఘునినుండి వర్షములు కురియును. ఈ వర్షములచేత సస్యములు సంపూర్ణముగ ఫలించును. ఈ సస్యసమృద్ధివలన దేశములలో సుభిక్ష మేర్పడును. దేశ లోక కల్యాణమున కింతకంటె వలసిన దేమున్నది? ఈ విషయుజాతమునే యీ క్రింది సూక్తి

"యజ్ఞా ద్భవతి పర్జన్యః పర్జన్యా దన్నసంభవః।
అన్నా ద్భవంతి భూతాని....తస్మా దన్నం తతః ప్రజాః॥"

పై విధముగా నీ పర్వతరాజము సర్వలోక సౌభాగ్యమునకు, సర్వదేశాభ్యుదయమునకు నాంది యగుచున్నది. ఇంకను ఈ నగరాజు భాగీరథీ నిర్ఝరశీకరములచే సిక్తగాత్రుడట. * ఈ చల్లదనముతోబాటు ఈ పర్వతరాజచిత్తము పవిత్రభావసిక్తమైనది. కనుక ఈ హిమాలయ ప్రకృతి చరాచర ప్రకృతికే తల్లివంటిదై యున్నది. ఇట్టి పవిత్ర, ప్రశాంత, సుందరప్రకృతిని పుణ్యాత్ములే సేవించి తరించగల్గుచున్నారు.

---

* (చూ. కు. సం. 1-15)

ఓమ్

# కాళిదాసహృదయము

## సూక్తిమౌక్తికములు

సర్వసంఘములందును నైతికజీవితమును వృద్ధిపఱచుచు, సర్వదా లోకవృత్తమును సరిదిద్దుటకు మహాకవుల సూక్తులే సమర్థములైనవి. ఏ సంఘమువారు నైతికముగ జీవించెదరో ఆదేశీయులే ఉత్తమ సంస్కృతి కలవారని చెప్పవలెను. ఇక "నాగరికత" అనుపేరిట భౌతికముగా నెంతముందరకు సాగితి మనుకొన్నను అట్టివారు నిజము నకు వెనుకబడియున్నారనియే చెప్పవలెను. కనుక నైతికముగ తమ మనుగడను సాధించినవారే నిజముగ ముందడుగు వేసినవారని చెప్ప వలసియున్నది. కనుక మానవసంఘముయొక్క నాగరకతకు, మహిత కీర్తికిని, తత్సుఖజీవనమునకును మూలసూత్రము లనదగిన నీతులు సర్వసంఘములవారికి నవశ్యానుసరణీయము లనుట సత్యవిషయము. ప్రస్తుతమున బహుళప్రయోజనప్రదములైన కాళిదాసీయ సూక్తులు కొన్ని * ఇట నుల్లేఖించి,సంగ్రహముగ వానిభావములను దెలుపుదును. ఇవి మనకు లోకస్వభావమును బహుముఖములఁ జూపజాలి యున్నవి.

ముందుగ సూక్తులకు సంబంధించిన సందర్భములను దెలిపి, పిమ్మట సూక్తులను, తద్భావములను బొందుపఱచెదను. మొదట కుమారసంభవమునుండి—

సందర్భము :— "గిరిరాజుఁ తన తనయకుఁ బెండ్లీడు వచ్చినను గిరీశుఁడే తగినవరుఁడని యెంచి ఈశ్వరునిదప్ప అతడు వేరొక్క వరుని వెదకకుండెను" అను సందర్భములో నీ క్రిందిది కాళిదాసీయ

---

* ఈ సూక్తులు అర్థాంతర న్యాసాలంకార రూపములోనుండి, మానవాళికి మహితనీతులను, లోకవృత్తమును, సాంఘిక సంస్కృతిని బోధించును.

సూక్తి సందర్భమునకే సూక్తి సమర్థన రూపమైన కారణవాక్యము.

"ఋతేకృశానోర్నహి మంత్రపూత మర్హంతి తేజాంస్య
పరాణి హవ్యం" (కు. సం. సర్గ 1 శ్లో 51)

భావము — "మంత్రపూతమైన యాజ్యాది హవిస్సును గ్రహించుటకు పవిత్రమైన యగ్నికాక ఇతర తేజము లేవియును దగవు."
ఇట్లే యికముందును ముందుగ సందర్భము, పిమ్మట సూక్తి, భావము లుండును.

సందర్భము :— "గిరిరాజు తనను కోరనట్టి యీశ్వరునిగూర్చి తన తనూజ నిచ్చెదనని తెలుపుటకు వెళ్ళలేదు" అన్న సందర్భములో

"అభ్యర్థనాభంగభయేనసాధు ర్మాధ్యస్థ్యమిష్టేప్యవలంబతేర్థే"
(కు. సం. 1-52)

"ఒకరి నొకవిషయములోఁ గోరినచో వారు కాదందురేమో యను భయముచే సజ్జనులు ఇతరులను కోరక తమ కిష్టవిషయములలోఁగూడ నుపేక్షాభావము వహించెదరు.

సందర్భము :— "ఈశ్వరుఁడు తనతపమునకు విఘ్నకారకమగు పార్వతీ పరిచర్య నంగీకరించెను" అన్న సందర్భములో

"వికారహేతౌ సతివిక్రియంతే యేషాం నచేతాంసి త ఏవధీరాః॥"
(1-59)

తమచిత్తములు వికారములు జెందుటకుఁ దగినంత కారణసామగ్రి యున్నను నెవరిచిత్తములు వికారముఁ జెందవో వారే "ధీరులు".

సందర్భము :— దేవతలు బ్రహ్మతో "తారకాసురుని మే మెన్నిరీతుల సేవించుచున్నను ఆ రక్కసి ముల్లోకములను బీడించుచునే యున్నాడు" అన్న సందర్భములో

"శామ్యేత్ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః॥" (2-40)

దుర్జనుఁడు ప్రత్యపకారముచేతనే లొంగును గాని ఉపకారముచేత

శాంతింపదు. ఇందుల కనుగుణముగా చాణక్యనీతి "శఠే శాఠ్యం సమాచరేత్".

సందర్భము:— "బ్రహ్మస్తవానంతరమున బ్రహ్మ దేవతలకు సమాధానముగా "నానుండి వరములు పొందిన తారకుఁడు తిరిగి నాచేతనే నాశనము పొందరాదు" అన్న సందర్భములో

"విషవృక్షోపి సంవర్ధ్య స్వయంఛేత్తు మసాంప్రతం" (2-55)

తనచేతితోఁ బెంచినది విషవృక్షమైనను బెంచినవాడే ఆ (విష) వృక్షమును నశింపచేయరాదు.

సందర్భము:— "సభలోని దేవతలందరిని విడిచి యింద్రుని నేత్రసహస్రము ఒక్కసారి మన్మథునిపై వ్రాలెను" అన్న సందర్భములో

"ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు॥" (3-1)

ప్రభువుల గౌరవము, ఏదోయొక, ప్రయోజనము నపేక్షించియుండుట చేత ఆశ్రితుల విషయములో నది తరచుగా చంచలముగనే యుండును.

సందర్భము:— "స్థాణ్వాశ్రమములో నకాలమున వసంత ర్తువు విజృంభించగా నొకచో నప్సరస్త్రీల గానమాధుర్యమును వినుచున్నను మహేశ్వరుఁడు ఆత్మానుసంధానపరుఁ డయ్యెను" అన్న సందర్భములో

"ఆత్మేశ్వరాణాం నహిజాతు విఘ్నా స్సమాధిభేద ప్రభవో భవంతి॥" (3-40)

"ఆత్మసంయమనము కలవారి తపస్సులను విఘ్నములు ఒకప్పుడును పాడుచేయఁజాలవు."

సందర్భము:— "తనకు మ్రొక్కిన నగజనుగూర్చి పలికిన మహేశ్వరుని మాట భావిలో నిజమే యైనది" అన్న సందర్భములో

"నహీశ్వరవ్యాహృతయః కదాచి త్పుష్ణంతి లోకే విపరీత మర్థం॥" (3-36)

"లోకములో మహాపురుషు లన్నమాటలు ఒకప్పుడును విపరీతార్థము నీయవు."

సందర్భము :— శివనేత్రాగ్నిలో భస్మమగునట్లు మదనునకు శాపమిచ్చిన బ్రహ్మ, ధర్మనామక ప్రజాపతిచే యాచితుఁడై "పార్వతీ పరిణయముచేఁ బ్రముదితుఁడైన యీశ్వరునిచేతనే తిరిగి మదనుఁడు బ్రతికించబడును" అని యా నలువ (వెంటనే) శాపావసానమునుగూడ ప్రసాదించెను."

"అశనే రమృతస్య చో భయోర్వశిన శ్చాంబుధరాశ్చయో
నయః॥" (4-43)

"జితేంద్రియులును మేఘములును అశనికి (పిడుగు) అమృతమునకును గూడ జన్మస్థానములు."

జితేంద్రియుల పక్షమున "అశని" "అమృత" శబ్దములు క్రమముగా కోపము (పిడుగువంటిది) అనుగ్రహము (అమృతమువంటిది) అను నర్థము లిచ్చును. ఇక మేఘముల పక్షములో (అశని, అమృత) శబ్దములు "వైద్యుతాగ్ని" "ఉదకము" అను నర్థము లిచ్చును. అనగా మేఘములు తమలోన వైద్యుతాగ్నిని ధరించినను చల్లని యమృతము నిచ్చుచున్నట్లు జితేంద్రియులు పిడుగువంటి శాపము నిచ్చుచున్నను వెన్వెంటనే అమృతమువంటి శాపవిమోచన రూపమగు ననుగ్రహము కూడ కలవారని భావము.

సందర్భము :— "గిరిజాకుమారి యథావిధిగ తపమునాచరించు సమయమున మహర్షు లామెను దర్శింపవచ్చిరి" అన్న సందర్భములో

"నధర్మవృద్ధేషు వయ స్సమీక్ష్యతే" (5-16)

కేవల ధర్మాచరణముచేతనే వృద్ధభావము వహించినవారి విషయములో వారి వయస్సు ముఖ్యముగఁ జూడఁబడదు. కనుకనే మనువు తన ధర్మశాస్త్రములో "తల నెరిసినంత మాత్రముచేతనే మానవుడు వృద్ధుఁడు కాడనియు, యువకుఁడైనను ఉత్తమవిద్య నేర్చినవాఁడే

"వృద్ధుఁడు" అని దేవత లందరనియుఁ జెప్పినాఁడు * ఈ విషయమునే ఇంకొకసూక్తి "ఉత్తమగుణము లెచ్చటనున్నను గౌరవనీయములే యనియు, ఈ విషయమున జాతి కాని వయస్సు కాని ముఖ్యము కాదనియు" నుడువుచున్నది. ♦

సందర్భము :—మాయావటువు గిరిజతో "నీచేత సత్కృతుఁడనైన నన్ను నీ వన్యునిగాఁ దలంపకుము" అన్న సందర్భములో

"యతస్సతాంసన్నతగాత్రిసంగతం మనీషిభి స్సాప్తపదీన ముచ్యతే॥" (5-39)

"సప్తపదము లుచ్చరించునంతటి సమయములోనే సత్పురుష సాంగత్యము సమకూరును" అని విద్వద్వచనము.

సందర్భము :— మాయావటువు గిరిజతో "నీవు ఏ ప్రయోజనముఁగోరి తపమాచరించు చున్నను అది నీయింటఁ గలదు గాన నీ ప్రస్తుత తప మనవసరము. ఒకవేళ వరునిఁగోరియా ? నీవు రత్నమువంటి దానవు" అన్న సందర్భములో

"నరత్నమన్విష్యతి మృగ్యతేహి తత్॥" (5-45)

రత్నము ఇతరులచే వెదకఁబడును గాని రత్నము ఇతరులనుగూర్చి వెదకదు.

సందర్భము :— ఇంకను ఈశ్వరనింద సేయుచున్న మాయావటువునకు విసివి తుద కతనితో గిరిజ "నే వలచిన వరుఁ డెట్టివాఁడైనఁ గానిమ్ము. కాని యితడియందే నాకు భావము కలదు. అన్న సందర్భములో

"నకామవృత్తి ర్వచనీయ మీక్షతే॥" (5-82)

---

* "నతేన వృద్ధోభవతి యేనాస్య పలితం శిరః।
యోవైయువాఽప్యధీయానః తందేవాస్థవిరంవిదుః॥" (మనుధర్మశాస్త్రము)

♦ "గుణాః పూజాస్థానం గుణిషు నచ లింగ నచ వయః॥"

"స్వేచ్ఛావ్యాపారముకలవారు మంచిచెడ్డల నాలోచింపరు. అనఁగా లోకాపవాదకు వీరు భయపడ రని భావము.

సందర్భము :—మాయావటు వింకను నీశ్వరనిందకు గడంగగా గిరిజ "ఆ యసత్ప్రలాపిని గెంటు"డని చెలులతో నన్న సందర్భములో

"నకేవలం యో మహతోపభాషతే శృణోతితస్మా దపి
యస్స పాపభాక్॥" (5-83)

"మహాత్ములను నిందించువారేకాక, ఆ నిందను వినువారుకూడ పాపాత్ములగుదురు." ఇట్లే

"క్లేశః ఫలేనహి పునర్నవతాం విధత్తే" (చూ. 5-86)

సందర్భము :—రాయబారము నెఱపుటకై వచ్చిన మునులతో సమముగ నరుంధతీదేవినిగూడ మహేశ్వరుఁడు గౌరవించెనన్న సందర్భములో

"స్త్రీపుమానిత్య నాస్థైషా వృత్తం హి మహితం సతాం॥"
(6-12)

స్త్రీపురుషభేదమునుబట్టిగాక మహాత్ముల వృత్తమునుబట్టియే యెవరైనను పూజింపఁబడుదురు. అనఁగా సద్గుణము లెవరి నాశ్రయించునో వారే పూజ్యులు.

సందర్భము :— "ఈశ్వరుఁ డరుంధతిని జూచినంతనే తనకును ధర్మపత్ని ముఖ్యమని వైవాహికకృత్యవిషయమున సాదరుఁడయ్యెను" అన్న సందర్భములో

"క్రియాణాం ఖలు ధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణం॥"
(6-13)

యజ్ఞాది ధర్మక్రియాచరణమునకు (కులస్త్రీలైన) ధర్మపత్నులే ముఖ్యకారణము. "ధర్మపత్నీసమేతోహం" మన్నమనకొన్నందుల కిదియే సత్ఫలము. ఇట్లే ఉత్తముల యాదరములగూర్చి

"ప్రాయః ప్రత్యయమాధత్తే స్వగుణేషూత్తమాదరః॥"

(చూ. కు. సం. (6-20)

ఉత్తమపురుషుల యాదరమును జూరగొనఁగల్గిననాఁడే మానవునకుఁ దన గుణములయందు నమ్మకము జనించును.

సందర్భము :— ఈశ్వరుఁడు తన వివాహ నిశ్చయమునకై సప్తర్షులను బంపు సందర్భములో

"విక్రియాయైనకల్పంతే సంబంధా స్సదనుష్ఠితాః"(6-29)

సత్పురుషులచే సంధానము చేయఁబడిన వివాహాది సంబంధములు ఒకప్పుడును భేదభావములను జనింపఁజేయఁజాలవు.

సందర్భము :— రాయబారులై వచ్చిన సప్తర్షులను గూర్చి నగరాజు "మీ రాకచే నా గృహము పావనమైన" దని చెప్పెడు సందర్భములో

"యదధ్యాసిత మర్హద్భి స్తద్ధితీర్థం ప్రచక్షతే॥" (6-56)

సత్పురుషులచే నధిష్ఠింపఁబడిన ప్రదేశము "తీర్థము" అని కీర్తింపఁ బడును. అనగా సత్పురుషులు త్రొక్కిన ప్రదేశము పుణ్యక్షేత్రము వంటి దగును.

సందర్భము:— నీ తనయ నీశున కిమ్మని, నగరాజుతో సప్తర్షులన్న సందర్భములో

"అశోచ్యాహి పితుః కన్యా సద్భర్తృ ప్రతిపాదితాః"(6-79)

ఉత్తమవరున కిచ్చి పెండిలిచేసిన కన్యకనుగూర్చి తండ్రికి విచారింపఁ బనిలేదు.

సందర్భము :—"గిరిరాజు, తనతనయ నీశున కిచ్చుటకుఁ గృత నిశ్చయుఁడైనను బత్నిముఖమువైపు చూచెను" అన్నసందర్భములో

"ప్రాయేణ గృహిణీనేత్రాః కన్యార్థేషు కుటింబినః॥"(6-85)

కన్యావివాహాదివిషయములలో గృహస్థులు తరచుగా తమభార్యలే నేత్రములుగా గలవారు. అనగా నిట్టి కార్యనిశ్చయవిషయములలో స్త్రీలదే ప్రధానపాత్రయనుట.

సందర్భము :— "తనయ వివాహనిశ్చయ విషయములో మేనకకూడ హిమవంతుని యాశయమునే నంగీకరించెను" అన్న సందర్భములో

"భవం త్యవ్యభిచారిణ్యో పత్యురిష్టే పతివ్రతాః॥" (6–86)

పతివ్రతలు పతి కిష్టవిషయములో నడ్డుతగలరు.

సందర్భము :— "గిరిజ అలంకరించుకొని అద్దములోఁ తన సొగసు నీక్షించి తుష్టయై పతిరాకకై వేచియుండె" నన్న సంద్భములో

"స్త్రీణాం ప్రియాలోకఫలో హి వేషః॥ * (7–22)

తమప్రియులకుఁ గనువిందుగావించగల్గిన స్త్రీల యలంకరణమే సఫలమైనది.

సందర్భము :— "చంద్రుఁడు తన యుదయవేళ తనకుఁ దాత్కాలికముగ గల్గిన రాగమును విడిచి, పరిశుద్ధ మండలము కలవాడయ్యెనని గిరీశుఁడు గిరిజతో" నన్న సందర్భములో

"విక్రియానఖలు కాలదోషజా నిర్మలప్రకృతిషు స్థిరోదయా॥"

(8–65)

కాలదోషమువలనఁ బుట్టిన తాత్కాలిక వికారము స్వతః నిర్మల ప్రకృతికలవారియందుఁ జాలకాలము నిలఁబడదు.

సందర్భము :— "పార్వతీపరిణయానంతరమున మన్మథునకు శాపావసానము గాన ఈ యుక్తకాలములో దేవతలు వచ్చి ఈశ్వరుని మదనుని బ్రతికించమని గోరిరి" అన్న సందర్భములో

"కాలప్రయుక్తాఖలు కార్యవిద్భి ర్విజ్ఞాపనా భర్తృషు సిద్ధిమేతి"

(7–93)

సకాలములోఁ దమ ప్రభువులకు విన్నవించుకొనిన కార్యజ్ఞుల విన్నప (వెంటనే) సిద్ధించును. అనగా ఒకపని సిద్ధించుటకు ఆపని ఫలించు పరిణామకాలము నెఱింగి తగిన సమయములో కార్యజ్ఞులు తమ

* "ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా" (కూ. కు. సం 5–1)

ప్రభువుల కాపనిని విన్నవించుకొన్నచో ఆపని తప్పక సఫలమగును.

ఇక రఘువంశ కావ్యమునుండి కొన్ని సూక్తులు.

సందర్భము :— "దిలీపుని సంతాన ప్రతిబంధమునకు గారణము అతడు నందినీధేనువు నెడల చూపిన యవిధేయతయే" యని వసిష్ఠమహర్షి చెప్పెడు సందర్భములో

"ప్రతిబధ్నాతిహి శ్రేయః పూజ్య పూజా వ్యతిక్రమః॥"

(రఘువంశం 1-79)

పూజింపఁదగినవారిని బూజింపకుండుట ఆ పూజింపనివారి శ్రేయస్సునకు ప్రతిబంధక మగును.

సందర్భము :— "నందినీధేనువు దిలీపుని పరీక్షించు సమయమున 'తనను భక్షించమని"న రాజుతో నందిని చెప్పెడు సందర్భములో

"అల్పస్య హేతో ర్బహుహాతు మిచ్ఛ న్విచార మూఢః
ప్రతిభాసి మే త్వం॥" (2-47)

చిన్న విషయమునకై యమూల్య వస్తువును విడనాడఁదలచిన నీవు, కార్యాఽకార్య విచక్షణలేని మూఢునివలె నుంటివి అనగా అల్పమునకై యనల్పవస్తువును బోగొట్టుకొనువాడు వట్టి మూర్ఖుడు.

సందర్భము :— "రఘుమహారాజు జన్మించినంతనే లోకమంతయుఁ బ్రశాంతమై శుభమును సూచించెను" అన్న సందర్భములో

"భవోహి లోకాఽభ్యుదయాయ తాదృశాం॥" (3-14)

లోకాఽభ్యుదయమునకై పుట్టినవారి పుట్టుక లోకాభ్యుదయ సూచకమే యగునుకదా! అనగా రఘుమహారాజువంటి మహాపురుషుల జన్మసమయము, భావిలోక కళ్యాణమును సూచించు చుండును.

సందర్భము:— "రఘుకుమారునకుఁ జేసిన గురువుల బోధనము వెంటనే ఫలవంతమయ్యెను" అన్న సందర్భములో

"క్రియాహివస్తూపహితా ప్రసీదతి" (3-29)
"ఉత్తమాధికారియగు బాలునికిఁ జేసిన గురూపదేశము వెంటనే ఫలించును."

సందర్భము :— "తనకు శత్రుపక్షములోనివాడైన రఘురాజు యొక్క పరాక్రమమున కింద్రుడు సంతసించెను" అన్న సందర్భములో

పదం హి సర్వత్ర గుణైర్నిధీయతే" (3-62)
సద్గుణములు శత్రుపక్షమువారి నాశ్రయించినను, శత్రు మిత్రభేదము లేక అందరిని అవి సమముగ సంతోషపెట్టును.

సందర్భము :— "రఘు జైత్రయాత్రలోఁ గొందరు మిత్రులు రఘువును శరణువేడుటచే వారు సుఖముగ నుండిరి" అన్న సందర్భములో

"ప్రణిపాత ప్రతీకార స్సంరంభో హి మహాత్మనాం"
మహాత్ముల కోపము పరుల ప్రణామమే హద్దుగ కలది. అనగా పరుల (శత్రువుల) గర్వమే మహాత్ములకు కోపకారణము కాని పరుల జీవనము కాదు. ఈ సూక్తికి భారతీయులు చక్కని నిదర్శనము.

సందర్భము:— "రఘుమహారాజు, శత్రువులనుండి గైకొన్న ధనమంతటిని విశ్వజిద్యాగములో సర్వస్వదక్షిణగా వెచ్చించెను" అన్న సందర్భములో

"ఆదానం హి విసర్గాయ సతాం వారిముచామివ" (4-86)
మేఘము, లావిరిరూపములో సంపాదించిన జలమంతయుఁ ప్రజలకే వినియోగించినట్లు, సత్పురుషులు తమ సంపాదన మంతయుఁ పరోప యోగమునకే వినియోగించెదరు.

సందర్భము :— "దిలీపుడు పరిపాలకుఁడై యుండగా మార్కండఅకును గుశలమే కలుగుచుండు"నని కౌత్సమహర్షి రాజుతోనన్న సందర్భములో

"సూర్యేతపత్యా వరణాయ దృష్టేః కల్పేత లోకస్య కథం
తమిస్రా" (రఘువంశము 5-13)

"సూర్యుడు ప్రకాశించుచున్నంతవఱకు చీకటి, లోకులదృష్టిని ఆవ
రింపఁజాలదు."

సందర్భము:— "సర్వస్వదక్షిణచే పేదతనము వహించియున్న
రఘువుయొక్క నిర్ధనత్వముకూడ శ్లాఘ్యతరము" అన్నసందర్భములో

"పర్యాయపీతస్య సురైర్హిమాంశోః కలాక్షయ శ్లాఘ్య
తరోహి వృద్ధేః॥ (5-16)

కృష్ణపక్షమున దేవతలు చంద్రకళలను పానముచేయుటచే చంద్రు
నకుఁ గల్గిన తత్కలాక్షయము, తత్కలాఽభివృద్ధికంటె నెక్కుడుగఁ
గొనియాడఁదగినది. పరోపకారముచే గల్గిన నిట్టి కృశత్వము కలవా
రందఱును మిగుల శోభించుచుందురని భర్తృహరి తన సుభాషిత
త్రిశతిలో

"మణిశ్శాణోల్లీఢః సమర విజయీ హేతిదళితో
కలాశేష శ్చంద్ర స్సురత మృదితా బాల వనితా ।
తనిమ్నా శోభంతే గళితవిభవాశ్చార్థిషు నరాః॥"

కనుక ఉదారస్వభావు లిట్టి కృశత్వమునే కోరుచుందురు.

సందర్భము :— "అజమహారాజుయొక్క బాణహతివలనఁ
దన తొంటిరూపము పొందిన గంధర్వ రాజకుమారుఁడు, అజునితో
మతంగమహర్షియొక్క కోపానంతర కాలిక శాంత ప్రకృతిని దెలుపు
సందర్భములో

"ఉష్ణత్వమగ్న్యాతపసంప్రయోగాత్ శైత్యం హి యత్సా
ప్రకృతి ర్జలస్య॥" (5-54)

అగ్ని, ఆతపము అను వీనిసంబంధమువలననే, నీటికిఁ దాత్కాలికమైన
ఉష్ణత్వగుణ మబ్బునుగాని, స్వతః జనించిన జలప్రకృతి శైత్యగుణము.

సందర్భము :— "స్వయంవరములో ఇందుమతి తన మనో హరుని జేరినపిమ్మట అటనుండి మరియొకనివద్దకు వెళ్ళలేదు" అను సందర్భములో

"నహి ప్రఫుల్లం సహకారమేత్య వృక్షాంతరం కాంక్షతి షట్పదాళిః॥" (6-69) రఘువంశము)

చక్కఁగ పూచి వికసించియున్న తియ్యమామిడిని జేరిన తుమ్మెద పంక్తి, అటనుండి యింకొక చెట్టును జేర నుంకించదు. పై భావమునే యీ కవి, కుమారసంభవములో హిమవంతుడు గిరిజాకుమారియందు ఆదరముకలవా డయ్యె నను సందర్భములో

"అనంతపుష్పస్య మధోర్హి చూతే ద్విరేఫమాలా సవిశేషసంగా"

(కు. సం. 1 సర్గ 27 శ్లో)

ఇక రఘువంశములో మిగిలిన 13 సర్గలలో నిట్టె సూక్తిమౌక్తికము లీ కావ్యలక్ష్మికి సుందరాభరణములై చెన్నొందుచుండును.

ఇక మేఘసందేశమునుండి కొన్ని సూక్తులు.

సందర్భము :— మానవులచేఁ బంపఁదగిన సందేశమును ఒక మేఘునిచేఁ బంపుట, లోకవిరుద్ధమని యెంచకయే యక్షుఁడు మేఘుని యాచించెను" అను సందర్భమున

"కామార్తా హి ప్రకృతి కృపణా శ్చేతనాఽచేతనేషు"

(చూ మేఘసందేశం 1-5)

"మదనబాధితులైనవారు చేతనాఽచేతన జ్ఞానవిషయములో ప్రకృతి చేతనే దీనులు". ఇట అచేతనులైన మేఘుని యాచించుటచే యక్షుని యుక్తాఽయుక్త వివేక రాహిత్యము స్పష్టమగును.

సందర్భము :— యక్షుఁడు మేఘునితో "మహాకులమునఁ బుట్టిన నీయొక్క ఘనతను దెలిసి, బంధువులు కల నేను, నిన్నర్థించు చుంటిని" అన్న సందర్భములో

"యాచ్ఞామోఘా వరమధిగుణే నాఽధమే లబ్ధకామా" (1-6)
అధిక గుణవంతుని యాచించిన యాచన వ్యర్థమైనను మంచిదేకాని, అధముని యాచించిన యాచ్ఞ సఫలమైనను శ్రేష్ఠముకాదు. అనఁగా ఉత్తములనే యాచించవలెను గాని యధములను యాచించవలదు. ఇట్లే, సద్భావ సహకృతమైన యుపకారము మహాత్ములయెడ నచిరమున ఫలద మగును.

"సద్భావార్ద్రః ఫలతి నచిరే ణోపకారో మహత్సు" (1-18)

సందర్భము :— వర్షించినపిమ్మట నర్మదాజలమును గ్రహించి పయనించమని యక్షుఁడు మేఘునితో జెప్పిన సందర్భములో

"రిక్తస్సర్వో భవతిహి లఘుః పూర్ణతా గౌరవాయ"(1-20)
"లోపట సరుకులేని ప్రతివాడును చులకనగును. కనుక పూర్ణత్వము గౌరవప్రదము" ఇట వివిధములైన యర్థములు చెప్పవచ్చును. ఉదా:— నిర్ధనుఁడు చులకనగును. ఆర్థికముగ పూర్ణత్వము గౌరవ ప్రదము. బలములేనివాడు చులకనగ నుండును. కనుక బలము కలిగి నచో బరువుగ నుండును. లోపట బరువులేనివాడు చులకనై పైకెగురఁ గొట్టబడును. కనుక లోపట బరువుకల్గి యుండవలెను. కాని యిట ధ్వన్యర్థము మనోహరముగ దోచును. ఆరోగ్యము చెడినవానికి వమనములద్వారా శోధనచేయుటచే కడుపులో రిక్తత,కాళీ యేర్పడును. పిమ్మట శ్లేష్మశోషణమునకు కషాయసేవనము చేయుటచే లఘుత్వము' వర్పడి పూర్ణత్వ (బల)ము కల్గుటచే వాతప్రకోపము కలుగదు.

సందర్భము :— మార్గములో దవాగ్ని వ్యాపించినచోట ఆగి శమింపజేసి వెళ్ళుమని యక్షుఁడు మేఘునితో జెప్పిన సందర్భములో

"ఆపన్నాఽర్తి ప్రశమన ఫలా స్సంపదో హ్యుత్తమానాం"
(1-57)

ఉత్తములసంపదలు ఆపన్నుల యార్తిని బోగొట్టుటకే యుద్దేశింపఁ బడినవి.

సందర్భము :— యక్షుఁడు మేఘునితో "నా పత్నియొక్క పరిస్థితినిజూచి నీవును కన్నీరు విడిచెదవు" అన్న సందర్భములో

"ప్రాయ స్సర్వోభవతి కరుణా వృత్తి రార్ద్రాంతరాత్మా" (2-32)

మెత్తని హృదయముకల ప్రతివాడును ఇతరుల కష్టములఁజూచి దయార్ద్ర హృదయు డగునుగదా! ప్రస్తుతమున మేఘుని హృదయము ద్రవ స్వరూపమైనది. నీటిమయము. అనగా ఘనుడు "ఆర్ద్రాంతరాత్మ" ఆర్ద్రాంతరాత్మ కలవాడెల్ల, కరుణావృత్తి కలవాడే యగును. మేఘుడు నీటిని విడువకయుండునా ?

సందర్భము :— "నా సందేశమును ఆప్యాయముగ నాపత్ని వినఁగలదు" అని యక్షుడు మేఘునితో నన్న సందర్భములో

"..........సీమంతినీనాం। కాంతోదంత స్సుహృదుపనతః

సంగమాత్కించి దూనః॥" (2-39)

స్త్రీలకు స్నేహితునిద్వారా అందిన తమ మనోకాంతుని క్షేమవార్త, తన కాంతునితో గల్గిన సంగమముకంటె కొంచెమే తక్కువ.

సందర్భము :— "యక్షుడు మేఘుని ముఖమున కాంతకుఁ తన సందేశమును వినుపించు సందర్భమున "ఓ కల్యాణీ! మనము తిరిగి కలిసికొన్నపు డనేకరీతుల సుఖించగలము" అను నాశతో నుంటిని. నీవు నిశ్చింతయుండుము. శాపావసానకాలము దగ్గరకు వచ్చినది" అన్న సందర్భములో

"నీచై ర్గచ్ఛ త్యుపరిచదశా చక్రనేమి క్రమేణ" (2-49)

ప్రతి మానవునియొక్క జీవితదశయు చక్రపుటంచురీతిని క్రిందకును పైకిని దిరుగుచునే యుండును. జీవితములో మానవుల కొకమారు సుఖమువచ్చిన, మరుసారి కష్టము వచ్చుచుండును.

సందర్భము :— "యక్షుని సందేశమును మేఘుడు యక్ష

పత్నితో జెప్పగా నామె ఆ సందేశముతో స్వస్థచిత్తురా లయ్యెను"
అను సందర్భములో

"కేషాం నస్యా దభిమతఫలా ప్రార్థ నాహ్యు త్తమానాం"

ఉత్తముల నుద్దేశించి చేసిన ప్రతి మానవుని ప్రార్థనయు నభిమత ఫలము నిచ్చును. ఇంకను నిట్టి సూక్తులు, ఇతని నాటకములలో గలవు.

"ప్రాయస్స్వం మహిమానం క్షోభా త్ప్రతిపద్యతేహి జనః"

(చూ. శాకుంతల నాటకం 6 అంకం)

పై రీతిగా కాళిదాసకవి తత్తత్సందర్భములలోఁ జెప్పిన సూక్తులు మానకు లోకస్వభావమును దెలుపుటలో నుత్తమోత్తమ సాధనములగుచున్నవి. కనుక లోకజ్ఞానము సంపాదింపగోరిన ప్రతివ్యక్తియు నీ కవీంద్రుని కమనీయ మహనీయ సూక్తిమాక్తికములను కంఠహార మొనర్చుకొన్నచోఁ దమజీవితమునే యలంకరించుకొనిన ట్లగును. కనుక నితని ప్రతియొకసూక్తిని బ్రతివాడును దప్పక తత్పరతతో గంఠస్థ మొనర్చుట ముఖ్య కర్తవ్యమై యున్నది.

---

ఓమ్

# కాళిదాస హృదయము

## శ్రీ కాళిదాసు — ధర్మశాస్త్రవిజ్ఞానము

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" *

విశ్వకల్యాణమునకు "ధర్మము" మూలమగుచున్నది. ధర్మము సత్కీర్తి సంధాయకము. విశ్వములోని విశిష్టకీర్తి విశ్వకల్యాణ కారకము. కాఁగా ధర్మము పరంపరా సంబంధమును బట్టి ప్రపంచ సంస్థితికి మూలకారణ మగుచున్నది. దీని వ్యుత్పత్త్యర్థముకూడఁ బై విషయమునే విశదీకరించుచున్నది. విలోకింపుఁడు.

"ధ్రియత ఇతి ధర్మః"

"ధర్మ" శక్తిచేతనే యీ చరాచర ప్రపంచము ధరింపఁబడుచున్నది.

"ధారణా ద్ధర్మ ఇత్యాహుః"

అను సూక్తి కూడఁ బై విషయమునే సుస్పష్టము చేయుచున్నది.

పై విధముగా ప్రపంచ మాంగల్యమునకు మహితకారణము లైన యీ 'ధర్మములు' శ్రీ కాళిదాస కావ్యములందు సందర్భాను సారముగాఁ బొదుగఁబడి యున్నవి. శ్రీ కోలచల మల్లినాథసూరి తన సంజీవినీ వ్యాఖ్యలోఁ బై ధర్మములకుఁ జక్కని ప్రమాణవచన ములను శ్రుతి స్మృతి పురాణాదులనుండి యుద్ధరించి చూపి, యనేక ధర్మసూక్ష్మములను పాఠకలోకమునకు సుపరిచితము సేసినాఁడు. ఈ వ్యాఖ్యయే లేనిచో కాళిదాస కవితామాధురి యిప్పటికిని మఱుఁగు పడి యుండెడిదేమో. ♦

---

* తైత్తరీయోపనిషత్సూక్తి.

♦ "భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యావిషమూర్ఛితా।
ఏషా సంజీవినీటీకా తా మద్యోజ్జీవయిష్యతి॥" (మల్లినాథసూరి)

చూ. రఘువంశ వ్యాఖ్యారంభము.

శ్రీ కాళిదాసకవి తన కుమారసంభవములోఁ బార్వతీజననము నకు ముందుగ "మైనాక" వర్ణనమును జేసినాఁడు 'భ్రాతృమతియైన కన్యకయే వివాహమునకు యోగ్యమైనది' అను భారతీయ ధర్మమును పాఠకులకుఁ దెలుపుటకే పై వర్ణన ముద్దేశింపఁబడినది. ఈ ధర్మమునకుఁ బ్రమాణమును జూపుచు మన మల్లినాథసూరి తన సంజీవినీవ్యాఖ్యలో

"పితా నజ్ఞాయతే యస్యాః భ్రాతా యది న విద్యదే।
నోపయచ్ఛేత్తు తాం కన్యాం ధర్మలోపభయా త్సుధీః॥"

"ఏ కన్యకకు తండ్రి ఫలానా అని తెలియకుండునో, ఏ కన్యకకు సహోదరుఁడు లేఁడో, అట్టికన్యకను బుద్ధిమంతుఁడు వివాహమాడరాదు" ఇది ధర్మానుశాసనము. ఈ ధర్మవిషయమునే కృష్ణయజుర్వేదమంత్ర పన్నములోని యొక మంత్ర మిట్లు విస్పష్టము సేయుచున్నది."

"అభ్రాతృఘ్నీం వరుణాఽపతిఘ్నీం బృహస్పతే."

వరుఁడు తనవివాహవేళ, నూతన వధువును వినూత్నముగ విలోకించు నపుడు వరుణదేవుని సంబోధించి 'ఈమెకు సోదరసంపద సుస్థిరమగుఁ గాక' యని ముందుగాఁ గోరును. కాఁగా మన కాళిదాసు సూచించిన యీ శ్రుత్యర్థమును స్పష్టీకరించెడి స్మృతినిజూపి మన సూరి పై ధర్మ మును పాఠకులమనస్సులలోఁ బాదుకొల్పినాఁడు. ఈ స్మృతిప్రమా ణమునే సూరి చూపకున్నచో కాళిదాసుయొక్క భావ మగమ్యగోచరమై యీపాటికంతరించి యుండెడిదేమో ? ఎవరికెఱుక ?

ఇట్టి విశిష్ట ధర్మవిషయములు కాళిదాసకృతులలో లెక్కకు మిక్కిలిగ నున్నవనుటలో నీక్రింది యుదాహృతులే నిదర్శనములు కాఁగలవు. ఈకవి, పార్వతీదేవిచే పంచాగ్నిమధ్య తపమును జేయించు సందర్భమునఁ జెప్పిన శ్లోకభావ మిది.

"పార్వతీదేవి, తనకు నాల్గువైపులను అగ్ని ప్రజ్వరిల్లుచుండఁగా గ్రీష్మకాల మధ్యందినసమయమునఁ గన్నులు మిఱుమిట్లు గొల్పుచున్న

సూర్యుని తదేకధ్యానముతోఁ జూచుచుఁ దపము సేయసాగెను.' (చూ. కు. సం. సర్గ 5. శ్లో 20). ఈ శ్లోకములో '...చతుర్ణాం జ్వలతాం హావిర్భుజాం...' అని నాల్గు అగ్నులే పేర్కొనఁబడినవి. ఈనాల్గు అగ్నుల మధ్యను నిలిచిచేయు తపము పంచాగ్నితపము కాఁగలదా? అను సందేహము జనించును. కాని 'సూర్యుఁడుకూడ నొకయగ్నియే' అను విషయమును

'అగ్ని స్సవితా సపత్నై వాఽగ్నిః'

అను శ్రౌతవచనము స్పష్టముచేయుచున్నది. ఈ శ్రౌతవచనార్థమునే పై విధముగా మన మహాకవి పంచాగ్నిమధ్య తపస్సందర్భమున మనకుఁ దెలిపినాఁడు. ఇంతియేకాక యిట నింకొక విశేషముకూడఁ గలదు. 'గ్రీష్మకాలములో పంచాగ్నిమధ్యతపమునే చేయవలయును. వర్షా కాలములోఁ దపస్సుచేయువారు కేవలభూమిమీఁదనే పరుండవలెను.' అను ధర్మవిశేషమునకుఁ బ్రమాణవచనముగాఁ దన సంజీవినిలో

'గ్రీష్మే పంచాగ్ని మధ్యస్థో వర్షాసు*స్థండిలే శయః'

అను వచనమును సూరి జూపినాఁడు. సూరిచూపిన యీధర్మనిదర్శ నమును బట్టియే మన కాళిదాసు పార్వతియొక్క వర్షాకాలతపమును వర్ణించుచు

"శిలాశయాంతామనికేతవాసినీం నిరంతరా స్వంతరవాతవృష్టిషు । వ్యలోకయ న్నున్మిషితై స్తటిన్మయైః మహాతపస్సాక్ష్య ఇవస్థితాః క్షపాః॥" (5-25)

"గిరిజ వర్షాకాలపు రాత్రులందు విపరీతమైన గాలి, వానయు వేధించుచుండఁగా వట్టిఱాలపైఁ బరుండి కఠోరముగాఁ దన తపమును సాగించుచున్నది. ఇట్టి యీమె కఠోరతపమును దమ కన్నులారఁ గాంచుచున్నట్లు నాఁటిరాత్రులు, తమ మెఱుపుదృష్టులతో సాక్షులై

* పక్కలేని వట్టినేల.

చూచుచున్నవి." ఇట మొదటిపాదమునకుఁ బ్రమాణము "వర్షాసు స్థండిలేశయః" అని చూపఁబడినది. ఇఁక ద్వితీయపాదార్థమునకుఁ బ్రమాణమును జూపుచు సూరిమహాశయుఁడు మానవులకువలె రాత్రులకుఁగూడ నీక్షణశక్తియున్నదని

"ఆదిత్య చంద్రా వనిలో ఒనలశ్చ ద్యౌ ర్భూమి రాపో హృదయం యమశ్చ। అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే సరస్య జానాతి సమస్తవృత్తం॥"

ప్రతిమానవుని ప్రవర్తనమును సర్వకాలసర్వావస్థలయందును గనిపెట్టుచుఁ బదునాల్గుమందిసాక్షులు సర్వదా చూచుచుందురు. వారెవరనఁగా సూర్యచంద్రులు 2, అగ్ని 3, వాయువు 4, ఆకాశము 5, భూమి 6, జలము 7, హృదయము 8, యముఁడు 9, రాత్రి 10, పగలు 11, రెండుసంధ్యలు 13, ధర్మము 14 ఈ పదునాల్గుమంది సాక్షులును అందఱియాశయములను గనిపెట్టుచుండును. ప్రస్తుతమునఁ బైపదునాల్గింటిలో నొకటియగు 'రాత్రి' గిరిజయొక్క మహాతపమునకు సాక్షియైయున్నది. ఈ విశిష్టవిషయమును మన మహాకవి యిట సందర్భానుసారముగ మనకు బోధించి, పాపభావపంకిలములగు కొందఱి చిత్తములకుఁ బ్రకాశమార్గమును జూపినాఁడు ఇంతమది సాక్షులమధ్య బ్రతుకుచున్న మానవుఁడు ఎవరికిఁ దెలియకుండుననుకొనుచు మోసపుఁ బన్నుగడలతోఁ దనవారిని మోసగించుచుఁ దన్ను ధన్యమ్మన్యునిగా నెంచి జీవించుట ఎంతటి మూర్ఖతాప్రభావమో కదా! ఎంతటి యుపహాస్యకరకృత్యమో కదా! న్యాయాధికారి సన్నిధిలో నొకనిని హింసించి యాహింసాకృత్యమును నోరు లెఱుంగకుండఁ జేసితినని బుజములెగురవేసికొన్నవాని కృత్యమువంటిదే, పైకృత్యముకదా! దీనికి నిష్కృతి? అనుభవము. ఇట్లే యీకవి, పుష్యమాసరాత్రులలోఁ బార్వతీదేవిచే జలములలో నిలిచి తపస్సుచేయించుటకుఁ బ్రమాణము, మనుస్మృతివచనము.

"అప్సువాస స్తు హేమంతే క్రమశో వర్ధయే త్తపః"

'హేమంత ఋతువులలో నీళ్ళలోనుండి తపస్సుచేయువారి తపము క్రమాభి వృద్ధిఁ జెందును.'

ఇట్లే మాయావటువు పార్వతితోఁ బ్రసంగించు సందర్భమున (5-38) 'ఓ భామినీ! నీవు పురుషార్థత్రయములో ద్వితీయ తృతీయ పురుషార్థములను వీడి మొదటిదగు 'ధర్మ'మునే సేవించుచుండుటచేఁ బురుషార్థములలోకెల్ల "ధర్మమే" శ్రేష్ఠతమ మని భావించెదను.' అని మన కవీశ్వరుఁడు ఈశ్వరపాత్రచే నిట్లు పలికించుటలో నితని యొక్క యీక్రింది యుపనిషదర్థవిజ్ఞానమే మూల మనుకొందును.

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా। లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి। ధర్మేణ పాప మపనుదతి। ధర్మే సర్వం ప్రతిష్ఠితం తస్మాత్ ధర్మం పరమం వదంతి॥" (చూ. తైత్తరీయోపనిషత్తు.)

ఇట్లే మాయావటువు మాటిమాటికిని బరమేశ్వరనింద సేయు చున్నప్పుడు పార్వతి తన చెలికత్తెతో,

"ఓ చెలీ! ఈ వటు వింకను నీశ్వరనిందకుఁ బూనుకొను చున్నాఁడు. కనుక నీవు వీని నిటనుండి గెంటివేయుము. కారణ మేమనఁగా ఈశ్వరనింద సేయువాని కొక్కనికేకాదు పాపము. ఆ నిందను వినువారికిఁగూడ పాప మంటుకొనును" 'మహాపురుషులకుఁ జెందిన నిందను వినువారుకూడఁ బాపాత్ములగుదురు.' * దీనికిఁ బ్రమాణముగా సూరి,

"గురోః ప్రాప్తః పరీవాదో న శ్రోతవ్యః కదాచన।
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గంతవ్యంవా తతోఽన్యతః॥"

"గురుజనులకుఁ జెందిన నిందను శిష్యులు వినరాదు. చెవులనైన మూసికొనవలెను. లేక మఱియొకచోటికైనఁ బోవలెను. ఎట్లైనను

* సర్గ 5 శ్లో. 83.

శ్రేయస్కామికి గురునిందాశ్రవణము పాపజనకము. గాన దాని నెట్లయిన వినకుండ నుండవలెను." ఔరా! మన మహాకవిచే తన కావ్యరత్న పేటికలో నెన్నిరకముల ధర్మరత్నములు భద్రపఱుపఁబడినవో! ఇవన్నియు నధికారులగు పాఠకోత్తములకొఱకే యుద్దిష్టములై యున్నవికదా! శ్రీ "మల్లినాథసూరి"యను తాళముచెవి మనకుఁ బ్రాప్తించనిచో నీ కావ్యరత్న పేటికలోని యమూల్యరత్నములు మనకింతసులభముగ లభించియుండెడివి కావేమో?

ఇట్లే యీశ్వరాజ్ఞ దేశముపై రాయబారులుగా వచ్చిన సప్తర్షులకు - ఈశ్వరునికై గిరిజ నడుగవచ్చినవారికి - * సమాధానముగా హిమవంతుఁడు తన కన్యకనుగూర్చి యిట్లు పలుకును.

"అమ్మా! ఓ గౌరీ! ఇటురమ్మా. ఇదిగో సప్తర్షులు రాయబారులై యీశ్వరునికిఁ బత్నిగా నిన్నడుగ వచ్చినారు. కనుక నే నందుల కంగీకరించి నిన్ను ఆ తపస్వికై 'భిక్ష'గా నొసంగదలఁచితిని. వచ్చినవారు సాక్షాన్మునీశ్వరులు. వరుఁడు విశ్వభర్త. నా గృహస్థజీవితము ధన్యమైనది." చూ. (6-88) ఇట గిరిరాజు తన తనయను ఈశ్వరుని కియ్యకొనుటను కాళిదాసు 'భిక్ష' అని పేర్కొనుటలోఁ గల ప్రమాణమునుగూర్చి మన సూరిమహాశయుఁడు ఈ క్రింది స్మృతి వాక్యముఁ జూపినాఁడు.

"రత్నాది స్తంబపర్యంతం సర్వం భిక్షాతపస్వినః"

"తపస్వికిఁ జేసెడు ప్రతిదానము అనఁగా రత్నము మొదలు చిన్న ♦ మొక్కవఱకుఁ గల వస్తువులలో నేవస్తువైనను 'భిక్ష' క్రిందనే పరిగ

---

* "సుహృదస్సమవేతాన్ మంత్రవతోవరాన్ ప్రహిణుయాత్। (వరః) మవర్థం కన్యాంవృణీధ్వం" ఇతివరాన్ ప్రేషయతి॥ చూ. ఆపస్తంబ గృహ్యసూత్రము. ఈ సంప్రదాయమునుబట్టి "నేఁటి కట్నములు నాఁడు లేవు," అని చెప్పవచ్చును.

♦ చూ. శబ్దరత్నాకరములో 'స్తంబము'

ణింపఁబడును". కనుక మన మహాకవి, పై ధర్మమునుబట్టి యీ తపస్వికిఁజేయు కన్యాదాన విషయమునుగూడ 'భిక్ష' అని వాకొనినాడు. ఈ విషయమును మనము మన సూరిసత్తముని వలననే తెలిసికొనగలిగితిమి కదా! పై శ్లోకార్థమునుబట్టి పూర్వకాలమునుండియు వరుఁడు కన్యావరణకై తన స్నేహితులను గన్యాదాతవద్దకు "మదర్థం కన్యాం వృణీధ్వం" అని చెప్పిపంపుటయు వారి యభ్యర్థనమున కనుకూలముగా దాత "వృణీధ్వంతస్మై దాస్యామి" అని తనయంగీకారమును దెలుపుట, అను మన సనాతన సంప్రదాయ మిట మన మహాకవిచేఁ జక్కఁగఁ జూపఁబడినది. ఈ యాచారముచే నాఁటి జనసంఘము నేటి "వరశుల్క" బాధనుండి ఎంతగ రక్షింపఁబడినదో కదా! ఆపస్తంబ మహర్షి మున్నగు సూత్రకర్తలు లోకకల్యాణమునుగోరియే కదా తమసూత్రములలో నిట్టి లోకహితకర సాంప్రదాయములను జేర్చినారు. లోకశ్రేయస్సు, సంఘసౌభాగ్యము, తద్ద్వారమున లోక కళ్యాణము అను వీనియందు మనమహర్షుల కెంతయాసక్తియో! ఎంత చక్కని మక్కువో! ఇట్లే మనమహాకవి, ఈశ్వరపరిణయ మహోత్సవానంతరమున ఈశ్వరునిచే మామగారికి నమస్కరింపఁజేయును. ఈ సందర్భములో మన సూరిమహాకవి ప్రమాణమును జూపుచు నెవరెవరు నమస్కరింపఁదగినవారో మన కిట్లు తెలియఁజేసినాఁడు.

"ఋత్విక్పితృవ్య శ్వశుర మాతులానాం యవీయసాం।
ప్రవయాః ప్రథమం కుర్యా త్ప్రత్యుత్థాయాభివాదనం॥"

'ముందుగాలేచి నమస్కరింపఁదగినవారు ఎవరనఁగా ఋత్విజులు, పినతండ్రులు, పెత్తండ్రులు, మామగారు, మేనమామలు. శ్రేయోభిలాషి యగువాఁడు లేచి వీరికి నమస్కరించవలెను.'

"....లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి।
యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః॥"

అను గీతావాక్యమునుబట్టి, యెట్టి ప్రభువులైనను ముందుతరముల వారికిని, అప్పటివారికిని మార్గదర్శకముగా స్వస్వ ధర్మము నాచరించవలెను'' అను ధర్మరహస్యమును దెలుపుటకే మనకాళిదాసు మహేశ్వరునిచే మామగారైన హిమవంతునికి వందనము చేయించినాఁడు. ఇట్టి భారతీయ దివ్య సాంప్రదాయములు ఒక్క భారతదేశమునకేకాక ప్రపంచమునకే శ్రేయోదాయకము లనుటలో సందేహము లేదు. చూ. కు. సం. (సర్గ. 7 శ్లో. 54) ఇట్లే ''ఈశ్వరుఁడు పునస్సంధానాఽగారమునఁ బ్రవేశించినాఁడు'' అను సందర్భమున మన కాళిదాసు 'భూమిపైఁ బక్క కల కేళీగృహమును బ్రవేశించినాఁడ'ని తెలిపినాఁడు.

''....క్షితివిరచితశయ్యం కౌతుకాగార మాగాత్॥''

చూ. (కు. సం. సర్గ. 7 శ్లో 94)

ఈ యాచారమునకుఁ బ్రమాణమును జూపుచు మన మల్లినాథయజ్వ ఆశ్వలాయనసూత్రము నుద్ధరించినాఁడు. (7-94)

"అత ఊర్ధ్వం అక్షారలవణాశినౌ, అధశ్శాయినౌ, బ్రహ్మచారిణౌ స్యాతాం"

ఈ విషయమునే ఆపస్తంబ సూత్రకారుఁడు కూడ

"త్రిరాత్ర ముభయో రధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ వర్జనంచ"

అని సూత్రించినాఁడు. అనఁగా వివాహానంతరమున మూఁడు రాత్రులవఱకు ఆ నూత్నదంపతులు ఉప్పు, కారములేని సాత్వికాహారముఁ దినుచుఁ, గ్రిందఁబరుండి బ్రహ్మచర్యము సలుపవలెను. ఈ సూత్రార్థమునే, ఆరోగ్యశాస్త్ర మనఁదగిన కామశాస్త్రమిట్లు విస్పష్టముగా వివరించుచున్నది.

''అధపరిణయరాత్రౌ ప్రక్రమేన్నైవకించిత్ త్రిస్వపి చర జనీషు స్తబ్ధభావా ధునోతి । త్రిదిన మిహ న భింద్యాద్ బ్రహ్మచర్యం నచా స్యా హ్యదంపమనసుమధ్య స్వేచ్ఛయా నర్మ కుర్యాత్॥''

ఇప్పటి కొంతమంది వరులు ఈ శ్లోకార్థమును దెలియఁదగి యుండిరి. "వివాహమునాఁటిరాత్రి వరుఁడు తన వధువుతో ప్రారంభోత్సవమునకుఁ బ్రయత్నించరాదు. కారణ మేమనఁగా నూతన వధువు వివాహాది త్రిరాత్రపర్యంతము భావచలనములేక స్తబ్ధత చెందిన భావముతో నుండును. గనుక నీ త్రిరాత్రములలో వరుఁడు బ్రహ్మచర్య వ్రతదీక్షితుఁడు కావలెను. ఇచ్చట నింకొక విశేషముకలదు. కృష్ణయజుర్వేదీయ మంత్రపన్నములలో నొక మంత్రార్థమునుబట్టి స్త్రీకి మొదటివరుఁడు సోముఁడనియుఁ దరువాతివాఁడు గంధర్వుఁడనియు మూఁడవవాఁడు అగ్ని యనియు నాల్గవవాఁడు మనుష్యుఁడనియుఁ గలదు. * కనుక సోముఁడు గంధర్వునకు, గంధర్వుఁ డగ్నికి, అగ్ని మానవునకుఁ గన్యక నీయవలెను. కనుక నాల్గవవాఁడైన మానవ వరునికి నాల్గవరోజుననే ఆ నూత్నవధువుపై అధికార మేర్పడును. కనుక నీ భారతీయసాంప్రదాయమునుబట్టి వివాహములో నాల్గవరోజు చేయఁదగిన శేషహోమపునస్సంధానమంత్రములను పురోహితులు కేవలవాచికముగా నాల్గవనాఁ డేకరువు పెట్టుచుండుట నేఁటికిని భారత దేశమున సంప్రదాయమై యున్నది. దీనినే

"శేషగ్ం సమావేశనే జపేత్"

అని ఆపస్తంబుఁడు సూత్రించినాఁడు. పై సూత్రములలోని పరమార్థమును బాగుగ గుర్తెఱింగిన మన మహాకవి "క్షితివిరచితశయ్యం కౌతుకాగారమాగాత్" అని వర్ణించి సూరిమహాశయుని ముఖమున మనకుఁ బై విశిష్టధర్మవిషయములను విస్పష్టముచేసినాఁడు. భారతీయ భవ్యసంప్రదాయరత్నములకుఁ గాళిదాసకావ్యములు రత్నపేటికలనుట సమంజసమేకదా! ఇట్లే వివాహసమయములో వధూవరులను ఉమామహేశ్వరు లావహింతురు. ♦

---

* "సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః ।
తృతీయో అగ్నిష్టే పతి స్తురీయ స్తే మనుష్యజాః...||" (మంత్రపన్నము)

♦ చూ. కు. సం. సర్గ 7. శ్లో 78. ఇది శాస్త్రసమ్మత విషయము.
"వివాహసమయే గౌరీశివే వధూవరా వనుప్రవిశేతా మితి." అగమః||
7-78 వ్యాఖ్య.

ఇట్లే మునులు సంధ్యాసమయమున అర్ఘ్య ప్రదానము విడిచిరను సందర్భమున మన మహాకవి యిట్లనుచున్నాఁడు.

'అర్ఘ్యప్రదానసమయములో శాస్త్రజ్ఞులైన మునులు తమ కాలిమడమలు నేలకుఁ దగులకుండఁ బైకెత్తి పవిత్రోదకములుకల దోసిళ్ళతో నర్ఘ్యప్రదానము లిచ్చుచు నక్షత్రోదయమువఱకు గాయత్రిని దమలో జపించుచున్నారు.' దీని మూల మిట్లున్నది.

'పార్ష్ణిముక్తవసుధా స్తపస్వినః పావనాంబురచితాంజలి క్రియాః। బ్రహ్మ గూఢ మభిసంధ్య మాదృతాః శుద్ధయే విధివిదో గృణంత్యమీ॥' చూ. (కు. సం. సర్గ 8. శ్లో 47)

ఇట మునులు తమ కాలిమడమల నెత్తి యర్ఘ్యప్రక్షేపణ మొనర్చుటకుఁ బ్రమాణముగా శ్రీ సూరి శ్రౌతి చూపిన స్మృతి వాక్య మిట్లున్నది.

"గోశృంగమాత్ర ముద్ధృత్య ముక్తపార్ష్ణిః క్షిపే జ్జలం"

ఇఁక పద్యతృతీయపాదమునకుఁ బ్రమాణమిచ్చుచు సూరి

"జప న్నాసీత గాయత్రీం ప్రత్య గాతారకోదయాత్"

అని చూపినాఁడు. "విధివిదః" అను విశేషణముచే "జ్ఞాత్వాకర్మాణి కుర్వీత" అను విధినిబట్టి మనముచేయు ప్రతికర్మము నర్థజ్ఞానము, ఆదరముతోను జేయవలయుననియు, "శుద్ధయే" అను పదముచే నట్టి యర్థవత్క్రియాచరణమే మానవుని చిత్తశుద్ధికిఁ గారణమై మోక్షప్రద మగుననియు, నటఁ బాఠకోత్తములకుఁ దెలుపుచు నిట్టి కర్మాచరణ ముతో చిత్తశుద్ధిని, మోక్షమును, పొందవలెనని కాళిదాసకవి పాఠకు లకు బ్రోత్సహించుచున్నాఁడు.

ఇట్లే యీశ్వరుఁడు తాను సంధ్యాకాలములోనే సంధ్యవార్చు టకుఁగల కారణమును దన ప్రాణేశ్వరికిఁ దెలుపుసందర్భమున మా మహాకవి యీశ్వరముఖమున "ఓ కోమలాంగీ! పూర్వము బ్రహ

'అగ్నిష్వాత్త" మున్నగు పితృదేవతలను సృజించిన పిమ్మట తాను విసర్జించిన శరీరమే సంధ్యారూపమై, ద్విజులచే సాయంప్రాతస్సమయములయందు సేవింపఁబడుచున్నది. ఓ మానినీ! (ఆలోచనలేనిదానా! అని సంబోధన కర్థము) ఇట్టి సంధ్య, సాక్షాత్ బ్రహ్మస్వరూపమేయై యుండుటచే నిట్టి సంధ్యయందు నా కింతటి గౌరవము కలదు" చూ. కు. సం. (8-52). ఈ విశిష్టధర్మవిషయమునకుఁ గల ప్రమాణమును మన సూరివిద్వన్మణి భవిష్యత్పురాణమునుండి ఇట్లు ఉద్ధరించినాఁడు.

"పితామహః పితౄన్ సృష్ట్వా మూర్తిం తా ముత్ససర్జ హ।
సా ప్రాత స్సాయ మాగత్య సంధ్యారూపేణ సేవ్యతే।
ఏతాం సంధ్యాం యతాత్మానో యే తు దీర్ఘ ముపాసతే।
దీర్ఘాయుషో భవిష్యంతి నీరుజః పాండునందన॥"

పై భావమే మనకవిచే సమముగాఁ జూపఁబడినది.

ఇట్టి ధర్మసూక్ష్మము లీ కుమారసంభవమున నింకను గలవు. *
ఇఁక నీ కవి రఘువంశకావ్యములోఁ జూపిన ధర్మవిషయములను గొన్ని విలోకించుదము.

దిలీపమహారాజు భార్యాసమేతుఁడై వసిష్ఠాశ్రమముఁ జేరి యట వసిష్ఠుని సందర్శించు సందర్భమున "స్వాహాదేవిచే అగ్నివలె, అరుంధతీదేవిచే ఆరాధింపఁబడుచున్న వసిష్ఠమహర్షిని, దిలీపుఁ డాతని యనుష్ఠానానంతరకాలమందు సందర్శించెను" అని చెప్పినాఁడు. (చూ. రఘువంశకావ్యము సర్గ 1. శ్లో. 56) ఇట వసిష్ఠుని అనుష్ఠానానంతరమందే రాజు మునిని సందర్శించుటకుఁ గల కారణమును జూపుచు సూరి, తన సంజీవినిలో —

---

* "మానవులు ముందుగా ఎడమకంటికి కాటుక పెట్టుకొనవలెను. చూ. కు. సం. సర్గ 7-శ్లో. 59. ఇందులకు వేదప్రామాణ్యము "సవ్యగ్ంహి పూర్వం మనుష్యా అంజతే" మొదలగునవి.

"సమిత్పుష్పకుశాఽగ్న్యంబు మృదన్నాక్షర పాణికః।
జపం హోమం చ కుర్వాణో నాభివాద్యో ద్విజో భవేత్॥"

"బ్రాహ్మణుఁడు సమిధలనుగాని పుష్పము మొదలైన వానినిగాని చేతఁబట్టి హోమము సేయుచున్నప్పుడును లేక జపము సేయుచున్నప్పుడును వచ్చిన యతిథు లాతని నమస్కరింపవలదు." అని యనుష్ఠాన మధ్యములో అభివాదన నిషేధము జెప్పఁబడినది. ఈ నిషేధము తెలిసినవాఁడు గనుకనే కాళిదాసు, తదనుష్ఠానానంతరమందే రాజు మునిని దర్శించినాఁడని పై ధర్మవిషయమును విశదపఱచినాఁడు. ఇట్లే వసిష్ఠుఁడు దిలీపునిగూర్చి కుశలప్రశ్న చేయు సందర్భములో

"ప్రపచ్ఛ కుశలం రాజ్యే రాజ్యాశ్రమమునిం మునిః॥"

అని (1–58) "కుశలము" నడిగెను" బ్రాహ్మణుని "కుశలము" అడుగవలెను. ఇట్లే క్షత్రియుని, "అనామయమా" అని యడుగవలెను. ఈ నియమమునుబట్టి యిట క్షత్రియుఁడైన దిలీపుని "అనామయమా" అని ముని యడుగవలసియుండఁగా బ్రాహ్మణు నడుగఁదగినట్లు రాజును "కుశలమే" అని యడిగినాఁడు. కారణము 'రాజ్యాశ్రమమునిం' అను విశేషణము. ఇట్టి యర్హత, ఈ రాజునకు దగియున్నదని మహాకవి యిట మనకు సూచించినాఁడు.

తనయింటికి వచ్చినవారిలో నేయేవర్ణములవారి నేయేరీతిగాఁ గుశలప్రశ్నము గావించవలెనో! అను ప్రశ్నకు సమాధానముగా సూరి, మనుస్మృతినుండి యీ ప్రమాణముం జూపినాఁడు.

"బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రబంధు మనామయం।
వైశ్యం క్షేమం సమాగమ్య శూద్ర మారోగ్యమేవచ॥"

ఇట్లే దిలీపరాజేంద్రుఁడు వసిష్ఠమహర్షివద్దకేఁగి తన సంతానాఽభావమునకుఁ గారణ మడుగఁగా, వసిష్ఠమహర్షి 'రాజా' నీవు పూర్వ మొకసారి దేవేంద్రుని సేవించి తిరిగి భూలోకమునకు వచ్చు సమయమున మార్గమధ్యమునఁ గామధేనువు, కల్పవృక్షచ్ఛాయ నాశ్రయించి

యున్నది.' (1-75). 'ప్రదక్షిణముచేసి నమస్కరింపదగిన యా కామ ధేనువును నీ వుపేక్షించితివి. కారణమేమనఁగా ఋతుస్నాతయైయున్న నీ భార్యను కలిసికొననిచో "ధర్మహాని కల్గును" అను నాలోచనలో నున్న నీ వా ధేనువును జూడలేదు" (1-76). "నన్ని ట్లవమానపఱిచితివి గాన నా సంతానమును సేవింపనిదే నీకు సంతానము కలుగకుండుఁ గాక" యని యా కామధేనువు నిన్ను శపించెను. (1-77). * ఇందు డెబ్బదియాఱవ శ్లోకములో మన కవి మన కెన్నెన్నో ధర్మ సూక్ష్మములను దెలిపినాఁడు. ఆ సూక్ష్మములను సూరి మనచేతికి అనఁటిపండొలిచియిచ్చిన ట్లిచ్చినాఁడు. చూడుఁడు. "ఋతుస్నాత యైన భార్యను దప్పక కలిసికొనవలెను" అనుటకుఁ బ్రమాణముగా మనుస్మృతినుండి సూరిమహాశయుఁడు,

"ఋతుకాలాఽభిగామీస్యాత్ స్వదారనిరత స్సదా॥"

అని చూపినాఁడు.

ఇట్లు ఋతుకాలములో భార్యను గలిసికొనని భర్తకుఁ గలుగు దోషమెట్టిదో తెలుపుచు పరాశరస్మృతినుండి సూరిసుజనుడు చూపిన నిదర్శనము

"ఋతుస్నాతాం తు యో భార్యాం స్వస్థస్స న్నాఽధిగచ్ఛతి।
బాలగోఘ్నాపరాధేన యుజ్యతే నాఽత్ర సంశయః॥"

'ఋతుస్నాతయైయున్న భార్యను స్వస్థచిత్తుఁడై కలిసికొనని భర్త బాలహత్యాజనితపాపముతోఁ దుల్యమయిన పాపముచేసినవాఁడగును.

ఇచ్చటి 'ఋతు' కాలమునుగూర్చి 'కాలామృతము' అను జ్యోతిశ్శాస్త్రగ్రంథములో ♦ నిట్లు తెలుపఁబడినవి.

---

* ఈ శ్లోకము "ప్రక్షిప్తము" అయినట్లు 'ఉద్యాన' పత్రికలో గలదు. చూ. జనవరి 66 సంచిక 108 పేజీ.

♦ ఈ గ్రంథము వావిళ్ళవారిచేఁ బ్రకటితము. టీకాకారుఁడు 'వేంకటయజ్వ' అని యున్నది. 'ఉత్తరకాలామృతము' అను జ్యోతిశ్శాస్త్రగ్రంథము కాళిదాసకృత మని దాని ముఖపత్రముపైఁ గలదు. దీని కది పూర్వమైనచో నీ 'కాలామృతము'కూడ కాళిదాసకృత మనవచ్చునుగదా.

"స్త్రీణా మార్తవదర్శనాదిదినత స్స్యు ష్షోడశర్తు క్షపాః ।
పుత్రార్థీ వరయే త్ప్వమాసు సుముఖీం తాస్వేవ శుద్ధాం కృశాం॥"

... ... ... ... ...

... ... (చూ. కాలామృతము ప్రథమబిందువు)

ఈ ఋతురాత్రులలో నేవి సంగమార్హములు? ఈ ప్రశ్న కుత్తరముగా

"ఋతు స్స్వాభావికా స్త్రీణాం రాత్రయ ష్షోడశ స్మృతాః ।
తాసా మాద్యా శ్చతస్ర స్తు నింద్యా ఏకాదశీచ యా ।
త్రయోదశీ చ శేషా స్తు ప్రశస్తా దశరాత్రయః॥" (మనువు)

"రజోదర్శనము మొదలు పదునారు రాత్రులు స్త్రీలకు ఋతురాత్రులు. అందు మొదటి నాల్గురాత్రులు, ఏకాదశీ త్రయోదశులు కాక మిగిలిన సమదివసరాత్రులు భర్తకు సంగమార్హములు. గాన ప్రస్తుతములోఁ బైని చేర్కొనిన దశరాత్రులలో దిలీపుఁడు స్వర్గమునుండి తిరిగివచ్చునది ఒకరోజై యుండవలెను.

"దిలీపుఁడు భార్యాసహితముగ వసిష్ఠాశ్రమములో మొదటి రాత్రిని నియమముతోఁ గడపెను." అను సందర్భములో మన కవికులగురువు చెప్పిన శ్లోకార్థ మిది. 'దిలీపుఁడు నియమవతియగు భార్య సహాయముగలవాఁడై గురునిర్దిష్టమైన పర్ణశాలలో దర్భలచాపపైఁ బరుండి, వసిష్ఠునిశిష్యుల యధ్యయనముచే సూచింపఁబడిన తుదిభాగముకల రాత్రిని గడపెను.'

"........తచ్ఛిష్యాఽధ్యయననివేదితాఽవసానాం ।
సంవిష్టః కుశశయనే నిశాం నినాయ॥" రఘు (1-95)

ఈ యపరరాత్రియందలి యధ్యయన సంప్రదాయమునకుఁ బ్రమాణమును జూపుచు సంజీవినిలో సూరి, గౌతమధర్మసూత్రగ్రంథమునుండి

"న చా ప్యపరరాత్రావౌ బ్రహ్మాఽధీత్య పున స్స్వపేత్"

తెల్లవాఱుజామున లేచి (మూఁడవయామములో) వేదపఠనముచేసినవాఁడు మిగిలిన రాత్రిభాగములోఁ దిరిగి నిద్రించకుండుట ధర్మము.

గాన, దిలీపుఁడును శిష్యుల వేదపఠనముచే మేల్కాంచి తిరిగి పరుండక యవశిష్టరాత్రిని గడపెనఁట. ఇట్లే యీ దిలీపనరేంద్రుఁడు తనభార్య గర్భవతియైనపిమ్మట ఆమెకు 'పుంసవనము' మొదలగు సంస్కారములు జరిపించెను.

"....యథాక్రమం పుంసవనాదికాః క్రియాః.... సధృతిర్వ్యధత్తసః"
(రఘు. సర్గ 3 శ్లో. 10)

షోడశకర్మల వరుస యిట్టిది.

"గర్భాధానం పుంసవనం సీమంతో జాతకర్మచ॥" ... అను వరుసనుబట్టి మన మహాకవి యిట పుంసవనము పిమ్మట "సీమంతము" నే గ్రహించినాఁడు. ఈ 'పుంసవనము' స్త్రీలకు 2, 3 మాసములలోఁ జేయఁదగినట్లు ' ద్వితీయే తృతీయేవా మాసి పుంసవనం ' అను స్మృతి వాక్యము ప్రమాణ మగును ఈ పుంసవనము పురుషనక్షత్రములోఁ జంద్రుఁడు కూడియున్నప్పుడు చేసినచో పురుషసంతతి కలుగునఁట. ఈ సంస్కారనామములోనే యీ విషయము విలీనమై యున్నది. "పుమాన్ సూయతే అనేన కర్మణా ఇతి పుంసువనం"* దీనికిఁ బిమ్మట 'అనవలోభనం' అను సంస్కారాంతరము నాల్గవమాసమున గర్భిణీ స్త్రీకి జరుపఁదగియున్నట్లు 'చతుర్థేఽనవలోభనం' అను "ఆశ్వలాయన సూత్ర"కారుని వాక్యము వ్యక్తము సేయుచున్నది. ఇఁక "షష్ఠే అష్టమేవా సీమంతోన్నయనం" అను యాజ్ఞవల్క్యమహర్షి వాక్యముసుబట్టి 'సీమంతము'-6, 8 మాసములలోఁ గర్తవ్యము. ఈ స్మృతి విహితధర్మము లన్నిటిని బాగుగాఁ దెలిసిన మన కవీశ్వరుఁడు సందర్భానుసారముగ వానిని మనకుపదేశించుట ద్వారమున ధర్మరక్షణతో లోకరక్షణముచేసి, లోకకల్యాణ కారకుఁడైనాఁడు. "ధర్మోరక్షతి - రక్షితః" అని కదా సూక్తి. పై సంస్కారముల వరుసలో 'సీమంతము'

* "పుంసువనము" అని యుండఁదగును. శబ్దరత్నాకరములో "పుంసవనము" అని యున్నది. ఇది చింత్యము.

తరువాతిది 'జాతకర్మ'. * దీనినిగూర్చి మనమహాకవి "దిలీపునకుఁ" బుత్రుఁడు కలిగెను. అను సందర్భమున

"....మణి రాకరోద్భవః ప్రయుక్త సంస్కార ఇవాఽధికం బభౌ"
(3-18)

అని నుడివెను. ఇట నీ కవి "సంస్కార" పదముతో జాతకర్మ సంస్కారమువలన శిశువునకు, కషణాది సంస్కారము వలన మణికివలె క్రొంగ్రొత్తశక్తులు, ప్రకాశమును కలుగునని సూచించినాఁడు. ఆ శ్లోకభావమిది. "దిలీపునకుఁ బుత్రుఁ డుదయించినంతనే అతనికి జాతకర్మ సంస్కారము చేయబడెను. ఈ సంస్కారముచే శిశువు, కషణాది సంస్కారముచే మణివలె నధికముగఁ బ్రకాశించెను. (రఘు. సర్గ 3. శ్లో 18) ఈ సంస్కారము, శిశువులకు బొడ్డుకోయక పూర్వమే చేయఁదగియున్నట్లు

"ప్రాఙ్నాభికృంతనా త్పుంసో జాతకర్మ విధీయతే"

అను మనుస్మృతి వాక్యమువలన వ్యక్తమగుచున్నది. మఱియు నీ సంస్కారముచే శిశువునకు జన్మకాలమందు సంక్రమించిన బాలారిష్టాది దోషము లుపశమిల్లి, ఆయురారోగ్యైశ్వర్యములు గల్గునని జాతకర్మఫలశ్రుతి యిట్లు తెలుపుచున్నది.

"జాతస్యాఽరిష్టనాశాయ నీరోగత్వాయ సర్వదా।
దీర్ఘాయుష్యాయ బాలస్యాత్ర సర్వసంపత్సమృద్ధయే।
జన్మ న్యశుభయోగానాం వినాశాయ విశేషతః॥
(బార్హస్పత్య సంహిత)

ఈ విషయము మన యనుభవములోఁగూడ ప్రత్యక్షమైనదే, పరికింపుఁడు. అభ్యంగనాది సంస్కారవిరహితమైన శరీరము మాలిన్యయుతమై క్రమముగ అనారోగ్యభూయిష్ఠమై రోగాణువులచే వ్యాపింపఁ

* 'జాతమాత్రేసతి కర్తవ్యం కర్మజాతకర్మ'. ఈ సంస్కారములోని విశేషములు, ఎన్నెమ్మకథలతో దీనికిఁగల సంబంధము మొదలగునవి, నా రచితమైన 'ఉపనయనమంత్రార్థ దర్పణము'లో దర్పణములోవలెఁ జూపఁబడినవి.

బడి స్వాధీనమునుండి శిథిలమైనట్లు, జాతకర్మాది సంస్కారవిరహితమైన వాని బుద్ధివృత్తులు, మనస్సు బాలారిష్టాదిగ్రహములచేఁ బీడితములై వికలములై పటుత్వముదప్పి స్వాస్థ్యవిరహితములై ఎండలేని ప్రదేశములోఁ బెరిఁగిన మొక్కలవలె వెల్లితలలువేసి రూపఱియుండును. దీనినిబట్టి ద్విజులకు జాతకర్మాది సంస్కారములు, మణులకుఁ గషణాది సంస్కారములవలె స్వశక్తిప్రకాశములై నిజప్రాభవములను వెలువరించునని యిట మన కాళిదాసు "ప్రయుక్త సంస్కార ఇవాధికం బభౌ" అను సందర్భమును బురస్కరించుకొని చక్కఁగ సూచించినాఁడు. ఇఁక "చౌల" సంస్కారమును, ఉపనయన సంస్కారమును గూడ రఘుకుమారునికి మనమహాకవి జరిపించినాఁడు. చౌలము అనఁగా పుట్టువెండ్రుకలు తీయించుట. ఇది ద్విజబాలునికి మూఁడవయేట చేయఁదగినట్లు

"జన్మనోధి తృతీయేవర్షే చౌలం పునర్వస్వోః"

అను ఆపస్తంబసూత్రము సూత్రించినది. మొదటి సంవత్సరములోఁ గూడఁ జేయవచ్చునని మనువుమతము.

"చూడాకార్యా ద్విజాతీనాం సర్వేషామేవధర్మతః ।
ప్రథమేబ్దే తృతీయేవా కర్తవ్యా శ్రుతిచోదనాత్॥"

ఇట్లే ఉపనయన సంస్కారమునకుఁగూడ ద్విజబాలురకు గర్భష్టము మొదలు గర్భాష్టమమువఱకు యుక్తకాలమైనట్లు

"గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత ।
* గర్భైకాదశేషు రాజన్యం, గర్భద్వాదశేషు వైశ్యం॥"

అని ఆపస్తంబసూత్రము సూత్రించుచున్నది. క్షత్రియవైశ్యులకు వరుసగా గర్భైకాదశ (11) సంవత్సరము, గర్భద్వాదశవత్సరము

* శిశువు మాతృగర్భములోనున్న తొమ్మిదిమాసములు కలిపి లెక్కించఁగా, అనఁగా 7 సంవత్సరముల 3 మాసములకు బాలునికి గర్భాష్టమవత్సరము మొదలగును. ఇట్లే గర్భషష్ఠాదులుకూడ లెక్కించవలెను.

ఉపనయనమునకు యుక్తకాలము. ఇఁక కామ్యసంవత్సరములలో నుపనయనము చేయుటనుగూర్చి మనువు

"పంచమే బ్రహ్మవర్చసకామం, అష్టమ మాయుష్కామం, దశమే అన్నాద్యకామం, ఏకాదశ ఇంద్రియకామం, ద్వాదశే పశుకామ మితి". "ఆషోడశా ద్బ్రాహ్మణస్య అపతితా సావిత్రీ"

అని పదునాఱేళ్ళవఱకు ఉపనయనకాలమును బొడిగించి, మన మహర్షులు మనకు జాలినంత యవకాశమును గల్పించినను మన కుమారులకు అంత్యావధిలోనైనను మనము ఈ ముఖ్యసంస్కారమును జేయమికిఁ గారణము, "కిరీటస్థానము నాక్రమించిన (తలకెక్కిన) మన ఉపేక్షాభావమే మూలము" అనవలెనుగదా. అదనుపదును లేక నాఁటిన విత్తనమువలె సకాలములోఁ జేయని సంస్కారము వ్యర్థమే యగునుగదా!

ఇట్లే ఉపనయనానంతరమున రఘుకుమారుడు తండ్రినుండి అస్త్రవిద్యను నేర్చునపుడు నల్లయిఱ్ఱి చర్మమును ఉపవీతముగ ధరించి సమంత్రకముగా అస్త్రవిద్య నభ్యసించుచున్నాఁడని మన మహాకవి

"త్వచం స మేధ్యాం పరిధాయ రౌరవీం *

అశిక్షి తాఽస్త్రం గురురేవ మంత్రవిత్" (రఘు 3-31)

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు క్రమముగా విద్యాభ్యాసకాలమందు ధరించవలసిన చర్మయజ్ఞోపవీతము లివి యని మల్లినాథసూరి మనకెఱుకపఱచినాఁడు.

కార్ష్ణరౌరవబాస్తాని చర్మాణి బ్రహ్మచారిణః ।

వసేర న్నానుపూర్వ్యేణ శాణక్షౌమాదికానిచ॥ (మనుస్మృతి)

ఈ చర్మయజ్ఞోపవీతధారణము వటువులకు దీర్ఘాయుర్దాయకరమని మఱియొక విశేషవాక్య మిట్లు నుడువుచున్నది.

"అజినో త్తరీయోహి దీర్ఘాయుర్భవతి"

---

* రురుర్మహాకృష్ణసారః । (యాదవ నిఘంటువు.)

ఇంకను ఇట్టి ధర్మవిశేషము లీ కాళిదాసకృతులం దెన్నియేని కలవు. రఘువంశము 3-33లో గోదానవ్రతమునుగూర్చియు 3-70లో వానప్రస్థ ధర్మమునుగూర్చియు 4-25 శ్లోకములో యుద్ధయాత్రకు బైలుదేఱుటకు ముందు చేయఁదగిన కృత్యవిశేషములనుగూర్చియు ధర్మవిశేషములు కలవు. *

పైవిధముగా కాళిదాసు తన కావ్యములలో సూత్రప్రాయముగాఁజెప్పిన విశిష్ట వివిధ ధర్మవిశేషములను మన మల్లినాథసూరి ప్రసిద్ధ గ్రంథస్థప్రమాణములతో వివరించి తన “సంజీవిని”ని భారతీయుల నైతికజీవితమునకు నిజముగ “సంజీవిని” గనే యొనర్చినాఁడు. మానవుఁడు తన జీవితరక్షణకొఱకు ధర్మరక్షణచేయుట అగత్యమై యున్నట్లు “ధర్మో రక్షతి రక్షితః” అను సూక్తి సువ్యక్తముచేసినదికదా! ఇట్టి ధర్మములన్నియుఁ ప్రత్యేకముగా నారోగ్యసూత్రమిళితములై మానవునకు అవశ్యానుష్ఠేయములగుచునే యున్నవి. ఇట్టి ధర్మమును రక్షించలేని మానవుఁడు తనను దాను రక్షించుకొనలేని దీనస్థితిలో నున్నాఁడనియే చెప్పవలెను.

“యతోధర్మ స్తతోజయః”

అను సూక్తినిబట్టి ధర్మములేనిచోట నెట్టిజయము కలుగదని స్పష్టమగుచున్నది. కనుక మానవునకు సర్వాభ్యుదయసంధాయకమైనది ధర్మమే యనియు, నిట్టి స్వధర్మాచరణముతో మానవాళి, ఇహపరసౌఖ్యములను బడసి ముక్తిపొందుట యుక్తమనియుఁ గాళిదాసకావ్యలక్ష్మి కాంతాసమ్మితముగ లోకమునకు బోధించి, విశ్వకళ్యాణదీక్షతో దీపించుచున్నదని నివేదించుచున్నాను.

---

* చూ. రఘువంశకావ్యం 8 సర్గలో 20, 25, 26; “ప్రేతినుగూర్చి బంధువులు కన్నీరు కార్చరాదు.” ఇందులకు యాజ్ఞవల్క్యముని “శ్లేష్మాశ్రు బాంధవైర్ముక్తం ప్రేతో భుంక్తే యతోఽవశః అతో నరోదితవ్యం హి క్రియాః కార్యాః స్వశక్తితః చూ. రఘువంశకావ్యం. సర్గ 8 శ్లో 86 వ్యాఖ్యలో.

# కాళిదాస హృదయము

## శ్రీ కాళిదాస మహాకవి – శ్రౌతవిజ్ఞానము *

శ్రీ కాళిదాస మహాకవియొక్క కావ్యతపోవనములు పుణ్య తపోవనములవలె దర్శపౌర్ణమాసేష్ట్యాదుల పవిత్రాజ్యధూమముల వర్ణనములచే నావృతములై పురోడాశాజ్యాద్యాహుతుల యామోదములచే తదాశ్రమోన్ముఖులైన పాఠకాతిథుల యంతరంగముల నలరింపఁజేయుచు, వారిని బవిత్రీకరింపఁజేయుచుండును. ♦ కనుక నొక్కసారి మన మా మహాకవి కావ్యతపోవనములోఁ బ్రవేశించి, యచటి శ్రౌతక్రియల నవలోకించుటచే మన మనశ్శరీరములను మహితానందభరితములఁ గావించుకొనుచు నట, ముఖ్యములైన కొన్ని శ్రౌతసంప్రదాయ దివ్యసౌరభముల నాఘ్రాణింతము.

ఈ మహాకవి సమయము దొరికినప్పుడెల్లఁ దన శ్రౌతపాండితిని ఒక చిన్న విశేషణముచేతనో, లేక యొక యుపమానముచేతనో తెలుపుచునే యుండును.

దిలీప మహారాజు సుదక్షిణాదేవితోఁ గూడి, తన కులగురుఁడైన వసిష్ఠమహర్షి యాశ్రమముఁ జేరుసమయమునకుఁ అత్తపోవన మా రాజేంద్రున కిట్లగపడుచున్నది.

"వనాంతరా దుపావృత్తై స్సమిత్కుశఫలాహరైః ।
పూర్యమాణ మదృశ్యాగ్నిప్రత్యుద్యాతై స్తపస్విభిః॥
(రఘువంశము సర్గ. 1 శ్లో. 49)

---

* సర్వశాస్త్రవిజ్ఞానమును ఈ మాహాకవికిఁ గలదు. జ్యోతిశ్శాస్త్రవిజ్ఞానం. చూ. రఘువంశం 8-13, అశ్వగజశాస్త్రవిజ్ఞానం. 4-25, ధనుర్వేదవిజ్ఞానం 6-52, అశ్వశాస్త్రం. కు. సం. 6 39. సంగీతం 1-28 రఘు. సర్గ 1 39. వృక్షశాస్త్రవిజ్ఞానం దోహదక్రియలు చూ. మేఘసం. సర్గ 1, సాముద్రికం. కు. సం. 5-24 మొదలైనవి.

♦ "అభ్యుత్థితాగ్నిపిశునై రతిథీ నాశ్రమోన్ముఖాన్ ।
పునానం పవనోద్ధూతై ర్ధూమై రాహుతిగంధిభిః"॥
(రఘువంశము. శ్లో 53 సర్గ 1)

"వసిష్ఠాశ్రమములోని మునులు ఇంకొక వనములోనికి వెళ్ళి, తిరిగి తమ గృహములను జేరునపుడు వారు, వారి యజ్ఞపురుషునకు సమిధలను, దర్భలను, ఫలములను దెచ్చుచున్నారు. ఇట్టి యజమానులకు వారి యగ్నులు, అదృశ్యరూపములో నెదురుగ వచ్చుచున్నవి. ఇట్టి మునులచే నా వసిష్ఠాశ్రమము నిండియున్నది."

ఇట "అదృశ్యాఽగ్నిప్రత్యుద్యాతైః..." అను నొక విశేషణ ప్రయోగముచే మన కాళిదాసర్షి ఇట నొక యద్భుత శ్రౌతసంప్రదాయమును దెలుపనెంచినాఁడు. తిలకింపుఁడు. "ఆహితాగ్నులు ప్రవాసమునుండి తిరిగి తమ యగ్నుల సన్నిధిఁ జేరునపుడు సమిధలను దేవలెను." అను సంప్రదాయసందర్భములో

"సమిధః కృత్వా ప్రత్యేతి"

అను శ్రౌతసూత్రమునకు నద్దాని వ్యాఖ్యలో నిట్లున్నది.

"యథాహవా ఇతం* పితరం ప్రోషివాసం పుత్రాః ప్రత్యాధావంతి, ఏవగ్ం హవావా ఏతమగ్నయః ప్రత్యాధావంతి సశకలాన్ దారూణి వాహరన్నేతి యథైవ తత్పుత్రేభ్య ఆహరన్నేతి తాదృక్తదితి విజ్ఞాయతే॥"

(చూ. ఆపస్తంబ శ్రౌతసూత్రము. 6వ ప్రశ్న 7వ పటలము 4-13-1400.)

"గ్రామాంతరమునుండి తండ్రి యింటికి వచ్చినపుడు అతని పుత్రులు, తమకుఁ దన తండ్రిభక్ష్యములను దెచ్చియుండుననునాసతో తండ్రి కెదురుగ పర్వెత్తి వచ్చెదరు. ఈవిధముగనే ప్రవాసమునుండి తిరిగివచ్చిన మునులకు, పుత్రస్థానీయములైన వారి యగ్నులు, తమకు భక్ష్యస్థానీయములైన సమిధలను దెచ్చియుందురని యదృశ్యరూపములో నెదురువచ్చుచుండును. కనుక ప్రవాసాగతులైన యాహితాగ్నులు తమ యగ్నులకొఱకు సమిధలను దేవలెను." మన

---

* ఇతం = తిరిగివచ్చిన

శ్రౌతకవి, పై శ్రౌతసూత్రములోని సమాజ్ఞ్యల సంప్రదాయమును బాగుగ నెఱింగినవాడు కనుకనే, ప్రవాసాగతులైన వసిష్ఠాశ్రమ మునులచేత "సమిత్కుశ ఫలాహరైః" అని సమిధలనే మొట్టమొదట చేతఁబట్టించి, తన శ్రౌతసాహిత్యవైభవముఁ జాటినాఁడు. శ్రీ మల్లినాథ సూరి, సర్గ 1 శ్లో 49 వ్యాఖ్యలో పై శ్రౌతవిషయమును

"ప్రోష్య ఆగచ్ఛతా మాహితాగ్నినా
మగ్నిప్రత్యుద్యానంశ్రుతిప్రసిద్ధ మేవ"

అని ప్రవాసాఽగతులైన మునులకు వారి యగ్నులు ఎదురేఁగుట శ్రుతి * ప్రసిద్ధమైనదే యని తెలిపినాఁడు. శ్రీ కాళిదాస కవీంద్రుని భవ్యభావరత్నముల కాంతులను బ్రపంచమున కగఁబఱచిన పున్నెమీసూరిసుజనునిదే కదా ! ♦

ఇట, పై శ్రౌతసంప్రదాయము కొంత వివరముగఁ దెలియదగినది.

ఆహితాగ్ని, తన యింటినుండి మఱియొక గ్రామమునకు వెళ్ళునపుడు తన అగ్నిసన్నిధిఁ జేరి అతఁడు ప్రవాసోపస్థానమంత్రములను బఠింపవలెను. † వెళ్ళునపుడు యజమానుఁడు తన ఊరి పొలిమేరవఱకు నెవ్వరితోడను మాట్లాడక వాచంయముఁడై యుండవలెను, తిరిగి వచ్చునపుడు సమిధలను దేవలెను. వచ్చునపుడు కూడ ఊరి పొలిమేర నుండి యగ్నిగృహముఁ జేరి, సమిధల నగ్నియందుంచి, ఆగతోపస్థాన

---

* శ్రుతివిహితమైనదే శ్రౌతతంత్రము.

♦ "భారతీ కాళిదాసస్య కువ్యాఖ్యా విషమూర్ఛితా ।
ఏషా సంజీవినీటీకా తా మద్యో జ్జీవయిష్యతి"॥

† ప్రవాసమునకు వెళ్ళుచున్న ఆహితాగ్నులు ప్రవాసోపస్థానమంత్రములను అగ్నిసన్నిధిలోఁ బఠింపవలెను. అందలి "మమ నామ ప్రథమం......" అను మంత్రార్థమునుబట్టి, అగ్ని ఆహితాగ్నియొక్క పేరును, ఆహితాగ్ని అగ్ని పేరును ధరించెదరు. దీనిచే అగ్నిశరణములో ఆహితాగ్ని యున్నట్లగును. యజమానపత్ని అగ్నిని భద్రపఱుపవలెను.

(చూ. శ్రౌతసూత్రము. 6వ ప్రశ్న. 24 ఖ. డిక 7వ సూత్రము.)

మంత్రములను జపింపనిదే మఱెవ్వనితోడను మాట్లాడరాదు. ఇట్లు ప్రవాసమునుండి వచ్చిన యజమానులకుఁ బూర్వోక్తరీతిని అగ్నులు అదృశ్యరూపములో నెదురు వచ్చును. ఇట్లగ్ను లెదురువచ్చుచున్న కారణముచేతనే యజమానులు తదాహారస్థానీయములైన సమిధలను దేవలెనని శ్రౌతసూత్రము నిర్దేశించినది. ఇట్టి శ్రౌతసూత్రార్థములను బరిపూర్ణముగఁ దెలిసియున్నవాఁడు కనుకనే మన మహాకవి "...సమిత్కుశ ఫలాహరైః..." అనియు "...అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః..." అనియు నొక్కొక్క విశేషణముచేతనే పై శౌతసంప్రదాయ రహస్యములను జక్కఁగ సూచింపఁగల్గినాఁడు. ఇట్టివే మఱికొన్ని విశిష్టవిషయముల నిట స్థాలీపులాకన్యాయముగ గన్గొందము. ఈకవి 'ఆహితాగ్ని' శబ్దార్థమును గూర్చి దిలీప మహారాజుచే

"........గురో రపీదం ధన మాహితా గ్నేర్నశ్య త్పురస్తా
దనుపేక్షణీయం॥"

(చూ. రఘువంశము. సర్గ 2 శ్లో 44.)

అని పలికించినాడు.

ఇట "ఆహితాగ్ని" శబ్దార్థము తెలియుటకై తత్పూర్వవిషయము కొంత తెలియఁదగియున్నది.

"ఆహితాగ్ని" యగుటకుముందు "ఆధానము" చేయవలెను. ఈ "ఆధానము"లో అగ్నులు స్థాపించుచోట ముందుగా జమ్మి మోదుగ రావి వైకంకతము మొదలగు చెట్లయొక్క సప్తశాఖల నుంచెదరు. ఈశాఖలు అగ్నికిఁ బ్రియస్థానములై యున్నట్లు శ్రుతి ప్రమాణము లిట్లగఁబడుచున్నవి.

శమి :— శమీ గర్భా దగ్నిం మంథతి ।
ఏషావా అగ్నేర్యజ్ఞియా తనూః॥

(తైత్తిరీయ బ్రాహ్మణము 1-2-65.)

జమ్మి, యజ్ఞసంబంధమగు నగ్నికి, యజ్ఞాంగములలో ముఖ్యమైన శరీరస్థానీయము ఈ శ్రుత్యర్థమునే మన కాళిదాసకవిసోమయాజి తన శాకుంతల నాటకమున, "శకుంతల గర్భము ధరించినదని ఆకాశవాణి కణ్వర్షికిఁ దెలుపు సందర్భమున—

"దుష్యంతేనా ఽహితం తేజో దధానా భూతయే భువః ।
అవేహి తనయాం బ్రహ్మ న్నగ్నిగర్భాం శమీ మివ॥

ఇవి ఆకాశవాణి భాషితములు. "ఓ బ్రహ్మర్షీ! దుష్యంత నిషిక్తమైన తేజమును లోకకల్యాణార్థమై ధరించిన నీపుత్రికను, అగ్నిని గర్భమున ధరించిన జమ్మివంటి దానినిగాఁ దెలిసికొనుము." ఇట ఒక విశేషము కలదు. జమ్మిచెట్టులో మొలిచిన రావిచెట్టుకఱ్ఱనుండియే అగ్నిని మథించెదరు. ఇందుకు కృష్ణయజుర్వేదమంత్రము లివి.

"........అశ్వత్థా ద్ధవ్యవాహోద్ధిజాతాం ।
అగ్నే స్తనూం యజ్ఞియాం సంభరామి ।
శాంతయోనిగ్ం శమీగర్భం ।
అగ్నయే ప్రజనయితవే ।
యో అశ్వత్థశ్శమీగర్భః.........॥"

రావిలో అగ్ని యున్నదనుటకు శ్రుతిప్రమాణము లివి.

"అశ్వో రూపం కృత్వా సాశ్వత్థే సంవత్సర
మతిష్ఠత్ తదశ్వత్థ స్యాశ్వత్థత్వం.........॥"
తైత్తిరీయ బ్రాహ్మణము (1-22).

అగ్ని అశ్వరూపముతో నొకసంవత్సరకాలము అశ్వత్థవృక్షములో నుండెను. కనుక రావికి "అశ్వత్థ" నామము (అశ్వరూపేణ తిష్ఠతి) సార్థకమైనది. కాఁగా పైశ్లోకములోని "......అగ్నిగర్భాం శమీం..." అనునప్పుడు "అశ్వత్థము గర్భమందు కల శమి" అనినచో సరిపడును.

"...అగ్నిగర్భాం..." అనుటచేత శకుంతలా గర్భమం దున్నవాఁడు పురుషుఁ డనియు, అతఁడు అగ్నివంటి పవిత్ర చరిత్రుఁ డనియు, "భూతయే భువః" అనుదానినిబట్టి భూమండలమున కంతకు నీ మహాపురుషుఁడు ఐశ్వర్యకారకుఁ డనియు నిట్లెన్నియో ప్రయోజనము లిట సిద్ధించుచున్నవి.

"అగ్నిగర్భాం శమీం..." అనుటచే "శమి" వంటిది శకుంతల యైనచో నామె గర్భమందలి దుష్యంతుని రేతస్సు అగ్నివంటిదే కదా!

ఇందుకుఁ గూడ శ్రుతి యిట్లున్నది.

"....సరేతా అగ్ని రాధేయ ఇత్యాహుః॥"

"....సరేతసమే వాగ్ని మాధత్తే....॥"

(తైత్తిరీయ బ్రాహ్మణము). ఈ కవీశుని భరతోత్పత్తి ప్రకారమును భావించినచో భారతజాతికి మూలకందమైన మన భరతునియొక్క ఆజన్మవిశుద్ధత, పవిత్రత భారతజాతిలోఁ గూడ ప్రతిబింబితమై యుండకపోదని తెలియఁగలదు.

ఇట్లు అగ్నికి శమియు, అశ్వత్థమును, ప్రియమైనట్లే మోదుగ కూడ గాయత్రీ స్వరూపమగుటచేఁ బవిత్రస్థానీయమైనట్లు

"గాయత్రో వై పర్ణః...."

అను కృష్ణయజుర్వేదవాక్యము తెలుపుచున్నది. ఈ "పలాశము"నకు "పర్ణము" * అను నామాంతరము కల్గుటకు ఒక చిన్నకథను ఈ శ్రుతివాక్య మిట్లు తెలుపుచున్నది. దాని భావ మిది.

"స్వర్గములో "సోమలత" అనునది కలదు. అద్దానిని గాయత్రీ దేవి స్వర్గమునుండి కొనివచ్చుచుండెను. ఆ సమయమున ఆ లతయొక్క పత్రము తెగి క్రిందఁబడెను. ఆ పర్ణము పలాశ మయినది. ♦" ఇట్టి

---

* "సోయం పర్ణస్సోమపర్ణాద్ధిజాతః..." (పరాయితము)

♦ "తృతీయస్యా మితో దివి సోమ ఆసీత్ తం గాయత్ర్యా హరత్ తస్య పర్ణ మచ్ఛిద్యత తత్పర్ణోఽభవత్ తత్పర్ణస్య పర్ణత్వం॥"

(చూ. కృష్ణయజుర్బ్రాహ్మణము)

పవిత్రపలాశదారువుతోఁ జేసిన యాహుతి సాధనములు * ఇష్టులలో నుపయోగించిన యజమానునకు బాపశబ్దశ్రవణము తటస్థింపదని కూడ శ్రుతి ♦ యిట్లు తేటతెల్లము సేయుచున్నది.

"....యస్య పర్ణమయీ జుహూ ర్భవతి న పాపగ్గ్ శ్లోకగ్ం శృణోతి॥" (బ్రాహ్మణము).

పై విధముగ అగ్నికి ప్రియస్థానములైన శమ్యాది సప్తశాఖలపై అగ్నిని ఆహితము (శ్రౌతతంత్రరీతిచే నగ్నిని ఉంచుట) చేయుటచేతనే, ఆ పురుషుఁడు "ఆహితాగ్ని" అనిపించుకొనును. ఈ ఆహితాగ్ని ధర్మేష్టిలో సాయందోహము, ప్రాతర్దోహము అనఁబడు హోమములను ఆవుపాలు ఆవుపెరుగు కలిపిన ద్రవ్యముతో (దీనినే "సాన్నాయ్యము" అందురు.) చేయవలెను. ఈవిధముగా గో పయస్సు ఆహితాగ్నికి ఇష్టులలో నతి ముఖ్యమైన ద్రవ్యము గాన ఇట్టి ముఖ్య ద్రవ్యమునకు మూలాధారమైన 'నందినీధేనువును' గూర్చి † ప్రస్తుతమున గోసేవాసంసక్తుఁడైన దిలీపమహారాజుచే మన శ్రౌతకవి

"....గురో రపీదంధన మాహితాగ్నే ర్నశ్య త్పురస్తా దనుపేక్షణీయం"

అనిపించుట కాళిదాసుని శ్రౌతపాండితికి నిదర్శము కాకమానునా? పై శ్లోకపాదములోని యేకైక విశేషణమే పైని పేర్కొనిన శ్రౌతరహస్యముల నన్నిటిని క్రోడీకరింపజాలియుండుట ఇట గమనార్హము. ఇక త్రేతాగ్నుల స్వరూప స్వభావాదులను గూర్చి కాళిదాస కవీంద్రుఁడు శాకుంతలములో జూపిన రీతి అద్భుతమైనది.

---

* హోమసాధనముల పేర్లు కొన్ని "జుహు" 1 "ఉపభృత్తు" 2 "ధృవ" 3.

♦ యజ్ఞయాగాదుల నిర్వహణము చిత్తశుద్ధికరమై మోక్షమునకు మార్గదర్శకమగును.

† "తాం దేవతాపిత్రతిథిక్రియార్థా మన్వగ్యయా మధ్యమలోకపాలః"
(చూ. రఘువంశము. సర్గ 2 శ్లో. 16

కణ్వర్షి శకుంతలను అత్తవారింటికిఁ బంపుటకు ముందు ఆమెను, దన త్రేతాగ్ని గృహములోఁ త్రేతాగ్నులసన్నిధిని ఆశీర్వదించు సందర్భమున, మన కాళిదాసర్షి, కణ్వర్షిముఖమున ఋక్ఛందస్సుతో శకుంతల నిట్లాశీర్వదించును.

"అమీ వేదిం పరితః క్లుప్తధిష్ణ్యాః సమిద్వంతః ప్రాంత సంస్తీర్ణదర్భాః। అపఘ్నంతో దురితం హవ్యగంధైః వైతానా స్త్వాం వహ్నయః పావయంతు॥".

(చూ. శాకుంతల నాటకము 4 అంకము 9 శ్లో.)

పై శ్లోకములోని "వేది" "ప్రాంతసంస్తీర్ణదర్భలు" "ధిష్ణ్య" "హవ్యగంధములు" "వైతానాగ్నులు" వీనిని గుఱించి యిట ముఖ్యముగఁ దెలియదగియున్నది. ఇందలి "వైతానాగ్నులు" అన్నదానికి యజ్ఞసంబంధములైన యగ్నులు అని యర్థమున్నను ప్రకరణమును బట్టి "శ్రౌతాగ్నులు" అని యర్థము. వీనిని "త్రేతాగ్నులు" అందురు. ఇట్టి త్రేతాగ్నుల యాకృతి యిట్లుండును. *

ఇందు 1, 2, 3 అంకెలు గల స్థానములలో త్రేతాగ్నులుండును. ఈ స్థానములను "అగ్న్యాయతనములు" అందురు. 1 స్థానములో అగ్ని నిత్యముగా (విచ్ఛిన్నము కాకుండ) నుండవలెను. ఇక్కడ నుండియే 2, 3 స్థానములలోనికి అగ్నిని తీసికొనివెళ్ళి యుంచెదరు. 1, 2, 3 ల నామక్రమమును గూర్చి ♦ ఈ క్రింది యగ్నిస్తవము ఇట్లున్నది.

(1) "నమస్తే గార్హపత్యాయ (2) నమస్తే దక్షిణాగ్నయే (3) నమ ఆహవనీయాయ (4) మహావేద్యై – నమోనమః. కాండద్వయోపహార్యాయ కర్మబ్రహ్మస్వరూపిణే స్వర్గాపవర్గరూపాయ యజ్ఞేశాయ నమోనమః"

---

* మోక్షము.

♦ త్రేతాఽగ్నుల స్థానముల పేర్లు. (1) గార్హపత్యము (2) దక్షిణాగ్ని (3) ఆహవనీయము (4) వేది.

మూఁడవదియగు "ఆహవనీయ" స్థానములో పురోడాశాది హావిస్సులను హోమము చేయుటచే ఈ శి వదే, దేవతలకు హావిస్సుల నందించునది. కనుకనే ఈ స్థానమును గూర్చి శ్రుతి యిట్లు తెలుపుచున్నది.

"ఆహవనీయ, స్స్వామసువర్గోలోకః"

ఈ స్థానముకూడ అగ్నియొక్క శరీరస్థానీయ మగుటచేతనే పై స్తుతి శ్లోకములో అగ్ని, "స్వర్గాపవర్గ రూపాయ" అని స్వర్గప్రాప్తికి మోక్షప్రాప్తికిఁ గారకుఁ డైనట్లు వర్ణింపఁబడుటలో నెంతేని సత్యము కలదు.

ఇట్లు త్రేతాగ్నులు "వేది"కి మూఁడువైపులను నియమిత స్థానములలో నుండును. ఈ "వేది" యాకారమును బాఠకుల కంద ఱకును బ్రత్యక్షీకరింపనెంచి యీ శ్రౌతకవి తన కుమారసంభవ కావ్యములో పార్వతీదేవియొక్క సన్నని నడుమును 'వేది'తోఁ బోల్చి యిట్లుచూపినాఁడు.

"మధ్యేన సా వేదిలగ్నమధ్యా...." (1-39)

స్త్రీల నడుము వేదియొక్క యాకారమును దాల్చియుండును. ఇట్టి "వేది"కి ప్రాగ్దక్షిణ ప్రతీచీ భాగములలో (శి వైపులను) అగ్ను లుండుట ప్రత్యక్షమే. ఈ విషయమునే ఋక్ఛందస్సులో "వేదిం పరితః క్లుప్తధిష్ట్యాః" అని సూచించినాఁడు. అనఁగా వైతానాగ్నులు (కర్త) వేది కంతటఁ గల్పితస్థానములు కలవని యర్థము. * ఇఁక అగ్నిలో సమంత్రకముగ పలాశాది సమిధల నుంచెదరు. ఈవిషయమే యిట "సమిద్వంతః" అని చూపఁబడినది. ఇఁక అగ్నులకు చుట్టును దర్భలను పఱచెదరు. ఈ విషయమే "ప్రాంతసంస్తీర్ణ దర్భాః" అని

---

* వేది కంతట అగ్ను లుండుటనుగూర్చి యీకవి "సాయంతనే సవన కర్మణి సంప్రవృత్తే వేదీం హుతాశనవతీం పరితః ప్రకీర్ణాః" అని నుడివినాఁడు.

(మా. శాకుంతల నాటకము.)

యిట పేర్కొనఁబడినది. వేదిలో నంతట దర్భలు పఱచి వాని మీఁదనే 'జుహూ' మున్నగు ఆహుతి సాధనము లుంచెదరు. ఇక హోమము చేసిన పురోడాశాది ద్రవ్యములు అర్ధహుతములైన సమయమున మంచి పరిమళముల నవి విరజిమ్ముచుండును. ఈ హవ్యగంధముల నాఘ్రాణించువారు పాపరహితు లగుదురు. ఇట ఈ విషయము "అపఘ్నంతో దురితం హవ్యగంధైః" అని కవిచేఁ జెప్పఁబడినది. ఇట్టి శ్రౌతాగ్నులు "ఓ శకుంతలా ! నిన్నుఁ బవిత్రీకరించుఁ గాక * " అని కాళిదాసర్షి యొక్క ఋక్ఛందాశీస్సు. ఈ యాశిషము ఇట ఈ కవియొక్క యద్భుత శ్రౌతవిజ్ఞానమును విస్పష్టము చేయుటలేదా ! ఇట్లే మఱికొన్ని విశేషములు. దిలీప మహారాజునకు "సుదక్షిణ" అను భార్య కలదు. అను కథాకథన సందర్భమున నీకవి

"పత్నీ సుదక్షిణే త్యాసీ దధ్వరస్యేవ దక్షిణా"

అని యుపమించెను. (చూ. రఘువంశము 1-31) ఇట యజ్ఞపురుషునకు 'దక్షిణ' అను భార్యవలె దిలీపునకు సుదక్షిణ అను పత్ని కలదు. ఈ యుపమానము మనకు

"యజ్ఞో గంధర్వ స్తస్య దక్షిణా ప్సరసః...." (3-4-19)

అను కృష్ణయజుర్వేద సంహితలోని వాక్యార్థమును బ్రకాశింపఁజేయుచున్నది. అనఁగా యజ్ఞపురుషుఁడు అనఁబడెడు గంధర్వునకు దక్షిణ అను నప్సరస కలదు. దీనిచేత దక్షిణలేనియజ్ఞము "అర్ధాంగిలేని భర్త"వంటిదని వ్యక్తమగుచున్నది. కనుకనే దక్షిణలేని యజ్ఞము మృతప్రాయమని, 'మృతో యజ్ఞ స్త్వ దక్షిణః' అను సూక్తి బయలుదేఱినది. ఇట్టి పూర్తిదక్షిణను స్వీకరించిన పిమ్మటనే ఋత్విజులు యజ్ఞతంత్ర నిర్వహణలో సమర్థు లగుదురను విషయము నీశ్రుతి యిట్లు తెలుపుచున్నది.

---

* వహ్నయః పావయంతు "పాలయంతు" అనికూడ పాఠాంతరము కలదు.

'తే దక్షం తే దక్షిణాం ప్రతిగృహ్య'

(చూ. కృష్ణయజుర్వేదము)

ఇట్టిశ్రేయుపమానము నుపయోగించుటలో నీకవియొక్క శ్రుత్యర్థ విజ్ఞాన వైభవము విస్పష్టము. ఇంకను నిట్టి శ్రౌతసంప్రదాయకుసుమదివ్య సౌరభములు, ఈశ్రౌతకవి కావ్యోద్యానము నెట్లు పరిమళింపఁజేయు చున్నవో సంగ్రహముగఁ గన్గొందము.

దిలీపమహారాజు తన కులగురువునొద్దకేఁగి తన సంతానరాహి త్యమునుగూర్చి చెప్పెడి సందర్భములో

'అసహ్యపీడం భగవన్ నృణమంత్య మవేహి మే'

అనును. (చూ. రఘు. 1-71)

ఇట "సంతానము లేకపోవుట" అనుటకుబదులు 'ఋణం అత్యం' అని మనకవి ప్రయోగించినాడు. "అంత్యఋణము" అనగా పితౄణము. ఇది సత్సంతానలాభముచేతనే తీఱును. మానవుఁడు పుట్టుకతోడనే మూడు ఋణములతోఁగూడి పుట్టును. (1)ఋషిఋణము (2) దేవఋణము (3) పితృఋణము. అనఁగా అంత్యఋణము. మనకవి శ్లోకములో నన్న ఋణ మిదియే. ఈఋణత్రయము తీఱిపోవురీతి యెట్లనఁగా, శాస్త్రోక్తముగ ద్విజుఁడు బ్రహ్మచర్యవ్రతము నాచరిం చినచో ఋషిఋణము తీఱిపోవును. ద్విజుఁడు యజ్ఞయాగాదులను నిర్వర్తించి దేవతలను దృప్తినొందింపవలెను. అప్పుడే దేవఋణము తీఱును. చివరిదగు పితౄణము తీఱుటకు గృహస్థుఁడు తన ధర్మపత్ని యందు సత్సంతానమును బడయవలెను. సత్సంతానావాప్తియే పితౄణవిముక్తికి ముఖ్యసాధనము. పై విశిష్టవిషయకదంబము నంతటిని యీక్రింది యజుర్వేద వాక్యములు విస్పష్టము సేయుచున్నవి. వినుఁడు.

"జాయమానోవై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవా జాయతే బ్రహ్మ చర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్య ఏష వా అనృణో యః పుత్రీ యజ్వా బ్రహ్మచారివాసీ...."

(కృష్ణయజుర్వేదము)

పై శ్రుత్యర్థమును బాగుగ నెఱుంగని కవి 'ఋణమంత్యం' అని అనఁగలఁడా ! ఈవిషయమునే యీకవి యింకొకచోట మంగళాంతముగ నిట్లు చమత్కరించినాఁడు. ఆ శ్లోకభావ మిది. దిలీపునకు నందినీధేనుసపర్యాకారణముచే పుత్రుఁ డుదయించినాఁడు. పుత్రోత్సవ సమయమున రాజు కారాగారబద్ధులను విడుదల చేయవలెను. కాని రఘుకులసంజాతుఁడైన యీ ధర్మప్రభువుయొక్క రాజ్యము రామరాజ్యమగుటచేఁ గారాగారము లన్నియు కాళీగానే యుండిపోయినవి. కనుక ఏయొకబందీయు నట గనఁబడలేదు. ఆలోచింపగా రా జింతవఱకు తానే పితౄణరూపమైన బంధములో బందీయై యున్నాఁడు. ఏయొక బందీనైన నీయుత్సవసమయమున విడుదల జేయవలెనుగదా ! కనుక నపుఁడు తానే పితౄణ బంధమునుండి విడుదల యయ్యెను. అనఁగా సత్పుత్రోదయము, అంత్యఋణరూపమైన పితౄణమునుండి తండ్రిని విముక్తునిఁ జేయునని భావము. ఈ భవ్యభావభాసురమైన శ్లోక మిది.

"న సంయత స్తస్య బభూవ రక్షితు ర్విసర్జయే ద్యం సుత జన్మహర్షితః । ఋణాభిదానా త్స్వయమేవ కేవలం తదా పితౄణాం ముముచే స బంధనాత్" (రఘువంశము 3 సర్గ 20 శ్లోకము).

ఇచ్చట పుత్రోదయానంతర కర్తవ్యకృత్యములనుగూర్చి కొంత తెలిసికొనుట మంచిది. పుత్రుఁడు కలిగినవెంటనే తండ్రి కట్టుబట్టతోనే స్నానము చేయవలెను.

'పుత్రే జాతే పితు స్స్నానం సచేలంతు విధీయతే'

దీనినే సచేలస్నాన మందురు. ఈ స్నానసమయమునఁ బైకిఁజెదరిన జలబిందువులు పితృదేవతాప్రీతికరము లని పెద్దల నానుడి కలదు. స్నానానంతరము శిశువునకు బొడ్డు కొయ్యకపూర్వమే * తండ్రి

* బొడ్డుకోసిన పిమ్మటనే జాతాశౌచము (పురుడు) ప్రారంభమగును. "...యావన్నచ్ఛిద్యతే నాళం తావన్నాప్నోతి సూతకం" కనుక బొడ్డు కొయ్యనంతవఱకు సూతకము రాదు.

పురిటిగది గుమ్మమునొద్ద అగ్నినుంచి అందు తవుఁడు, ఆవాలు కలిపిన ద్రవ్యముతో హోమములు చేయవలెను. దీనినే 'ఫలీకరణ హోమములు' అందురు. ఈ హోమములు చేయుటచే పుట్టిన బిడ్డకు బాలారిష్టాది జన్మకాలికదోషములు నశించును.

ఈ విషయమే జాతకర్మ సంస్కారఫలశ్రుతి శ్లోకములో

"జాతస్యాఽరిష్టనాశాయ నిరోగ్యతాయ సర్వదా దీర్ఘాయుష్యాయ చాఽన్యత్ర సర్వసంపత్సమృద్ధయే జన్మన్య శుభయోగానాం వినాశాయ విశేషతః"

పుట్టినవెంటనే చేయఁదగిన సంస్కారము 'జాతకర్మ' అనఁబడును. * ఈ సంస్కారము చేయుటచేత శిశువులకు బుట్టినప్పుడున్న అరిష్టాదిదోషనాశనము కలుగును. మఱియు శిశువులకు ఎల్లప్పుడును ఆరోగ్యముకొఱకు, దీర్ఘాయుర్దాయము, తజ్జన్మకాలికములగు అశుభయోగము లడఁగుట మున్నగు నుత్తమలాభములకొఱకు ఇది చేయఁదగినది. సూతకదినములలో 'ఎన్నిమ్మ' అనఁబడు రాక్షసపీడ ఈ జాతకర్మసంస్కార నిర్వహణముచేతనే శిశువునకు శమిల్లును. ఈ విషయమంతయు నారచితమైన, (సంస్కృతభాషలో 45 సం॥లో) 'ఉపనయన' మంత్రార్థదర్పణము' అను, జాతకర్మాది మేధాజననాంత సంస్కారగత మంత్రతాత్పర్య వివరణరూపమగుపొత్తములో వ్రాయఁబడినది.) (అముద్రితము.) ఇట్లు జాతకర్మ సంస్కారానంతరము పుత్రముఖదర్శనముతో, తండ్రియొక్క పితౄణ విముక్తికి సాక్ష్యము సమకూరిన ట్లగును. ఇట్లే మఱికొన్ని శ్రౌత విశేషములు.

కణ్వర్షి, శకుంతలాప్రతికూలదైవశమనార్థమై సోమతీర్థమునకు వెళ్ళి, తిరిగి వచ్చి యాశ్రమముఁ జేరెననాఁటి రాత్రి యది. రాత్రి యెంత మిగిలియున్నదో చూచి రమ్మని కణ్వుఁడు శిష్యునిఁ బంపఁగా నతఁడు వచ్చి యాకసమువైపు చూచుసరికి ప్రతీచీ భాగమునఁ

* జాతమాత్రే సతి కర్తవ్యం కర్మ జాతకర్మ"

చంద్రుఁ డస్తమించుచుండఁగా ప్రాగ్దిశయం, దదేసమయమున సూర్యో దయ మగుచున్నది. * ఇట్లొకేసమయమున సూర్యచంద్రుల యుద యాస్తమయములు సంభవించుట కారాత్రి, పౌర్ణమినాఁటి రాత్రియై యుండఁదగును. ఆహితాగ్ని పున్నమినాఁటికిని అమవసనాఁటికిని పౌర్ణ మాసేష్టి దర్శేష్టి చేసికొనుటకై తనయింటికి తప్పక రావలసి యున్నది. కణ్వశిష్యుఁడు తెల్లవాఱుటను జూచి

"యావదుపస్థితాం హోమవేళాం గురవే నివేదయామి"

అనుచు సూర్యోదయానంతరకాల కర్తవ్యమైన పౌర్ణమాసేష్టికిఁ దగిన సమయము సంప్రాప్తమైనట్లు కణ్వర్షికిఁ దెలుప నేఁగెదనని వెళ్ళెను.

ఈ సందర్భములో కణ్వశిష్య వచనమునకుఁ బ్రమాణమిది.

"ప్రాగుదయా దమావాస్యాయాః తంత్రం ప్రక్రమయతి"

"ధర్శేష్టి సూర్యోదయమునకు ముందుగనే ప్రారంభింపవలెను" అను శ్రౌతసంప్రదాయమునుబట్టి పౌర్ణమాసేష్టి, సూర్యోదయానంతరకాలి కమే యగును కదా! ఈ శ్రౌత రహస్యమును, బాగుగఁ దెలిసిన వాఁడు కనుకనే మన శ్రౌతవిజ్ఞాన చణుఁడు కణ్వశిష్యముఖమున హోమవేళ సమీపించిన విషయమును గురువులకు నివేదించుటకుఁ శిష్యుని బంపించినాఁడు.

ఇఁక ఒండు రెండు విషయములు వినిపించి విరమించెదను.

"ఇత్థం ద్విజేన ద్విజరాజకాంతి రావేదితో వేదవిదాం వరేణ।
ఏనోనివృత్తేంద్రియవృత్తి రేనం జగాద భూయో జగదేకనాథః॥"

(చూ. రఘువంశము 5-23.)

"కౌత్సుఁడు రఘుమహారాజుతో నేదియో పలుకఁగా దిరిగి మహా రాజు వాని కిట్లనెను" అనియే యిందలి ప్రస్తుతకథాంశము. ఇట రాజునకు "ద్విజరాజకాంతిః" అని యొక విశేషణమును మనకవి

---

* "యాత్యేకతోఽస్తశిఖరం పతి రోషధీనా మావిష్కృతోఽరుణపురస్సర ఏకతోర్కః,,,—" (చూ. శాకుంతల నాటకము 4 అంకం 1 శ్లో.)

ప్రయోగించినాఁడు. 'చంద్రుని కాంతివంటి కాంతికలవాఁడు' అని యర్థాని యర్థము.

"తస్మా త్సోమరాజానో బ్రాహ్మణాః సోమో ఽస్మాకం బ్రాహ్మణానాఽగ్ం రాజా"

అను శ్రుత్యర్థము పై విశేషణముచేఁ బ్రకటితమైనది. మఱియు మానవుల మనోనైర్మల్యము, బుద్ధిప్రసాదము, మాతృచింత అనునవి బలవత్తరముగ నుండవలె నన్నచో వారికి చంద్రగ్రహముయొక్క బలము ముఖ్యము. ఈ విషయమే గ్రహముల కారకత్వమును వర్ణించెడు మహార్థదీపికలో

"మనోబుద్ధిః ప్రసాదం చ మాతృచింతా చ చంద్రమాః"

అని కలదు. విప్రులకు మనోబుద్ధుల నైర్మల్యము ముఖ్యాతిముఖ్యము. కనుక బ్రాహ్మణులకు చంద్రుఁడు రాజు అని మన మహాకవి సందర్భముచేసికొని చెప్పిన "ద్విజ రాజ కాంతిః" అను విశేషణములో నెంతేని శ్రుత్యర్థజ్యోతిర్విజ్ఞానము లిమిడియున్నవి. ఇట్టిదే "ఏనో నివృత్తేంద్రియ వృత్తిః" అను నింకొక విశేషణ మిందు కలదు. ఇందును నెంతేని శ్రౌతసంప్రదాయ రహస్యములు గర్భీకృతములై యున్నవి. పాపవ్యాపారరహితమైన ఇంద్రియవ్యాపారము కలవాఁడు అని పై విశేషణమున కర్థము.

"మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః"

అను సూక్తినిబట్టి * పంచమహాయజ్ఞములు నిర్వర్తించినవాఁడు బ్రహ్మజ్ఞానమునకుఁ దగిన యింద్రియవ్యాపారము కలవాఁ డగుచున్నాఁడు. కనుకనే మన శ్రౌతకవి రఘుమహారాజుచే విశ్వజిద్యాగము ▲ స్వయముగాఁ జేయించినాఁడు. కనుక పై శ్లోకములోని "ఏనో నివృత్తేంద్రియ వృత్తిః" అను విశేషణము శ్రుతిస్మృత్యర్థసమ్మతమై యీ కవియొక్క

* పంచమహాయజ్ఞములు. 1. దేవయజ్ఞము 2. పితృయజ్ఞము 3. భూతయజ్ఞము 4. మనుష్యయజ్ఞము 5. బ్రహ్మయజ్ఞము.

▲ రఘువంశ కావ్యము 5వ సర్గ. 1వ శ్లోకము.

శ్రౌతపాండితినిఁ జక్కఁగఁ జాటుచున్నది. దీనిచే "సత్కర్మాచరణము మానవుని చిత్తశుద్ధికిని, తన్మూలకముగ వాని విముక్తికిని సాధన మగు చున్నది." అను సత్కృష్టవిషయ మిచ్చట మనకవిచే నుపదిష్ట మగు చున్నది. కనుకనే భర్తృహరిమహాకవి తన సుభాషిత త్రిశతిలో "మానవుఁడు స్వస్వవిహితకర్మను ఆచరించుటచే సులభముగఁ దన గంతవ్యమును జేరఁగలఁడనియు, నిట్టి కర్మ నాచరింపక యుపాయాంతరముచేఁ దన గంతవ్యమును పొందఁగోరువాఁడు తెలికపిండికూర వండుటకై వైడూర్యమయపాత్రను సంపాదించి, మంచిగంధపు చెక్కలతో నాకూర వండునంతటి మూర్ఖుఁ డనియుఁ దెలిపినాఁడు. *

ఇట్లే ఈశ్వరుఁడు సప్తర్షులను రావించి వారిని, తనకు పార్వతీ పరిణయ సందర్భములో రాయబారము నడుపుడని యర్థించుసందర్భములో మన కవీశ్వరుని ముఖమున —

"అత ఆహర్తు మిచ్ఛామి పార్వతీ మాత్మజన్మనే।
ఉత్పత్తయే హవిర్భోక్తుః యజమాన ఇవారణిం॥"

(చూ. కు. సం. సర్గ. 6 శ్లో 28)

"యజమానుఁడు యజ్ఞాగ్నిని పుట్టించుటకై "అరణి"ని సంపాదించినట్లు మహర్షులారా! నేను కుమారోత్పత్తికై పార్వతీదేవిని పరిగ్రహింపఁదలచితిని." ఇచ్చట "అరుణి" "యజమాని" అను పదములు ఒక్క యజ్వాముఖమునుండియే వెల్వడఁదగియున్నవనుటలో సందేహములేదు. "యజమాన ఇవారణం" అను పై యుపమానముచే గిరిజ పవిత్రతేజస్సు నుద్భవింపఁజేయు "అరణి" వంటిదనియు నామె కుద్భవింపఁబోవువాఁడు అరణ్యుద్భవమైన అగ్నివంటివాఁ డనియు నీ యగ్నికి సోమయాజి, "సోమయాజీచే త్యష్టమూర్తయః" అను సూక్తి ననుసరించి యిట సోమయాజిరూపుడు సాక్షాదీశ్వరుఁడే యనియు, నీ యీశ్వరోద్భవమైన తేజస్సు (అగ్ని) లోఁ దారకాసురుఁ డింధన

* "స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలం చాందనైరింధనౌఘైః।......
ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి మనుజో యస్తపో మందభాగ్యః॥"

(చూ. సుభాషిత త్రిశతి)

ప్రాయుఁడు కాఁగలఁ డనియుఁ గనుక దేవతలకే జయము చేకూరఁగల దనియు నిట్టి యుపమాన బలముచే నెన్నియేని విషయము లిట సిద్ధములై, నాటకీకరణ పద్ధతిచే ముందుగనే మనకవిచే సూచింపఁ బడుచున్నవి.

పై విధముగా మన కాళిదాసమహాకవి, వైదికకర్మాచరణము మానవులకు పాపభంజకమై చిత్తశుద్ధిద్వారా ఆముష్మికానందదాయక మగుచుండు నని సూచించినాఁడు. కర్మభూమియైన మన భారత భూమిలోఁ బుట్టిన ప్రతిమనుజుఁడును స్వస్వవిహితకర్మాచరణముచేతనే సులభముగ జీవిత సాఫల్యము నందఁగలిగి, యిహపరములలో సౌఖ్యమును పొందఁగల్గు రీతిని మనకవిఁ జూపినాఁడు.

ఇట్టి శ్రౌతక్రియ మానవజాతి కంతటికిని సర్వాభ్యుదయములను గలిగింపఁజాలి యుండుటచేతనే యీ క్రియలు భారతీయులకు ప్రాణతుల్యములును ప్రాణాధికములు నై భరతదేశమంతటను వ్యాప్తిఁ జెందగల్గినవి. భారతజాతిలో నేదేని యద్భుతశక్తి యున్నదన్నచో నట్టిది భారతీయుల శ్రౌతక్రియానిర్వహణమువలననే అని యనవలసియున్నది. భారతీయుల మూలధనము లనఁదగిన యీ పుణ్య శ్రౌతక్రియలకును, భారతీయసంస్కృతీసర్వస్వమునకును భారతీయ ధర్మసంరక్షణమునకును రత్నపేటిక లనఁదగిన మన కాళిదాస కవీంద్రుని కావ్యములు ప్రతి భారతీయునికిని దప్పక సాదరముగ నధ్యయనము చేయఁదగియున్నవి. మహాకవియొక్క మహాకావ్యములను ఆ యా ప్రత్యేకదృక్పథములతో నధ్యయనముచేసినచో భారతీయులు తమ ధర్మమును నిర్వర్తించిన వారై, శ్రీ కాళిదాస కవీంద్రుని ఋణమునుండి కొంత విముక్తులు కాఁగల్గుదురు. కర్మ, బ్రహ్మస్వరూపము గాన, నిష్కామకర్మాచరణము మోక్షప్రదమనియు, కామ్యముగఁ జేసినచో నట్టి దైహికాభ్యుదయ సంపాదకమనియు, నీ శ్రౌతక్రియాచరణము మొత్తముపై మానవులకు నిహపరసాధకమనియు, జనతకు దెలిపి, విశ్వశ్రేయమునకుఁ దన కావ్యముల నీ కవీంద్రుడు మంగళతోరణముల గావించి జాతీయమహాకవియై విశ్వప్రేమకుఁ బాత్రుఁడైనాఁడు.

ఓమ్

# కాళిదాస హృదయము

## శ్రీ కాళిదాస శివభక్తితత్త్వము – తత్త్వజ్ఞానవైభవము

కాళిదాస మహాకవి తన రఘువంశ మహాకావ్య ప్రారంభము లోను, స్వనాటకత్రయ ప్రారంభములోను, జేసిన "శివస్తుతి"ని బట్టి కొందఱీ కవిని శివభక్తుఁ డనుకొందురు. ఇతఁడు తన కావ్య నాటకాది స్తుతి శ్లోకములలో "వందే" "నమః" "అవతు" ఇత్యాది శబ్దములఁ బ్రయోగించుచు, నేదియో మహత్తర లక్ష్యసిద్ధికై భగవదుత్కృష్ట తను, స్వీయాఽపకృష్టతను బహుభక్తిపరతం బ్రకటించిన కర్మయోగి. ఈ కవి బ్రహ్మ క్రమపరిణతితో "ఆత్మజ్ఞాన సంపన్నుఁ"డైన రీతినిగూడ నీతని కావ్యస్థోదాహరణములు దెలుపఁగలవు. * ఎట్లైనను ఈ కవీశ్వ రుఁడు తన శాకుంతల నాటక రచనము నాటికిఁ దనకు జన్మరాహి త్యము, దుష్యంతుని ద్వారా కాంక్షించ గల్గినంతటి మానసిక పరిణ తిని సంపాదించి, తత్త్వవిచ్ఛిరోమణి యైనట్లు ఇతని శాకుంతల భరత వాక్యము, కొన్ని శాకుంతలవాక్యములు ♦ వ్యక్తము సేయఁగలవు.

ఈ కవీశ్వరుని "శివభక్తి తత్త్వము"ను ఈ క్రింది సురేశ్వరా చార్యులవారి వార్తికము తెలుపఁగలదు.

"........అపరిపక్వవాసనారూపకర్మాఽఽశ్రయ
మాయాఽవచ్ఛిన్నం బ్రహ్మ యావత్పరిపాకం
నిశ్చలతరంగ సముద్రవ త్తిష్ఠతి తచ్ఛివః."

జీవులయొక్క యపరిపక్వ కర్మలు పరిపాకదశకు వచ్చువఱకు, ఆ జీవులు వాసనారూప కర్మలతోఁ గూడి "మాయ" లో నుండును. ఇట్టి

---

* ధ్వన్యర్థజ్ఞానముతో చూ. రఘువంశము. సర్గ. 5 శ్లో 24, 25.
కు. సం. సర్గ. 1 శ్లో 43. సర్గ 2 శ్లో 51. సర్గ 3 శ్లో 50 మొదలైనవి.

♦ చూ. శాకుంతలం అంకం 1. శ్లో 18. లోని ధ్వన్యర్థము. చూ. తత్త్వజ్ఞానవైభవభాగము

మాయా విశిష్టమైన బ్రహ్మస్వరూపము నిశ్చలమై యుండును. నిర్వికారమైన యీ బ్రహ్మస్వరూపమే "శివుఁడు" అనఁబడును.

ఇట్టి య్యేకైక "శివతత్త్వము" సృష్టికాలములో ఆది దంపతులుగ విభక్తమగును. ఈ పురాణదంపతులే కాళిదాసుచే రఘువంశ మహాకావ్యాదిలో స్తుతింపఁబడిన పార్వతీ పరమేశ్వరులు. వీరే ప్రకృతి పురుషులు. వీరి సమ్మేళనమే ప్రపంచసృష్టికి మూలమగుచున్నది. కనుకనే వీరు జగత్తునకుఁ దలిదండ్రులైనారు. ఈ విషయమును కవి రఘువంశ కావ్యాది శివస్తుతిలో వ్యక్తముచేసినాఁడు. వీరి కలయిక అర్థనారీశ్వర రూప మయ్యు నిండెంతో తత్త్వ మున్నది.

ఇట్లు ఏకతత్త్వము భిన్నరూపములఁ జెందుటను యజురారణ్యక మిట్లు తెలుపుచున్నది. "తదాత్మానగ్ం స్వయ మకురుత" ఆ పరబ్రహ్మము సృష్టి కనుకూలమగునట్లు సర్వజగ దధిష్ఠానమై తన్ను స్వయముగా ప్రకృతి పురుషుల రూపముగ విభక్తము చేసికొనెను. ఈ విషయమునే మన కవీశ్వరుఁడు తన కుమారసంభవకావ్యములో దేవతలచేత బ్రహ్మను స్తుతింపఁజేయు సందర్భమున జెప్పినాఁడు.

"స్త్రీ పుంసా వాత్మభాగౌ తే భిన్నమూర్తే స్సిసృక్షయా,
ప్రసూతిభాజ స్సర్గస్య తావేవ పితరౌ స్మృతౌ.

(చూ. కు. సం. సర్గ 2)

ఓ బ్రహ్మ! ఈ చరాచరసృష్టి సేయు నిచ్ఛతో నీ యొక్క, యొక్క రూపమునే నీవు స్త్రీ పుం రూపములుగ విభజించుకొంటివి. కనుక స్త్రీ పురుషు లిరువురును నీ య్యేకైక రూపముయొక్క రెండు భాగములే కావున నీ సృష్టి కంతకు వారే పితరులు."

పరబ్రహ్మయొక్క మొదటి "యద్వితీయత్వమే" భారతీయుల యద్వైత తత్త్వమునకు మూలమై, వారి సర్వ వేదాంత శాస్త్రములకు సారమై యున్నది,

"వేదాంతసిద్ధాంత నిరుక్తి రేషా బ్రహ్మైవ జీవ స్సకలం జగచ్చ"
(ఆచార్య శ్రీ శంకర భగవత్పాదులు)

"ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ। నేహ నా నాస్తి కించన"
(ఉపనిషత్సూక్తి)

"ఆత్మావా ఇద మేకఏ వాగ్ర ఆసీత్। నాన్యత్కించన మిషత్॥"
(ఉపనిషత్సూక్తి)

"ఏకం సద్విప్రా బహుధా వదంతి........" ,,

ఇట్లు సర్వవేదాంతశాస్త్ర సమ్మతమైన ఆత్మైకత్వ సిద్ధాంతమునే మన మహాకవి తన కుమారసంభవములో బ్రహ్మస్తుతి సందర్భముననే—

"నమ స్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్ సృష్టేః కేవలాత్మనే।
గుణత్రయవిభాగాయ పశ్చా ద్భేద ముపేయుషే" (2-4)

అనియు —

"ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః" (2-6)

అనియు నొక్కి వక్కాణించినాఁడు.

ఇఁక ప్రకృతి పురుషుల విషయములో మన కవీశ్వరుఁడు తన కుమారసంభవములో—

"త్వా మామనంతి ప్రకృతిం పురుషార్థప్రవర్తినీం।
తద్దర్శిన ముదాసీనం త్వామేవ పురుషం విదుః॥" (2-13)

ఓ పరబ్రహ్మ! తత్త్వవేత్తలు నిన్ను భోగాపవర్గ రూపమైన పురుషార్థమును బ్రవర్తింపఁజేసెడు "ప్రకృతి"గా జెప్పుచున్నారు. ఇట్లా ప్రకృతిని సాక్షిగాఁ జూచుచున్న నిన్ను కూటస్థపురుషునిగాఁ దత్త్వజ్ఞులు దెలిసికొనిరి"

ఇట "పురుషుఁడు" అనఁగా

"పురి హృదయ కుహరే శయనాత్ పురుషః"

సర్వజీవుల హృదయకుహరములందు శయనించి, సర్వాంతర్యామియై యుండువాఁడు, కనుకనే యీ పురుషునిగూర్చి పురుషసూక్తము—

"పురుష ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చ భవ్యం"

అని కీర్తించినది. ఇట్లు పురుషశబ్ద వాచ్యుఁడైన ఈశ్వరుని యీ సర్వ వ్యాపకత్వ విషయమే—

"ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"

అనియు—

"సర్వస్య చాహం హృది సన్నివిష్టః—"

అనియు గీతలో శ్రీకృష్ణపరమాత్మచేఁ దెలుపఁబడినది.

పై విషయమంతయు తత్త్వవిచ్ఛిరోమణియైన మన మహాకవి తన కుమారసంభవములో బ్రహ్మస్తుతి సందర్భముననే దెలిపినాడు.

"త్వం పితౄణా మపి పితా దేవానా మపి దేవతా।
పరతోఽపి పరశ్చాసి విధాతా వేధసా మపి॥"

(చూ. కు. సం. సర్గ 2 శ్లో. 14)

"ఓ బ్రహ్మ! నీవు అగ్నిష్వాత్తాది పితృదేవతలకుఁ గూడ తర్పణీయుఁడవు. ఇట్లే నీవు దేవత లందఱకును ఆదిదేవుఁడవు. ఓ పరాత్పరా! తెలియఁదగిన వస్తువులలో నేది తుది వస్తువుగా నిశ్చితమైనదో అట్టి చరమవస్తువునకుఁ గూడ నీవు ఆవలివాఁడవు. అనఁగాఁ బరాత్పరుఁడవు. దత్ బ్రహ్మకుఁగూడ నీవు బ్రహ్మవు" ఇట్లు మన కవిచే 'బ్రహ్మ' పరాత్పరుఁడుగా భాసితుఁడైనాఁడు. పరబ్రహ్మ రూపుఁడైన లేక పరమ శివాత్మకుఁడైన యీ 'బ్రహ్మ' పరాత్పరత్వమును మఱియొకసూక్తి ఇట్లు సువ్యక్తముచేయుచున్నది.

"ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః అర్థేభ్యశ్చ పరం మనః।
మనసశ్చ పరా బుద్ధిః బుద్ధే రాత్మా మహాన్ పరః।
మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః
పురుషా న్న పరం కించిత్ సాకాష్ఠా సా పరాగతిః॥"

(కఠోపనిషత్

ఇంతటితో 'బ్రహ్మ'కు పరాత్పరత్వము సిద్ధించినది. ఇఁక జగత్సృష్టి స్థితి లయములలో నీతనిదే సర్వాధిపత్య మను విషయమీ క్రింది శ్లోకములో మన మహాకవి విస్పష్టము చేసినాఁడు.

"ద్రవ స్సంఘాతకఠినః స్థూల స్సూక్ష్మో లఘు ర్గురుః ।
వ్యక్తో వ్యక్తేతరశ్చాసి ప్రాకామ్యం తే విభూషిషు॥"
(కు. సం. 2-11)

"ఓ పరబ్రహ్మ! నదీ సముద్రాది ద్రవపదార్థసముదాయ మంతయు నీ పరిణామరూపమే. ఇట్లు పర్వతాది కఠినపదార్థజాతమును, ఘటాది స్థూలపదార్థజాతమును, ఇంద్రియగోచరము కాని పరమాణ్వాది సూక్ష్మపదార్థజాతమును ఓ పరబ్రహ్మ! నీ పరిణామరూపమే. ఇట్లే జిల్లేడుదూది వంటి లఘుపదార్థమును, మేరుపర్వతము వంటి గురు పదార్థమును నీవే; కార్యకారణములు కూడ నీవే. ఇట్లు అణిమాద్యష్ట సిద్ధులలో నీ యిష్టమే ప్రాముఖ్యము వహించును. కాఁగా పరబ్రహ్మ రూపము ఎన్ని భిన్న వస్తువులుగా మార్పు చెందినను, తన యిష్టమే ముఖ్యమగుటచే మూలరూపము చెడకుండుట యిట వ్యక్తమైనది. ఈ శ్లోకములోని "స్థూల సూక్ష్మద్రవాది" పదార్థముల కీ క్రింది యుపని షదర్థమే మూలము.

"అణో రణీయా న్మహతో మహీయా నాత్మా గుహాయాం నిహితో ఽస్య జంతోః——అతశ్చ విశ్వా ఓషధయో రసాశ్చ యేనైష భూత స్తిష్ఠ త్యంతరాత్మా॥ (చూ. తైత్తిరీయోపనిషత్తు)

ఇట్లు ఉపనిషదర్థసమ్మతమైన మన కాళిదాస కవీంద్రుని బ్రహ్మస్తవమును బట్టి బ్రహ్మకు లేక శివునకు పరాత్పరత్వమును, సర్వాధిపత్యమును, సర్వాధ్యక్షత్వమును, సర్వ శక్తిమత్త్వమును, ఆద్యంతరాహిత్యము నను నవి సిద్ధించినవి.

ఇఁక నీ దృశ్యమాన ప్రపంచములో నగపడు వస్తుజాత మంత యు విశ్వేశ్వరుని విశిష్టస్వరూపమే యని యీ క్రింది శ్లోకములో —

"త్వమేవ హవ్యం హోతా చ భోజ్యం భోక్తా చ శాశ్వతః।
వేద్యం చ వేదితా చాఽసి ధ్యాతా ధ్యేయం చ యత్పరం॥"
(చూ. కు. సం. 2-15)

ఓ దేవదేవా ! భోజ్యపదార్థమును, భోక్తయు నీరూపమే. ఇట్లే తెలియఁదగిన వస్తువును, దెలిసికొనువాఁడవును నీవే.

ఇట్లు త్రిమూర్తులలో నొకఁడైన 'బ్రహ్మ'ను సాక్షాత్పరబ్రహ్మరూపుఁడైన పరమశివునిగఁ జిత్రించిన మన కవి ఆ పరమశివ తత్త్వమునే తనకావ్య మందిరములో సుప్రతిష్ఠితముచేసి మనసారనోరారఁ దత్త్వమును ఆరాధించి అభినుతించినాఁ డనుటకు నీ కవీశ్వరుని కావ్యములలో నింకను నెన్నియేని యుదాహరణములు కోకొల్లలు.

"సృష్టి స్థితి లయముల కొక్కరుఁడే బ్రహ్మ కారణ మగుట"ను దన 'రఘువంశము'లో విష్ణుస్తవ సందర్భమును బురస్కరించుకొని యీ కవి

"నమో విశ్వసృజే పూర్వం విశ్వం తదను బిభ్రతే
అథ విశ్వస్య సంహర్త్రే తుభ్యం త్రేధా స్థితాత్మనే"

అని ఒక్కరుఁడే అవస్థాత్రయ విశిష్టుఁడై ప్రళయస్థితి సర్గములకు మూలకారణ మగుచున్నట్లు తెలిపినాడు. పై శ్లోకార్థము, ఈ క్రింది తైత్తిరీయోపనిష దంతర్గతమైన "భృగువల్లి" లోని యీ వాక్యార్థములో నెట్లు ప్రతిఫలించుచున్నదో పరిశీలింపుడు.

"యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి।
య త్ప్రయం త్యభిసంవిశంతి త ద్విజిజ్ఞాసస్వ త ద్బ్రహ్మేతి॥"

ఇఁక యీ చరాచర ప్రకృతి యంతయును, 'అష్టమూర్తి' స్వరూపుఁడైన ఈశ్వరునిలోఁ బ్రతిబింబించుచున్న రీతి నీతఁడు తన శాకుంతల నాటకములోని నాందిలో జూపినాడు.

"యా సృష్టిః స్రష్టు రాద్యా........ప్రత్యక్షాభిః
ప్రపన్న స్తనుభి రవతు వ స్తాభి రష్టాభి రీశః"

పంచభూతములు, సూర్య చంద్రులు, సోమయాజి అను నెన్మిది మూర్తులు మన కీ ప్రపంచములో ప్రత్యక్ష దృష్టము లగుచున్నవి. ఈ మూర్త్యష్టకములోఁ బ్రపంచమంతయు నిమిడి యున్నది. కాఁగా ప్రపంచ స్వరూపుఁడు పాఠకులను బ్రోచుఁగాత మని కవి యాశయము. మన యీ కవికి నాలువందల సంవత్సరములకుఁ బిమ్మట నున్న శ్రీ శంకరభగవత్పాదులవారు కూడ కాళిదాసుని పై భావమునే తమ దక్షిణామూర్త్యష్టకములో జూపినారు.

"భూ రంభా స్యనిలో నలోం బర మహర్నాథో హిమాంశుః పుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకం ।
నాన్య త్కించన విద్యతే విమృశతాం యస్మా త్పరస్మా ద్విభో ।
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే॥"

అని విశ్వరూపుని విశ్వరూపములను విశదీకరించినారు. కనుక విశ్వేశ్వరుఁడు విశ్వరూపుఁడే యగుట తథ్యము కదా! అనఁగా ఈ బ్రహ్మాండ మంతయును బరమశివుని లేక పరబ్రహ్మస్వరూపుని మహాశరీరమే యగుచున్నదని మన కాళిదాస కవీంద్రుని కమనీయసూక్త్యర్థములచే స్పష్టమైనది.

ఇట్లు బ్రహ్మాండము నంతటిని బరమేశ్వర స్వరూపముగ భాసింపఁజేసి, తన ఆత్మజ్ఞానజ్యోతితోఁ బాఠకుల చిత్తములలో నాత్మజ్ఞాన జ్యోతిని వెలిఁగించిన మన కాళిదాస కవీంద్రుని కావ్య సాహిత్యమే ఉత్తమోత్తమమైన సాహిత్య మనఁదగియున్నది. ఈ సందర్భమున మన శ్రీ 'రాష్ట్రపతి' శ్రీ రాధాకృష్ణ మహోదయుల వాక్యముల నిట నుల్లేఖించెదను. 24 జూన్ 62 దైనిక ఆంధ్రప్రభలో శ్రీ రాధాకృష్ణ మహోదయులు "ఆత్మజ్యోతిని వెలిగింపఁగల్గినదే ఉత్తమసాహిత్యము"

అను విషయమునుగూర్చి "కళారూపము రచయిత స్వీయ జీవితాను భవముతో కూడుకొని యుండును... ...విజ్ఞాన శాస్త్రీయ ఫలితము లను మఱొక రూపములో సంపూర్ణముచేయవచ్చును. ఆటంబాంబును అమెరికాయే ప్రథమముగఁ బ్రయోగించుట కేవలము కాకతాళీయము. ఆ పనిని ఆ దేశము చేయకపోయినచో బ్రిటన్‌గాని, రష్యాగాని చివరకు జపానైనను జేసియుండెడిది. కొలంబస్ పుట్టకపోయినచో మఱొకరు అమెరికాదేశమును గనుఁగొని యుండెడివారు. వాస్కోడి గామా మన దేశమునకు సముద్రమార్గమును నిశ్చయింపనిచో నితరు లెవరో ఆ కార్యమొనరించి యుండెడివారు. కాని కాళిదాస మహాకవి పుట్టియుండనిచో 'అభిజ్ఞాన శాకుంతలము' ఉండెడిది కాదు. సాహిత్య గ్రంథములను కళాఖండములు, రచయిత మేధాసంపత్తితోడను, వ్యక్తి ప్రతిభతోడను, ఆకృతి ధరించును. కావున అట్టి కళాస్వరూప ములు మఱొకరిచే యథాతథముగ పూరితము లగుట అసాధ్యము. విజ్ఞాన శాస్త్రములోఁ బ్రావీణ్యము గడించుటకు అనేక శిక్షణాల యము లుండవచ్చును. కాని, కవులను ప్రవక్తలను దయారుచేయు శిక్షణాలయములను మనము కనుఁగొననేరము—

"సాహిత్యము జీవిత విమర్శనము కాదు. జీవిత పరివర్తనమును నిశ్చయిఁచునది. వినోదము కలిగించుట కంటెను, నీతిబోధ మొన ర్చుటకంటెను, 'ఆత్మజ్యోతిని వెలిఁగించుటయే' సాహిత్యముయొక్క పరమ ప్రయోజనము."

మన రాష్ట్రపతి మహోదయులయొక్క పై సూక్తులకు, మన కాళిదాస మహాకవి కవిత నూటికి నూరుపాళ్లును దగియున్నట్లు, ఇతని కావ్యోదాహరణములు ప్రత్యక్ష ప్రమాణము లనుట ప్రత్యక్షరసత్యము.

ఇట్లు మన కవీశుని 'శివస్తుతి'ని బట్టి విశ్వమును విశ్వేశ్వరుని విశిష్టరూపముగ విలోకింపఁగల్గిన విజ్ఞపాఠకునకు 'విశ్వ ప్రేమ' స్వాయ ముగనే యుదయించుచున్నదిగదా! కాఁగా, ఇట్టి ధన్యాత్ములయొక్క

విశ్వప్రేమవిలసితవిమలవిశిష్టజీవితములు విశ్వకళ్యాణమునకుఁ బచ్చని తోరణము లగుచుండు ననుట నిర్వివాదాంశమే యగును.

ఈ కవి తన మాళవికాగ్నిమిత్రములోని నాందిలో—

"....అష్టాభి ర్యస్య కృత్స్నం జగదపి తనుభి ర్బిభ్రతో నాఽభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వ స్తామసీం వృత్తి మీశః॥"

ఇట "ఈశ్వరుఁ డష్టతనువులతోఁ బ్రపంచరూపుఁ డయ్యు నిరహంకారుఁడు. మోక్షమార్గ సందర్శనమునకై యట్టి యీశ్వరుఁడు మీ తామసవృత్తిని దరలింపఁజేయుగాక" యని కవి కాంక్షించినాఁడు. కనుకనే ముముక్షుజనము తమ తమస్సునుండి వెలుఁగుబాటకు దారి చూపుమని యిట్లు

"అసతో మా సద్గమయ తమసో మా జ్యోతి ర్గమయ మృత్యో ర్మా ఽమృతం గమయ"

అని తమతామసవృత్తినివృత్తి కొఱకుఁ బరమేశ్వరుని ప్రార్థించుచుందురు. ఇది మన కవి యనిన "—సన్మార్గాలోకనాయ—" అను పదమునకు మూలము కావచ్చును. ఇఁక విక్రమోర్వశీయ నాటకాదిని—

"వేదాంతేషు య మాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ।
యస్మి న్నీశ్వర ఇ త్య నన్యవిషయ శ్శబ్దో యథార్థాక్షరః।
అంత ర్యశ్చ ముముక్షుభి ర్నియమితః ప్రాణాది భిర్మృగ్యతే।
స స్థాణు శ్స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసాయా ఽస్తు నః॥"

ఇందలి 'పురుషుని' సర్వ వ్యాపకత్వము, ఏకత్వము, ఈశ్వర శబ్దార్థమును మొదట వివృతమైనవి. ఇట 'ఈశ్వర' అన్న శబ్దము ఒక్కనికే చెందుననుటచే 'తచ్ఛివః'అను పరమశివతత్త్వము సూచితము. కాఁగా ఈ శివుఁడే సర్వదేవతా స్వరూపుఁడైన ఏకపురుషుఁడని * కాళిదా

* "ఏకపురుష" పదము "ఏకమేవా ఽద్వితీయం బ్రహ్మ" అను ఉపనిషత్సూక్తికి స్ఫోరకము.

సుని 'శివభక్తి'లోని సర్వదేవతాత్మకత్వము సూచితము. మూఁడవ పాదములో యోగమార్గముచే నీశుఁడు ముముక్షుజనులచే దమలో వెదకఁబడునఁట. ఈ కవీశ్వరుఁడు ఈశ్వరునిచేఁ దపస్సుచేయించున దనినగూడ నిట్లే "ఆత్మ"ను గూర్చి

"మనో నవద్వారనిషిద్ధవృత్తి హృది వ్యవస్థాప్య సమాధివశ్యం ।
య మక్షరం క్షేత్రవిదో విదుస్త మాత్మాన మాత్మ న్యవలోకయంతం॥"

(చూ. కు. సం. సర్గ 3-50)

"ఈశ్వరుఁడు సమాధిస్థితుఁడై, నవద్వారములను బంధించుటచే నిర్వ్యాపారమై, సమాధిచే వశంగతమైన తన మనస్సును దన * హృదయాధిష్ఠానమందు నిలిపి క్షేత్రజ్ఞులైన పురుషు లెవనిని నాశరహితునిగాఁ దెలిసికొనిరో అట్టి పరమాత్మను ఈశ్వరుఁడు తనలోఁ జూచుచున్నాఁడు." ఈ శ్లోకములో "ఆత్మాన మాత్మ న్యవలోకయంతం" అని ఆత్మస్వరూపుఁడైన తాను దనలోఁ దనరూపమునే చూచుచున్నాఁడని కాళిదాసుని కమనీయకల్పన. ఈ విషయమునే యీ కవి రాయబారులైన సప్తర్షులచే నిట్లు పలికించును.

"యోగినో యం విచిన్వంతి క్షేత్రాఽభ్యంతరవర్తినం ।
అనావృత్తిభయం యస్య పద మాహు ర్మనీషిణః॥"

(చూ. కు. సం. 6-77)

ఇట్లీశ్వరుఁడు యోగమార్గముచేతనే గాక భక్తియోగముచేతనుగూడఁ దెలియఁదగినవాఁడఁట. త్యాగరాజాదిభక్తులు తమస్థిరభక్తి చేతనే ముక్తులైన విషయము విజ్ఞవిదితమే. కనుకనే శంకరభగవత్పాదులు 'భక్తి'ని గూర్చి తమ 'వివేకచూడామణి'యను వేదాంతగ్రంథములో

---

* యతో నిర్యాతి విషయః యస్మిం శ్చైవ ప్రలీయతే ।
హృదయం త ద్విజానీయా న్మనసః స్థితికారణమ్॥ (వసిష్ఠుఁడు). విషయముల పుట్టుకకు లీనతకు, మనసుయొక్క నిల్కడకు కారణమైనది "హృదయము".

"మోక్షసాధనసామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ।
భక్తేస్తుయా పరాకాష్ఠా సైవ జ్ఞానం ప్రకీర్తితం।
వైరాగ్యస్య తు సీమా సా జ్ఞానే త దుభయం యతః॥"

"మోక్షమును సులభముగ సాధించుటకుఁ దగిన యుత్తమ సాధన సామగ్రిలో 'భక్తి'యే గొప్పది. ఈ 'భక్తి' యొక్క చరమసీమయే "జ్ఞానము" అనఁబడును. వైరాగ్యము యొక్క చరమసీమ కూడ జ్ఞానమే. కనుక జ్ఞానవైరాగ్యములకుఁ గూడలియైన భక్తి, పరమేశ్వరుని సులభముగఁ దెలిసికొనుటలోను మోక్షముఁ బడయుటలోను నుత్తమసాధనమనుట సత్యము. ఇట్లు మన మహాకవి జ్ఞానయోగ, భక్తిసాధనములచే క్రమముగ ఆత్మ సాక్షాత్కారభాగ్యముఁ బడసిన జీవన్ముక్తుఁడు కనుకనే తన శాకుంతల నాటకాంతమున "పునర్జన్మ రాహిత్యమునే తన ధ్యేయముగాఁ సూచించినాఁడు, మఱియుఁ త్రిమూర్తులలో నొక్కనినే సర్వదేవతా స్వరూపునిగను సృష్ట్యాది సర్వకార్యకరణదక్షునిగను, సర్వశక్తియుక్తునిగను, వర్ణించి, ఆ త్రిమూర్తులలోఁ బౌర్వాపర్యమనునది లేదని కు. సం.లో నిట్లు దెలిపినాఁడు.

"ఏకైవమూర్తి ర్బిభిదే త్రిధా సా సామాన్య మేషాం ప్రథమావరత్వం।
విష్ణో ర్హర స్తస్య హరిః కదాచి ద్వేధా స్తయో స్తా వపి ధాతు రాద్యౌ॥"

చూ. కు. సం. (7-44). ఒకేమూర్తి ముమ్మూర్తులుగ మాఱినదిగాన నీ త్రిమూర్తులలో జ్యేష్ఠ కనిష్ఠ భేదము లేదు. ఒకప్పుడు విష్ణువుకంటె నీశ్వరుఁ డాద్యుఁడైనచో మఱొకప్పుడు హరునికంటె హరియే ఆద్యుఁడు. ఇట్లే యింకొకప్పుడు వీరిద్దరకు బ్రహ్మ ఆద్యుఁడు. కనుక వీరిలో ప్రథమావరత్వము సర్వసామాన్యమే. ఈ విషయమునే మన కవి యీశ్వరుని గూర్చి సప్తర్షులచే నిట్లు పలికించినాఁడు. "ఓ మహేశా! నీ యీ దృశ్యమానరూపము త్రిమూర్తులలో ఏ మూర్తికిఁ జెందినది" (చూ. కు. సం. 6-23) అని ప్రశ్నించి—

"మా ప్రశ్నముకు సమాధాన మతి గుహ్యతమమైనది గాన, అర్ధాని నట్లుంచి మము తలంచిన పనిని దెలుపు"మని సప్తర్షు లీశ్వరుని నర్థించెదరు. (చూ. కు. సం. 6-24).

పై రీతిగ మన మహాకవి త్రిమూర్తులయందును భేదరహిత మైన సమదృష్టి కలవాఁడు కనుకనే తన రఘువంశములో విష్ణుస్తుతి సందర్భమున విష్ణువును బ్రహ్మవాచకములైన 'చతుర్ముఖ' "పరమేష్ఠి" శబ్దములతో సూచించినాఁడు.

"ఇతి ప్రసాదయామాసుః తే సురా స్త మధోక్షజం ।
భూతార్థవ్యాహృతి స్సా హి న స్తుతిః పరమేష్ఠినః"

"...త్వ త్తస్సర్వం చతుర్ముఖాత్". ఇట్లు బ్రహ్మాది దేవత లందఱును ఒకే యొక మూలతత్వమునకుఁ జెందిన విభిన్నరూపములనియు, నొక్కతత్త్వమును సేవించినచో నందఱు సేవింపఁబడినట్లే యగుననియు, యుపదేశించినాఁడు. మఱియు నై విషయమును వివరించుచు నీ యద్వైతకవి విష్ణుస్తవముననే

"రసాంతరా ణ్యేకరసం యథా దివ్యం పయో ఽశ్నుతే ।
దేశే దేశే గుణే ష్వేవ మవస్థా స్త్వ మవిక్రియః॥" *

(చూ. రఘువంశము 10 సర్గ.)

"ఓ దేవదేవా! స్వతః మధురమగు వర్షోదకము చవిటి ప్రదేశములలోఁ బడి ఉప్పగ మాఱినట్లే స్వతః ఏ వికారములును లేని నీవు సత్త్వాది భిన్నగుణముల నాశ్రయించి బ్రహ్మాది విభిన్ననామములతోఁ బిలువఁ బడుచుందువు. నిజమునకు వికారములు లేని నీ మూలతత్త్వముమాత్ర మొక్కటియే." ఇట్లు పరమేశ్వరుని నిజరూపము లేక తత్త్వము దెలిసినవారు 'భిన్నతను నమ్మక భేదభావరహితమైన యైక్యభావ ముతో నేకతత్త్వము నుపాసించి తరించెద రనియు, నజ్ఞులు చవిటి నేలలోని నీటిరుచినిబట్టి ఉప్పనయే నీటిగుణమని భ్రమించునట్లు భిన్న

* "అవిక్రియః" అనుటచే నిట పరిణామసిద్ధాంతము స్వీకృతము.

తనే నిజమని నమ్మి నిజగుణమును దెలియలేనివారు తమ చంచల భావములతోఁ గష్టములపా లగుదురనియు మన యద్వైత కవి యిట సూచించినాఁడు. భగవద్గీతలోఁ బై శ్లోకభావమే,

"యే ప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయా ఽన్వితాః ।
తేఽపి మామేవ కౌంతేయ యజం త్యవిధిపూర్వకమ్॥"

'భిన్న దేవతా భక్తులు తమ తమ దేవతలను భక్తి శ్రద్ధలతో సేవించి నచో వారి ఆ భిన్న దేవతార్చన లన్నియు నో యర్జునా! నాకే చెందును. వారి భిన్నత్వము మిగులును. కనుక ఏకేశ్వరోపాసన మానవుల భావైక్యమునకు సాధనమగును.' ఈ గీతారహస్యమును మన భారతీయాద్వైతకవి తన కావ్యముఖమున నెట్లు చాటినాఁడో చిత్త గింపుఁడు.

"బహుధాప్యాగమైర్భిన్నాః పంథాన స్సిద్ధిహేతవః ।
త్వయ్యేవనిపతంత్యోఘా జాహ్నవీయా ఇవార్ణవే॥"

(రఘువంశము)

"పురుషార్థ సిద్ధికి సాధకములైన మార్గములు తత్తదాగమసిద్ధాంతముల ననుసరించి భిన్నములుగ నున్నను అవన్నియు నో దేవాదిదేవా! గంగాదిభిన్ననదులన్నియు భిన్నమార్గములఁ బ్రవహించినను, తుద కొక్కసముద్రములోనికే వెళ్ళి కలిసి, అవి యఖండమహోదధియైన ట్లాభిన్నమత మార్గములన్నియు నీలోనికే వచ్చి చేరి నీలో నంతర్భ వించుచున్నవి." అనఁగా భిన్నమత సిద్ధాంతముల నన్నిటిని మన యద్వైత మహోదధి తనలో లీన మొనర్చుకొని వానికి తన యైక్య రూపము నొసంగఁజాలిన దని కవిభావము.

మన భారతీయమతములో మోక్షప్రాప్తికి సాధనములుగా నింకను మంత్రతంత్రాదులు కూడ మన వేదములయందును, దర్శన ములయందును, ఆగమములయందును భిన్నభిన్నరీతులుగఁ జూపఁ బడినవి. పై విభిన్నమార్గము లన్నియు స్థూలదృష్టికి సమన్వయము

కొందరమిచేఁ బరస్పర వివాదాశ్రయములై పరస్పర విరుద్ధముగఁ బొడకట్టుచున్నవి. ఐనను ఈ విభిన్నమార్గము లన్నియు ఒక్క-పరమేశ్వరప్రాప్తికే దారిచూపుచున్నవి. కనుక నానావిధములైన సాధనములు నామరూపాదులచేత మాత్రమే భిన్నములుగ గన్పట్టు చుండుననియు, వీని పరమలక్ష్యముమాత్ర మొక్క-టియే యనియు మన కాళిదాసమహాకవి తనతాత్త్వికదృష్టితో మనకుఁ బ్రస్ఫుటముచేసి పరతత్త్వజ్ఞాన ప్రాప్తికి వెలుఁగుబాటను జూపినాఁడు.

ఈ కవీశ్వరుని పై యుపదేశములను బట్టి సర్వమత సామరస్యము, మానవసంఘము లన్నిటిలో నిజమగు సమైక్యభావన, అనునవి సునాధ్యము లగుచున్నవి.

నేటి ప్రపంచమును బటిష్ఠము చేయుటకు ముఖ్యసాధన మీ సమైక్యభావనయేకదా! ఇది కేవల వాగాడంబరముచేతనే సిద్ధించునది కాదు. ఇది క్రియాత్మకముగా నాచరణములోనికి రావలె నన్నచో మన కాళిదాసుని ఈ యుపదేశమే మూలము. ఇదియే తత్సాధనకు సుకరమైనమార్గము. ఈమార్గము ఉపనిషత్సమ్మతమైన సత్యవిషయ మనుటకీ క్రింది యుపనిషత్సూక్తియే ప్రమాణము.

"అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాగ్ం సర్వాత్మా ।
సర్వాః ప్రజా యత్రైకం భవంతి॥"

(చూ. తైత్తిరీయోపనిషత్)

"సర్వాంతర్యామియైన యొకేపరమాత్మ అందఱి హృదయ కుహరములలో శయనించి సర్వజనశాసకుఁ డగుచు అందఱి బుద్ధివృత్తులను తత్తదర్హతలనుబట్టి సద్విషయములందుఁ బ్రేరేపించును. సన్మార్గాఽలోకనసిద్ధికై అందఱును, ఆ పరమాత్మ స్వరూపుని సమముగ నారాధించినచో, నయ్యారాధన యందఱిని నొకే లక్ష్యప్రాప్తికిఁ బ్రేరేపించి యందఱిలో సమైక్యభావన సముద్దీపింపఁజేయును. అప్పుడే

మానవసంఘ మంతయు జాతి మత దురహంకారములు విడనాడి, ఒకే యొక లక్ష్యసిద్ధికిఁ బాటుపడుచు నొకరి నొకరు కలహించుకొనుటను మఱచిపోదురు. ఈ విధముగా మానవసంఘములలో సత్యమైన సమైక్య భావన, సత్యమైన దేశసేవ, సత్యమైన దేశప్రేమ, దీనితో సత్యమైన విశ్వప్రేమ అనునవి క్రమముగ నుదయించును. దీనికంతకు జనతలో భిన్నభావన ముందు సమయవలెను. దీనితో వారి తామస ప్రవృత్తి తరలిపోవును. వెంటనే యిట్టి వారికి శ్రీ కాళిదాసు నుడివినట్లు సన్మార్గ సందర్శనాభ్యుదయము సమకూరును. ఈ విధముగా దేశకల్యాణము లోకకల్యాణము స్వయముగఁ జేకూరుచున్నవి.

ఇంతవఱకుజరిగిన చర్చనుబట్టి తేలిన పరమార్థ సంగ్రహ మిది. "సర్వవ్యాపియై యున్న పరమేశ్వరుఁ డొక్కరుఁడే. స్వతః వీనికి నెట్టి వికారములు కాని యెట్టి భేదముకాని లేదు. ఇట్టి యేకైకతత్త్వము విశ్వకళ్యాణకామనతో సత్త్వాది త్రిగుణముల నాశ్రయించి సృష్ట్యా ద్యనుకూలముగ నామరూపము లనేకములు దాల్చి ప్రపంచరూపమును దాల్చును. ఇట్లు మాఱినను ఈతని మూలతత్త్వము చెడదు. కనుక కేవలనామరూపములచేఁ బరమేశ్వరున కేర్పడిన భిన్నతను లేక వివిధ రూపములను బురస్కరించుకొని కొందఱు భేదభావములకు లోనగు చుందురు. ఇట్లు లోనగుట పరమేశ్వరుని నిజరూపమును దెలియమి చేతనే సంభవించును. కనుక నిట్టి యజ్ఞతతో గొందఱు భేదభావము లతోఁ దమ లక్ష్యమును మఱచి కష్టములకు లోనగుచుందురు. కనుక 'భిన్నభావన' మానవులకు కష్టములకే కారణమగుచుండును. కష్టకారక మగు నిట్టి భేదభావములను జనులు పోఁద్రోలి, సత్త్వప్రవృత్తితో నిరహంకారులు కావలెను. ఇదే అద్వైతమతము." ఇదే గాంధీ మహాత్ముని

"ఈశ్వరఅల్లా తేరే నామ్"

అను సందేశము.

కనుక జనులందఱు తమతమ కులదైవతములను సర్వదేవతాత్మకముగ భావించి ఆరాధింపవలెను. ఇట్టి ఆరాధనలన్నియు నొకే పరమేశ్వరునికిఁ జెందును. అతఁడు అప్పు డందఱిని సమభావన కలవారిగ ననుగ్రహించును. ఇట్టి సమభావనకల మానవునిలో "భూతదయ కలిగి" "విశ్వప్రేమ"యు దేశసేవాభావము నుదయించును. దీనితో

"మానవసేవయే మాధవసేవ"

అను దివ్యభావము "వసుధైక కుటుంబక" భావము ఉదయించును. ఇట్టి భావముకలవారు "మహాత్ములు" అనిపించుకొని కృతకృత్యులై చరితార్థజన్ము లగుదురు.

ఇట్లు మనకవి, కాంతాసమ్మితముగ విశ్వశ్రేయస్సంపాదకముగు కావ్యసందేశము నొసంగి, విశ్వసంస్తవనీయుఁ డగుచున్నాడు.

ఈ మహాకవి కవితయందు "తత్త్వజ్ఞానము" వ్యంగ్యమర్యాదచే నెట్లు ప్రకాశించుచున్నదో నిక సంగ్రహముగఁ జూపి యీ విషయమును ముగించెదను.

## కాళిదాస తత్త్వజ్ఞాన వైభవము

కాళిదాసకవీంద్రుని కవితావాహినిలో నైహికవిషయములతోఁ బాటు ఆముష్మిక విషయ విజ్ఞానవాహినికూడ నంతర్వాహినియై ప్రవహించిన విధమును ఈక్రింది కావ్యోదాహరణములు మనకు స్పష్టము సేయఁగలవు. ఈ కవి, కుమారసంభవములోని గౌరీముఖ వర్ణనా సందర్భములో

"ఉమాముఖం తు ప్రతిపద్య లోలా ద్విసంశ్రయాం ప్రీతి
మవాప లక్ష్మీం"॥ (మా. కు. సం. 1-43)

* "విశ్వశ్రేయః కావ్యం" శ్రీ నన్నయభట్టారకుని "ఆంధ్రశబ్ద చింతామణి" ఆద్యసూత్రము.

"కాంతిలక్ష్మి, చంద్రారవిందములలో నున్నపుడు పొందలేని ప్రీతిని, ఉమాముఖము నాశ్రయించినపు డొక్కసారిగ పొందిన దని దీని ముఖ్యార్థము. ఇట వ్యంగ్యరీతిచే వచ్చు నర్థాంతర మిది. "సంస్కృత కవితాలక్ష్మి ఉమాముఖలక్ష్మివంటి కాళిదాసుని కావ్యలక్ష్మినిపొంది, ఐహికాఽఽ ముష్మికరూపమైన ద్వివిధప్రీతి నొక్కసారిగ పొంది నది." అనఁగా నీకవి కావ్యాలలో నుత్తమాధికారులకు ఐహిక విషయానందముతో పాటు ఆముష్మికానందముకూడ వెన్వెంటనే కల్గు చున్న దని వ్యంగ్యార్థములోని పరమార్థము. ఇట్లే ఇతని రఘువంశ కావ్యములో—

"గుర్వర్థ మర్థీ శ్రుతపారదృశ్వా రఘో స్సకాశా దనవాప్య కామం।
గతో వదన్యాంతర మిత్యయం మే మాభూ త్పరీవాదనవావతారః॥
(5-24)

గురుదక్షిణార్థమై తనవద్దకు వచ్చిన వరతంతుశిష్యునితో రఘుమహా రాజు ఇట్లనును. "రఘువునుండి యొక యర్థి తన కాంక్షితము నంద లేక మఱియొక దాతకడకు వెడలినాఁడను నపవాదము నాకు లేకుండుఁగాక" యన్నమాటలే పై శ్లోకములోని ముఖ్యార్థము. ఇఁక వ్యంగ్యార్థములో "వేదాంతవేత్త యగు విద్యార్థి మోక్షపురుషార్థ మును గోరివచ్చి ఆ కోరికను రఘువంశకావ్యమునుండి పొందలేక మఱియొక గ్రంథము చదువుటకతడు వెడలినాఁడను నపవాదము కాళి దాసునైన నాకు లేకుండుగాక" అని కవి, పాఠకుని ప్రబోధించినట్లు ధ్వనించుచున్నది. అనఁగా తత్త్వవేత్తకు వలయు మోక్షజ్ఞాన సామగ్రి కూడ యీ రఘువంశమునందు, (ఇది ఉపలక్షణము గాన) ఇతని కావ్యములం దున్నదనియు, నజ్ఞతతో కొందరు లేదనుట ఈ కవికి అపచారము చేయుటవంటి దనియుఁ, గాన ఉత్తమాధికారి యగు పాఠకుఁడు, తన మోక్షవిషయక జ్ఞానమును విజ్ఞదృష్టితో సావధాన చిత్తతతో విలోకించిన తన కాంక్షితము నిందుండి బడయుట, కాళి

దాసునకు సంతోషకారణ మనియు భావము. ఈ వ్యంగ్యార్థభావమునే యింకను వివరించుచున్నట్లీ కవి, తరువాతి శ్లోకములో—

'స త్వం ప్రశస్తే మహితే మదీయే
వసన్ చతుర్థోఽగ్ని రివా గ్న్యగారే।
ద్విత్రా ణ్యహా న్యర్హసి సోఢు మర్హన్!
యావద్యతే సాధయితుం త్వదర్థం॥' (5-25)

ముఖ్యార్థములో రాజు వరతంతుశిష్యునితో నిట్లనును. "ఓ మానసీయా! నీవు నా త్రేతాగ్ని గృహములో నాల్గవయగ్నివలె రెండు మూఁడు రోజు లున్నచో నీ కాంక్షితార్థమును సాధించి యిచ్చెదను." ఇక వ్యంగ్యార్థములో కవి యుత్తమపాఠకునితో నుడివినట్లు భావించునది. "ఓ పాఠకోత్తమా! త్రేతాగ్నిగృహమువలెఁ బవిత్రమైన నా కావ్యమందిర * ములో నాల్గవయగ్నివలెఁ బవిత్రభావభాసుకుఁడవై నసీవు సావధానచిత్తుఁడవై పరమార్థచింతతో నిరీక్షించియున్నచో నీ కాంక్షితార్థమైన మోక్షపురుషార్థమును సాధించి నీకందించెదను." ఆత్మజ్ఞానోపలబ్ధికి తత్సాధకుఁడు తద్విషయకమైన మననము, ధ్యానము, నిధి, ధ్యాసము అను వానితో "ఆత్మ" పర్యాలోచనను చేయవలెనని బృహదారణ్యకోపనిషత్తులో నిట్లు చెప్పఁబడినది.

"ఆత్మావాఽరే! ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః॥"

ఇది యాజ్ఞవల్క్య మైత్రేయికి 'ఆత్మ'ను బోధించుచున్న సందర్భములోనిది. ఇట్లు నిరంతర నిరీక్షతోఁ జూచిన పాఠకునికి కాళిదాసకావ్యములలో చతుర్థపురుషార్థసిద్ధి తప్పక చేకూరునని కవి యిట ధ్వనింపఁజేసినాడు. మోక్షసాధనమైన యిట్టి తత్త్వజ్ఞానము ఈ కవీశ్వరుని

"కర్మబంధచ్ఛిదం ధర్మం భవస్యేవ ముముక్షవః"

(కూ. కు. సం. స. 2)

---

* ఇతని కావ్యములు త్రేతాగ్నులవలె మూఁడు దృశ్యకావ్యములును మూఁడే.

మున్నగు సూక్తులవలన సువ్యక్తమగుచునే యున్నది.

ఈ "యాత్మజ్ఞానము" మానవునకు, వాని యహంకారాదు లంతరించినఁగాని యలవడదు. ఈ యహంకారవార్ధి తరించవలె నన్న, మానవునిలో సాత్త్వికశక్తి సముజ్జృంభింపవలెను. ఈ సాత్త్విక భావోదయమునకు మానవుని తామసికవృత్తి తరలిపోవలెను. ఇట్లు సాత్త్విక గుణసంయుతుఁ డైనపుడే మానవుఁడు తత్త్వజ్ఞానమును సంపాదింపఁగల్గు చున్నాఁడు. ఈ విశిష్ట విషయ కదంబమును ఇతని శాకుంతల నాటక కథాభాగము వ్యంగ్యరీతిచే నిట్లు ప్రకాశింపఁజేయుచున్నది

దుష్యంతుఁడు కణ్వాశ్రమమునకుఁ జెందిన పెంపుడులేడిని వెంటాడుటతో నీ నాటక కథ ప్రారంభ మగుచున్నది. ఇచ్చట ఈ క్రింది నాటక కథావిషయములు ముఖ్యములై విశిష్టార్థ ప్రతిపాదకము లగుచున్నవి. పరిశీలింపుఁడు.

(1) రాజు, పరుగిడుచున్న లేడిని బట్టి హింసించుటకై రథాశ్వములను వేగముగఁ ద్రోలుమని సారథిని ప్రేరేపించును.

(2) రథాశ్వవేగవర్ధనముతో రాజు నింద్రియాశ్వవేగము కూడ హెచ్చి, ఆ వేగము రాజులోని హింసాప్రవృత్తిని ప్రవృద్ధముగఁ జేయును.

(3) రథవేగమునకుభీతిలి ప్రాణత్రాణమతియైనలేడి యతిశయముగఁ బరుగిడుచు రాజును గహనములోని కాకర్షించుకొనిపోవును.

(4) తపోవన ద్వారమువఱకు నాకర్షితుఁడైనరాజును జూచి యచ్చటి మునులు వాని నా హింసనుండి నివారించెదరు.

(5) రాజు వారి ప్రబోధ కారణముచేఁ దన ధనస్సుతోపాటు తన హింసావృత్తినిగూడ విడనాడి సత్త్వవృత్తిని సమాశ్రయించును.

(6) రాజుయొక్క సత్త్వ సమాశ్రయమునకు సంతసించిన మునులు రాజు నాశీర్వదించెదరు.

(7) రాజు తపస్విప్రార్థనముచేఁ గణ్వాశ్రమములోనికి వెళ్లును.

(8) అట రాజునకు శకుంతలాదర్శనభాగ్యము, పరమానందప్రాప్తి భాగ్యము చేకూరును.

పై విషయాష్టకముతోఁ గూడిన కథాంశములను విమలచిత్తముతో విలోకించినచో నీ క్రిందిరీతిని పరమార్థము ధ్వనింపఁగలదు.

మానవుఁడు తన యింద్రియములనెడు అశ్వములను కోరికలనెడు మృగములమీఁదకు విచ్చలవిడిగ విడిచి విహరించుచున్నంత వఱకు నట్టివాని నా మృగములు దుష్యంతుని మృగమువలె విషయారణ్యములోనికి ఆకర్షించుననియు, అట్లాకర్షితుఁడైనవానికి అహంకార పూర్వకమైన హింసా ప్రవృత్తియే ప్రవృద్ధ మగుచుండు ననియు, నిట్టి హింసాపరాయణుఁడు కొంతకాలమునకుఁ దన పూర్వపుణ్య వశమున, నే మహానుభావునిచే నైనఁ బ్రబోధ్యమానుఁడై తన యకృత్యములకుఁ బరితపించి పరిశుద్ధచిత్తుఁడు కాగలిగినచో, వెన్వెంటనే వానికి సత్త్వగుణసంయుక్తుఁడగు దుష్యంతునకు శకుంతలవలె బ్రహ్మానంద ప్రాప్తి లభించు ననియుఁ బై విషయాష్టకము వ్యంగ్యరీతిని సూచించుచున్నది. పై ధ్వన్యర్థమంతయు కాళిదాసదుష్యంతుని భావిచరిత్రలోఁ బ్రతిఫలించిన విధము శాకుంతలపాఠకులకు విదితచర మైనదే. ఇందు, రాజు అహంకారముతో శకుంతలను బ్రత్యాఖ్యానించి, యభిజ్ఞాన జ్ఞానానంతరమునఁ బశ్చాత్తాప ప్రక్షాళిత పాపపంకిలుఁడై విశుద్ధచిత్తుఁ డగుట విలోకింపఁదగిన విశిష్ట విషయము. ఈ పశ్చాత్తాపముతో రాజున కంతకుముందుగల యహంకార మణఁగిపోయినది. పుటతప్త జాంబూనదమునకు నైర్మల్యమువలె వాని చిత్తమునకు నైర్మల్యముదయించి 'చిత్తశుద్ధి' చేకూరినది. ఈ సందర్భములో నితని చిత్తశుద్ధినిగూర్చి మరీచ మహర్షి శకుంతలతో—

"వత్సే ! చరితార్థాసి !

"శాపా దసి ప్రతిహతా స్మృతిరోధరూక్షే ।

భర్తర్యపేతతమసి ప్రభుతా తవైవ ।

ఛాయా న మూర్చ్ఛతి మలోపహతప్రసాదే।
శుద్ధేతు దర్పణతలే సులభావకాశా" (7 అంకం)

అద్దము వినిర్మలముగా నున్నప్పుడు అం దగ్రస్థితవస్తుచ్ఛాయ ప్రతిఫలించునట్లు, మానవుని వినిర్మలచిత్తమున పరమాత్మ వస్తుచ్ఛాయ ప్రతిబింబించు నని యిందలి వ్యంగ్యార్థము. మన మహాకవి, దుష్యంతుని విశుద్ధచిత్తతతోపాటు దన 'విశుద్ధత'ను దన 'విముక్తత'ను గూడ సూచించినాఁడు. విముక్తుఁడగు వాని కిఁక నిహమునఁ గావలసిన దేముండును? తన కమనీయతమకవితాప్రతిభతో మర్త్యలోకము, నమర్త్యలోకాధికముగ నమరఁజేసి యీ కవి పూర్ణమనోరథుఁడైనాఁడు. కాన నైహికముగా నీ కవి కిక వలయున దేదియు లేదు. శకుంతలా పునః ప్రాప్తితో దుష్యంతుఁడుకూడ నిట్లే యైహికముగ నవాప్త సర్వమనోరథుఁడైనాఁడు. కనుకనే యీ కవి దుష్యంత ముఖమునఁ దన కిఁక "పునర్జన్మ రాహిత్యమే" చరమలక్ష్యమని సూచించినాఁడు. ఈ తాత్త్విక శిరోమణి యొక్క భావ మింతగఁ బరిణత మగుటకుఁ దగినంత పుష్కల పూత సామగ్రి యీ కవీశ్వరుని నాటకాది నుండియుఁ జక్కగ సందృష్టమగుచునే యున్నదనుటకు ఈ క్రింది యుదాహరణములు చాలును. తపోవన పాదపములకు ఘటముతో జలము లిడుచున్న శకుంతలను జూచి మొదట రాజు తనలో నిట్లనుకొనెను.

"ఇదం కిలా ఉవ్యాజమనోహరం వపు।
స్తపః క్షమం సాధయితుం య ఇచ్ఛతి।
ధ్రువం స నీలోత్పలపత్రధారయా।
సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి॥" (అంకం 1 శ్లో. 18)

"నిసర్గసుందరసుకుమారమైన శకుంతలయొక్క సుందరరూపమును గ్లిష్టకార్య సమానత్వముగఁ జేయఁదలఁచిన కణ్వర్షి సుకుమారమగు నల్లకలువపూరేకుటంచుతో కఠినమైన సమిల్లతను ఛేదించుటకుఁ

ప్రయత్నించుచున్నాఁడు." ఇది ముఖ్యార్థము. ఇఁక నిందలి ధ్వన్యర్థమిది. ఋషితుల్యుఁడైన కాళిదాసు * శృంగారప్రధానమైన తన సుకుమార శాకుంతల కథాభాగము అను సుకుమారసాధనముచే, కృచ్ఛ్రచాంద్రాయణాది నియమసాధ్యమై, కఠినాతికఠినమైన మోక్ష పురుషార్థ సాధనము అను మహాకార్యమును సాధించుటకుఁ బూను కొనినాఁడు." శృంగార ప్రధానమగు కథాంశముతోఁ దత్త్వజ్ఞాన సాధ్యమైన మోక్షవస్తువును సాధించుట మహాకార్యసాధనమే కదా!

దీనితో నీ తత్త్వవేత్త, తత్త్వజ్ఞానపరిపూర్ణుఁ డనియు, బర మాత్మజ్ఞానసంపన్నుఁ డనియు నవగతమైనది. నిజమున కీ శాకుంతల నాటక కథారూపము కేవల "జ్ఞాన" జ్ఞేయమైన దను విషయ మీ క్రింది శ్లోకార్థముచే వ్యక్తమగుచున్నది.

"అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసం
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూప మనఘం
న జానే భోక్తారం క మిహ సముపస్థాస్యతి విధిః॥"

ఇందలి ముఖ్యార్థము "సౌందర్య సమారాధనా" సందర్భమున విదితము. ఇఁక నిందలి వ్యంగ్యార్థము— ఇందు రేఖాంకితమైన వస్తు పంచకము జ్ఞానేంద్రియ గ్రాహ్యమైనది. ఇట్టి పంచకముతో నభిన్న మైన శకుంతలారూపము, అనఁగా శాకుంతల కథారూప తత్త్వము, కూడ 'జ్ఞాన'గోచర మైనదేయని యిందు ధ్వనించుచున్నది. ఇంతటి యీ కథారూపవైభవమును దత్త్వతః తెలిసికొని యానందింపఁ గల యే తత్త్వజ్ఞానిని— (ఏ యుత్తమాధికారిని—) బ్రహ్మ సృజించెనో? యని కవి భావన యున్నట్లు భావించునది. ఇట్లే యింకొకచోట దుష్యంతుఁడు విదూషకునితో—

* "నాఽనృషిః కురుతే కావ్యం" (అలంకారికోక్తి)

"సఖే! అనవాప్తచక్షుః ఫలోఽసి
యేన ద్రష్టవ్యానాం పరం న దృష్టం॥ (అంకం 2)

"మాఢవ్యా! శకుంతల ఉత్తమ వస్తువు లన్నిటిలో ఉత్తమ వస్తువుగా అనఁగా ఉత్తమోత్తమ సుందర వస్తువుగాఁ జూడఁదగినది. అట్టి సుందరతమవస్తువును నీవు చూడలేకపోతివి గాన నీవు నేత్రము లున్నందుకుఁ దగిన ఫల మందలేదు." ఇది ముఖ్యార్థము. ఇందలి వ్యంగ్యార్థ మెట్టిదనఁగా "పరమాత్మవస్తువు ప్రపంచములోఁగల వస్తువులన్నిటిలో ఉత్తమ వస్తువుగాఁ దెలియఁదగినది. అట్టి యుత్తమ వస్తువును చూడలేనివాఁడు (తెలియనివాడు) కనులున్నను అంధ ప్రాయుఁ డగును.

"యద్జ్ఞాత్వా నేహభూయోఽన్యద్ జ్ఞాతవ్య మవశిష్యతే॥"

"ఏ యుత్తమవస్తువును దెలిసికొనిన పిమ్మట ఈ ప్రపంచమున నిఁక దెలిసికొనవలసిన వస్తువనునది యుండదో? అట్టి పరమాత్మ వస్తువును — సాధనావిశేషములఁ దెలియనివాఁడు అంధప్రాయుఁడే. కనుకనే

"చక్షుష్మత్తాతు శాస్త్రేణ"

అని అభిజ్ఞులనినారు.

ఇఁక "తత్త్వజ్ఞానవైభవ" భాగములో నింతవఱకుఁ గల పరమార్థ సంగ్రహ మరయుదము. మానవుఁడు లౌకిక ప్రపంచములోఁ దన లౌకిక కృత్యములను నెరవేర్చుకొనుచున్నను దన పరమలక్ష్యమును మఱువరాదు. అతఁడు కేవల రాజసవృత్తితో నహంకారాదుల కధీనుఁడై యున్నంతవఱకు వానియింద్రియవేగము వానిని హింసాప్రవృత్తిప్రవణుని జేయును. కాన నహంకారాదుల నణఁగఁద్రొక్కుటకు మానవుఁడు దాఁజేసిన యకృత్యములకుఁ బదేపదే పశ్చాత్తాప సంతప్తుఁడు కావలెను. పశ్చాత్తాపక్షాళితపాపపంకిలుఁడైనవాఁడు సత్త్వసంయుక్తుఁ డగును. అప్పుడే మానవుఁడు దురహంకారదూరుఁడై శమితాహంకారుఁడై విశుద్ధచిత్తుఁడు కాఁగలుగును. ఇట్లు చిత్తశుద్ధి

చేకూరిన వానికి వాని వినిర్మల చిత్తములో, వినిర్మలదర్పణములో వస్తుచ్ఛాయవలె బరమాత్మ వస్తుచ్ఛాయ ప్రతిబింబించును. దీనితో నిట్టి వానికి నైహిక వాంఛా రాహిత్యము, మోక్షపురుషార్థసిద్ధియుఁ జేకూరును. ఇట్టి జీవన్ముక్తునికి బ్రహ్మానందానుభవ ప్రాప్తి సులభమే యగును.

కనుక నో పాఠకులారా! దురభిమానాదులతోఁ దమ సాటి వారిని, దమసాటి మతములను నేవగించుకొనుట కేవల భ్రమ మూలము, దుఃఖమూలము నగుననియు, నిట్టి దురభిమానము వీడి సత్త్వవృత్తితో మహాత్ముల యుపదేశములను మన్నించి యాచరించు వారు దుష్యంతునివలె నభ్యుదయపథము నందుకొనగలరనియు నహంకారావిష్టులై యున్నంతవఱకు భ్రమప్రమాదాయాస కష్ట నష్టాదులకు లోనగుచుందురనియుఁ గాన మొదటినుండియు సత్త్వలాభమునకు యత్నించుచు, తమ తమ వృత్తులతో సుఖజీవనులై తుదకు "చిత్తశుద్ధి" వడసి పరమాత్మజ్ఞాన ప్రాప్తితోఁ జరితార్థజన్ము లగుటయే మానవజన్మకు ఫల మనియు మన కాళిదాస కవీంద్రుని కమనీయ కావ్యలక్ష్మి ప్రబోధించుచున్నది. ఇది యధికార తారతమ్యమును బట్టి ముఖ్యార్థముచే మనల నైహికానందయుతులుగను, వ్యంగ్యముగ నాముష్మికానందయుతులుగను జేసి, యిటు సర్వజనమనోరంజకముగ దన సరస సుందర సుమధుర సుకుమార సూక్తులచే ప్రమోదకరముగఁ లోకము నిట్లు ప్రబోధించుచున్నది. కనుకనే యాలంకారికు లిట్టి మహా కవుల కావ్యలక్ష్మిని వేదపురాణాధికముగ నిట్లు కీర్తించినారు.

"య ద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
య చ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్ ।
కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే ॥